C. Subbunarasimham.

శ్రీ ర స్తు

# శృంగార శాకుంతలము

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి విరచితము







పబ్లిషరు

కొండపల్లి వీరవెంకయ్య

బుక్సెల్లరు, రాజమండ్రి








రాయవరమున

శ్రీ మేరీముద్రాక్షరశాలయందు మల్లిడి సత్తిరెడ్డిగారిచే

ముద్రింపఁబడినది.

1930


 వెల రు 1—0—0

శ్రీరస్తు

# శృంగారశాకుంతలము

## ప్రథమాశ్వాసము



శ్రీవత్సాంకుఁడు భక్తవత్సలుఁడు లక్ష్మీప్రాణనాథుండు రా
జీవాక్షుండు సమస్తభూత భువన క్షేమంకరాకారు
రూపావిర్భావుఁడు వాసుదేవుఁ డనుకంపావార్ద్రి దాన వి
ద్యావిఖ్యాతుని మంత్రివెన్నని నితాంత శ్రీయుతుం జేయుతన్. ౧

సీ. పూని చరాచరంబు ధరించు నొకమూర్తి యుడుపుఁ దృష్ణాఖేద మొక్కమూర్తి
యారగించు మనోజ్ఞ మగుహవ్యంబొకమూర్తి యొసఁగుఁ జైతన్యంబు నొక్కమూర్తి
యాదిత్యులకుఁ ద్రోవయై పొల్చు నొకమూర్తి యుడుగణంబుల నేలు నొక్కమూర్తి
విశ్వంబు చీఁకటి విరియించు నొకమూర్తి హోతయై దీపించు నొక్కమూర్తి

తే. యరయ నెవ్వనియందు నయ్యష్టమూర్తి యిష్టఫలదాత కరుణాసమేతుఁ డగుచు
వెలయఁ జిల్లర నాగయవెన్నమంత్రిఁ జిరతరైశ్వర్యసంపన్నుఁ జేయుఁగాత. ౨

శా. చేయున్విశ్వము నెవ్వఁ డంచితకళాశిల్పం బనల్పంబుగా
వ్రాయుం బ్రాణుల ఫాలపట్టికల నెవ్వం డర్థవర్ణంబు లా
మ్నాయవ్రాతము లార్పు లెవ్వనికి నయ్యబ్జాతగర్భుండు దీ
ర్ఘాయుష్మంతునిఁ జేయు నాగవిభువెన్నామాత్యచూడామణిన్. ౩

మ. జననీ స్తన్యముఁ గ్రోలుచుం జరణకంజాతంబునం గింకిణీ
స్వన మింపారఁగఁ దల్లిమేన మృదుల స్పర్శంబుగాఁ దొండ మ
ల్లన యాడించుచుఁ జొక్కు విఘ్నపతి యుల్లాసంబుతో మంత్రి వె
న్ననికి న్మన్నన సొంపుమీఱ నొసఁగు న్భద్రంబు లెల్లప్పుడున్. ౪

సీ. పగడంపు జిగురుఁజొంపము సొంపు విహసించు కడునొప్పుఁ గుఱుచ కెంజడలవాఁడు
విదియచందురుతోడ వీడుఁజోడాడెడు రమణీయ దంష్ట్రాంకురములవాఁడు

సీధుపానక్రీడఁ జెంగల్వపూఁజాయఁ దొంగలించెను కన్నుదోయివాఁడు
క్రొత్త నీలాలరంగునకు నించుక మించి మెఱుఁగారు నల్లని మేనివాఁడు
తే. పృథివి కవతంసమణియైన బిట్రగుంట, దానకంబుగ నవలారమైనవాఁడు
భైరవస్వామి సకల సంపదలనొసఁగి, మనుచుఁ జిల్లర వెన్నయామాత్యవరుని. 5

ఉ. మెచ్చుగు విచ్చుదమ్మి పువు మేడలలోన నిధాన దేవత
ల్వచ్చి కటాక్షసంజ్ఞలఁ గొలంకులఁ గొల్వఁగ నోలగంబు సొం
పచ్చుగనుండు చంద్రముఖి యాదిమలక్ష్మి వసించుఁ గావుత
న్మచ్చిగ వెన్నయప్రభుని మందిర రాజమునందు నిచ్చలున్. 6

మ. పొసఁగ న్నేఁ గృతిఁజెప్పగాఁ బరిమళంబు ల్చాల కొక్కొక్కచోఁ
గొస రొక్కించుక గల్గెనేనియును సంకోచంబు గాకుండ నా
రసి యచ్చోటికి నిచ్చుఁగాత పరిపూర్ణం బొంద వాగ్దేవి యుం
పెసలారం దన విభ్రమశ్రవణ కల్హారోదయామోదమున్. 7

శా. అర్థి న్నాత్మకుశ మానసాబ్జమున నధ్యాసీనుఁ గావించి సం
ప్రార్థింతు న్యతిసార్వభౌముఁ బరమ బ్రహ్మానుసంధాత నా
నార్థాలంకృత బంధురశ్రుతి రహస్యజ్ఞాత శ్రీభారతీ
తీర్థశ్రీచరణంబు నల్లపిత ముక్తి ప్రేయసీ వల్లభున్. 8

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి. 9

సీ. వల్మీకసంభవ వ్యాసమౌనీంద్రుల వాణి కంజలి బంధసాణి గూర్చి
భట్టబాణమయూర భట్టారకుల మంజు భాషావిశేషంబుఁ బ్రస్తుతించి
భవభూతి శివభద్ర బంధురభారతీ హేలావిలాసంబు నిచ్చగించి
మాఘభారవుల నిరాఘాట చాటు సరస్వతీ పుణ్య గౌరవముఁదలఁచి
తే. లల్లటుని గాళిదాసు సౌమిల్లకునిని, భామహుని దండి వాసును భాసు హర్ష
హర్ష సంపూర్ణహృదయుఁడనై కవిత్వ, సమధికస్ఫూర్తి భక్తిసంస్తుతించి. 10

క. ఇట్టులమగు మతి భారత, ఘట్టమునకు నడవ యచ్చుఁగట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ, భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్. 11

గీ. ఉభయకవిమిత్రు నత్యంత శుభచరిత్రు, భానుసమతేజుఁ గొమ్మయ ప్రభుతనూజు
సుకృతవిభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ, బ్రణుతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి. 12

వ. ఒక్క ప్రబంధంబు రచియింపఁ బూనియున్నంత. 13

సీ. సకలభూపాలకాస్థాన సౌధంబుల వర్ణింతు రేమంత్రి వాగ్విభూతి
సంతాన సురధేను చింతామణుల పెంపు ధట్టించు నేమంత్రి ధ్యానమహిమ

యాశాంత దంతి దంతాఘాటములమీఁద విహరించు నేమంత్రి విమలకీర్తి
సుకవిగాయకబహుస్తుతి ఘోషణంబున నలరు నేమంత్రి గేహాంగణంబు
తే. వాఁడు కౌండిన్యగోత్రాభివర్ధనుండు, మదవదరి సైన్యపతిమాన మర్దనుండు
నాగయామాత్య తనయుండు నయవిశేష, విజితసురమంత్రి చిల్లర వెన్నమంత్రి. 14
వ. ఆమంత్రిమందారం బొక్కనాఁడు పురాణేతిహాసప్రసంగంబుల వినోదించుచుఁ దన
మనంబున 15
శా. నల్లిల్లుం గుడియును స్వనంబును నిధానంబుం దటాకంబు నం
జిల్లుం గొండొకకాల మేఁగ నవి విచ్ఛేదంబునుం బొందు నే
పొల్లుం బోనిది కీర్తికిం గృతియ పో భూమండలిం దానికిం
దెల్లం బిప్పుడు రామ భారత కథాధీన ప్రబంధావళుల్. 16
సీ. వల్మీకసంభవు వాక్యసంపన్నత దశరథాధీశ నందనుకీర్తి
సాత్యవతేయు వాచావిలాసంబునఁ గాంగేయ పంచకాగ్రణి ప్రశస్తి
చిత్తపవచనరాజి నిబంధనంబున దారకాపురాధ్యక్షు మహిమ
కాళిదాస వచోవిశాలతా ప్రౌఢత విక్రమాదిత్య భూవిభునిచరిత
తే. మతిరయఁ దత్తత్కవీంద్ర సమగ్రవాగ్మి, భూతిఁ దెలుపుచున్నది పూర్వరాజ
శీల దానాదిచర్యావిశేషములను, గీర్తిసదనంబు కృతియ తర్కింప ధరణి. 17
క. ఆచంద్రతారకంబుగ, భూచక్రమునందుఁ గీర్తిఁ బోషింపఁగఁ దా
రోచిష్ణు వగు ప్రబంధము, వైచిత్రి మొనర్చు సుకవివరుఁడు గలిగినన్. 18
సీ. నన్నపార్యుఁడు ప్రబంధప్రౌఢవాసనా సంపత్తి సొంపు పుట్టింప నేర్చుఁ
దిక్కన యజ్వవాగ్భక్తి కామోదంబు చెలువు కర్ణముల వాసింప నేర్చు
నాచిరాజుని సోము వాచామహత్త్వంబు సౌరభంబులు వెదచల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషానిగుంభంబుల పరిమళంబుల గూడఁ బఱచ నేర్చు
తే. మహితగుణశాలి పిల్లలమఱ్ఱి వీర, నార్యు, డాయింటఁ బైతామహంబగుచును
వెలయుచున్నది నేఁడు కవిత్వలక్ష్మి, యఖిలసత్కవి నికరంబు నాదరింప. 19
క. ఆసుకవిచేత శివభజ, నాసక్తునిచేఁ గళ్యపాన్వయుచేతన్
భాసుర నవకవితాల, క్ష్మీ సదనునిచేత వలయుఁ గృతిఁ జెప్పింపన్. 20
మ. అని సాధ్వీమణి నాగమాంబకును విద్యాభారతీజాని గా
దనకుం బుత్రుని వీరభద్ర పదపద్మధ్యాన శుద్ధాంత రం
గుని నన్నుం బిలిపించి లోనఁ దనకోర్కుల్ సందడింపంగ మ
న్ననదైవాఱఁగ గారవించి పలికెన్ గంభీర వాక్ప్రౌఢిమన్. 21

సీ. రచియించినాఁడవు రమణీయవాగ్రీతి నవ రసదర్పణం బభినవముగఁ (?)
బలికినాఁడవు తేటపడఁజేసి నారదీయము సత్కవిశ్రేణి యాదరింపఁ
జెప్పినాఁడవు శేముషీ విశేషంబున మాఘమాహాత్మ్యంబు మంజుఫణితిఁ
గావించినాఁడవు ఘనబుద్ధి మానసోల్లాససారము సముల్లసిత కయ్య
తే. భారతీతీర్థ యతిసార్వభౌమ గురు కృ, పాతిశయ లబ్ధ కవితా విభూతిఁగలిగి
గౌరవముఁ గాంచినాఁడవు కవులచేత, విపుల చాటూక్తి నిర్నిద్ర వీరభద్ర. 22

గీ. కలదు చాలంగఁ బ్రేమ నీవలన నాకు వేడ్క నడిగెదఁ గవులెల్ల వేడ్కపడఁగ
మత్సహస్రముఖోద్భవ సచివులందు సుకృతిగాఁ జేయు నా కొక సుకృతిఁ జేసి, 23

శా. ప్రఖ్యాతంబగు మిశ్రబంధమను సత్పద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతంబగు వస్తువందు మతి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్తమైన కృతిచెప్ప న్సక్తసు శ్రోతకు
న్విఖ్యాతిం గలిగించుఁ బుణ్య మహిమ న్విశ్వంభరా మండలిన్. 24

క. శృంగారము ముఖ్యంబగు, నంగియు నంగములఁ దలఁప నష్టరసములు
న్నాంగ మగునేని డంకము, బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్. 25
గీ. కథ ప్రసిద్ధయు మిగుల శృంగారవతియుఁ, బరిగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథితమైన శకుంతలాఖ్యానభంగి, నది ప్రబంధంబుఁ జేయఁ బ్రఖ్యాతినొంద 26

సీ. సరపువ్వులుగ మాలకరి పెక్కు తెఱఁగుల విరుల నెత్తులుగఁ గావించినట్లు
కర్పూరకస్తూరికా వస్తు వితతిచే శ్రీఖండచర్చ వాసించినట్లు
ఒడికంబుగా గందవొడికి నానాసూన పరిమళంబులు గూడఁ బఱచినట్లు
సరఘలు వివిధపుష్ప మరందలవములు గొనివచ్చి తేనియఁ గూర్చినట్లు
తే. భారతప్రోక్తకథ మూలకారణముగ, కాళిదాసుని నాటకక్రమము కొంత
తావకోక్తిక నభినవశ్రీవహింపఁ, గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు. 27

వ. అని సవినయంబుగాఁ గర్పూరతాంబూలంబు జాంబూనదపాత్రంబున నర్పించి
ప్రార్థించినఁ దద్వచన ప్రకారంబున మిశ్రబంధంబుగా శాకుంతలం బను ప్రబం
ధంబు బంధురప్రీతిం జెప్పఁబూనితి నేతత్ప్రారంభంబునకు మంగళాచారంబుగాఁ
గృతినాయకుని వంశావతారం బభివర్ణించెద. 28

క. ఖండేందు ధరసమాను న, ఖండ తపోరాజ్యసమధిగత పీఠస్థుం
గౌండిన్యుఁ జెప్పఁదగు మునిమండల మకుటావతంస మాణిక్యంబున్. 29

శా. తద్వంశాంబుధిఁ గల్గె మేడనసుధాధాముండు భూమండలి
న్విద్వత్సన్నుతశీలి యాచకసురోర్వీజంబు దిక్పాలయో
షిద్వక్షోరుహ హార మౌక్తికమణిశ్రేణీ లసత్కీర్తి జం
బూద్వీపావని పాలమంత్రి విభవాంభోజాటవీ చంద్రుఁడై. 30

ఉ. భూనుత వైభవస్ఫురణఁ బొల్పువహించిన సోమరాజు ప
ల్లీనగరామరావతికి లేఖప మంత్రియుఁబోలె నీతి వి
ద్యా నిపుణత్వ మొప్పఁగఁ బ్రధానులలో నుతికెక్కె భామినీ
మీన పతాకమూర్తియగు మేడన రాజులు గారవింపఁగన్. 31

సీ. లవణాబ్ధి వేల హేలాకాంచి యగు నంధ్రధరణి మండలికి ముత్యాలజల్లి
సంగ్రామ పార్థరాజన్య రాజ్యశ్రీకిఁ బెంపుమీఱిన జగజంపువెల్లి
దాతలు సముదంచిత ప్రసూనములుగాఁ గామితార్థములిచ్చు కల్పవల్లి
యఱువదినాల్గు విద్యలకు నపూర్వ ఘంటాపథంబైన పట్టణవల్లి

తే. పంటనృప కౌస్తుభములకుఁ బాలవెల్లి, కదనజయలక్ష్మి తొలుచూలు గన్నతల్లి
విపుల భుజగర్వ దర్పిత విమతరాజ, రాజివ్రాద్భల్లి ధర సోమరాజుపల్లి. 32

క. ఆనగరము పైతామహ, మైన నిజస్థానముగ సమంచితలక్ష్మిం
దానొంది మంత్రి మేడన, జానుగ భజియించె సప్తసంతానములన్. 33

క. ఆ మేడనమంత్రికి సా, ధ్వీమణి మాచాంబకును శ్రుతిత్రయము గతి
న్నామత్రయంబు పోలిక, నామాత్యాయణులు గలిగి రనుపమ తేజుల్. 34

వ. అందు. 35

శా. దుగ్ధాంబోధి గభీరు రూపజిత చేతోజాతు సద్యత్ప్రభా
రుగ్ధాముం గరుణాభిరాము ధృతిమేరు క్ష్మాధరంబు న్సుధా
దిగ్ధస్వాంతు నితాంతదానసుర పృధ్వీజాతము న్బాంధవ
స్నిగ్ధుం జిల్లర తొట్టియ ప్రభుమణిం జెప్పందగుం బెంపునన్. 36

శా. ఆ రొట్టయ్యకుఁ గూర్మితమ్ముఁడగు వెన్నాఖ్యుండు ప్రఖ్యాతిగా
బ్రోయించె న్బహుదేశ భూవర సభామార్గంబులం దుల్లస
త్సాయంకాల నట న్మహానట జటాసంఘాత ధాటీవళ
త్తోయస్ఫాలన ఫక్కికానఘ యశస్తుత్తుంభ నిర్ఘోషముల్. 37

వ. తదనుసంభవుండు. 38

సీ. గౌతమ మునినాథుచేత నొప్పని మేను వికృతి నొందనినాఁడు వేల్పుఱేఁడు
బెడ్డిదో గిరిజాస్యబింబంబుఁ జూచుచోఁ దాల్మి వీఁడనినాఁడు తమ్మిచూలి
కలశపయోరాశి చిలుకు కవ్వపుఁగమ్మ కుంది కబ్బనినాఁడు మందరంబుఁ
గాళికావిభుని డాకాలి తాటింపులఁ గమలఁబారనినాఁడు కుముదహితుఁడు
తే. భోగధీస్థైర్యకాంతులఁ బోల్పఁబోలుఁ, గాని నాఁటికి నేఁ డీడుగారసంగ
వెలసె వెన్నయయనుజుండు వినయధనుఁడు, త్యాగశిబిరాజు చిల్లరనాగరాజు 39

క. ఆ నాగ సచివ ధీమణి, శ్రీనాయకుఁ డిందిరను వరించినకరణి
న్మానవతీతిలకముఁ బ్ర, ధీనుతగతిఁ బోలమాంబ వివహంబయ్యెన్. 40

ఉ. ఆపురుషావతంసమున కా సుచరిత్రకు నుద్భవించి ర
ద్దీపితకీర్తి వెన్నయయు ధీనిధి మేడనయు న్సమస్త వి
ద్యాపరమేష్ఠి యాదెనయు ధార్మికుఁ డెఱ్ఱనయు న్సధాను స
ల్లాపుఁడు వీరభద్రుఁడును లాలిత నీతికళాధురంధరుల్. 41

వ. ఇట్లు సముంచిత దానవంచితకల్పతరుపంచకంబగు నాయమాత్యకుమారపంచకంబునందు

మ. కులపాథోనిధి పూర్ణచంద్రముఁడు దిక్కుంభీన్ద్ర హేలాకట
స్థలనీరంధ్ర మదప్రవాహ లహరీ చక్రాంగ సత్కీర్తి కుం
డలి రాట్కుండల పూజనారతు డఖండశ్రీసమన్వితుఁడై
వెలసెం జిల్లర వెన్నమంత్రి సకలోర్వీచక్రవాళంబునన్. 42

క. వెన్నయ కూరిమితమ్ముఁడు, సన్నుతచరితుఁడు సమస్తజనసమ్మతుఁ డ
త్యున్నత వాచావైభవ, పన్నగపతి మేడమంత్రి ప్రస్తుతికెక్కెన్. 43

ఉ. మేడన పేర్మినొందెఁ బుడమి న్నయసంపద దేవమంత్రితో
నీడన యాచకావళి కభీష్టపుటీగుల కల్పశాఖికిం
జోడన ధీజనస్తుత వచోవిభవంబున శేషచక్రి వా
దోడన పాటిగా నతనితోఁ బెఱమంత్రులు జాడు మేడనన్. 44

శా. ఉన్నారెన్నిక కెందఱే సచివు లత్యుచ్చోదరు ల్వాల సం
పన్నుల్వారలఁ గింప చాసుల గణింపంబోరు వాగ్వైఖరు
ల్మిన్నుల్మోసి వెలుంగు సత్కవిజను ల్మేడయ్య వర్ణింతు రా
వెన్నామాత్యు ననుంగుఁ దమ్ముని జగద్విఖ్యాత చారిత్రునిన్. 45

క. అతని యనుజన్ముఁ డగు, నాతఁడు బుధవిబుధతరువు నలినదళాక్షీ
నూతనమదనుం డాదెన, భూతలము యశఃపటీరమున వాసించెన్. 46

ఉ. ఆదిఁ బ్రప్రధాను లెనయాదురుగాని సుధీగుణంబుల
క్ష్మ్రిని నేటివారి నుపమింప సమానులుగారు ధర్మస
మ్మోమ్రదికి సత్కళానివహమోహనవేదికి లోకహృన్ముదు
త్పాదికి మిత్ర భృత్య హిత బంధువినోదికి మంత్రియాదికిన్. 48

సీ. సలసమాగత ధర్మగుణరక్షణమున సీతాకాంతు రెండవతమ్మునికిని
నవికార నవమోహనాకారమునఁ బూండరసూతి రెండవతమ్మునికిని
సన్నుతాక్రాంతవిశ్రాణనంబునఁ బరేతస్వామి రెండవతమ్మునికిని
సుకృతసంగుణక్షణాశోభితామలబుద్ధి దశకంఠు రెండవతమ్మునికిని

తే. ఘనుఁ డి వెన్నయ్య రెండవతమ్మునికిని, సాటియనవచ్చు నవ విలసద్గుణముల
నఖిలబంధుజనంబుల నాదరింప, సన్నుతివహించు నాదెన సచివవరుఁడు. 49

వ. తదనుసంభవుండు. 50

సీ. జలజసంభవుఁడు ప్రజ్ఞావిశేషంబున నిర్జరాచార్యుండు నీతిగరిమ
వాతాశనస్వామి వాచానిరూఢత ధర్మనందనుఁడు సత్య ప్రశస్తి
జహ్నుకన్యాసూతి సచ్చరిత్రంబున శైలారి శంభుపూజనము కలిమి
జామదగ్న్యుఁడు ప్రతిజ్ఞాపాలనంబున సౌమిత్రి భ్రాతృవత్సలత పేర్మి

తే. వంశవనవాటి చైత్రుఁడన్వయపయోధి, చంద్రుఁడు గోత్ర జలజకాసార తిగ్మ
కరుఁడు కులనందనారామ కల్పతరువు, మహితగుణశాలి యెఱ్ఱనామాత్యమౌళి. 51

గీ. యెఱ్ఱనామాత్యు ననుజన్ముఁ డహిప భూష, ణాంఘ్రిపంకేరుహ భ్రమరాయమాన
మానసుఁడు మానధనుఁడ సమానగుణుఁడు, వీరభద్రుండు వితరణ విబుధతరువు. 52

ఉ. ఈజగమెల్లనుం బొగడు నెప్పుడు నెన్నికచేసి నిత్య వి
భ్రాజిత నీతిమార్గ బలభద్రుని జాత కృపాసముద్రునిం
బూజితరుద్రుని న్వివిధ పుష్పశరాసనకేలి భద్రుని
న్రాజిత దానసంపదసురద్రుని జిల్లర వీరభద్రునిన్. 53

వ. ఇట్లు విశిష్ట మాతాపితృ జన్యులు నభినంద్య సౌజన్యులు నగు వీరలయందు. 54

సీ. కూర్చుండ వయసునఁ గూర్చుండ నేర్చెను ననుదినత్యాగ సింహాసనమునఁ
గొంకక నడ నేర్చుకొనుచుండి నడనేర్చెఁ దప్పక వేదోక్త ధర్మసరణి
మాటలాడఁగ నేర్చు నాఁటనుండియు నేర్చెఁ బలుకంగ హితసత్యభాషణముల
చదువఁగ వ్రాయంగ సరవడి నేర్చియు నేర్చెను గార్యంబు నిర్వహింప

తే. వినయమున కాకరంబు వివేకమునకు, సీమ జన్మస్థలంబు దాక్షిణ్యమునకు
నాలవాలంబు విద్యలకరయమూర్తి, మహఁడు చిల్లర వెన్నయామాత్యవరుఁడు. 55

చ. అతఁడు వివాహమయ్యె సముదంచిత వైభవమొప్పఁగాఁ బతి
వ్రత యగు శైలమాంబయును వర్ణిత నిర్మల వాగ్విలాస వా
క్పతియగు సూరమంత్రియును భాగ్యఫలంబునఁ గన్న కన్నియన్
క్షితి ననసూయతోడ సరిసేయఁగవచ్చును సద్గుణాన్వితన్. 56

సీ. మాంగళ్యశృంగార మంగీకరించి వర్తించుచోఁ బార్వతీదేవి గుణము
నఖిలార్థులకును నిష్టార్థంబులిచ్చి సంభావించుచో రమాదేవి గుణము
హితమితోక్తులచేత నెదిరికిఁ బ్రీతి నొందించుచో భారతీదేవి గుణము
బరమపాతివ్రత్యపరతమై పతిభక్తి గావించుచో శచీదేవి గుణము
తే. వరుస నేనోము నోఁచి యొప్పఁగ గాంచె, సతుల కిట్టి గుణంబులు జగతిఁ గలవె
యనఁగఁ బొగడొందెనుతి బంధుజనకదంబ, మాస్యజితపూర్ణశశిబింబ యన్నమాంబ 57

శా. శ్రీవత్సాన్వయ సింధుజాత యగు లక్ష్మాంబ ప్రీతి నన్నాంబికం
దేవింగా వరియించి యా పరమసాధ్వీమౌళి రత్నంబుతో
శ్రీవత్సాంకుఁడు వోలె వెన్నన ఘన శ్రీమంతుఁడై సత్కృతు
ల్గావించె న్నిజబంధుమిత్రతతికిం గార్హస్థ్య మొప్పారఁగన్. 58

సీ. రక్షించె బంధువర్గముఁ బ్రమోదంబంద నర్థులకిచ్చె నిష్టార్థసమితిఁ
గట్టించె ఘనతటాకంబు లంబుధులుగా ధర్మశాసనములు దలచు నిలిపె
స్థిరసమున్నతి సంప్రతిష్ఠించె నల్లిండ్లు వరనిధానంబులు త్వరఘటించె
నన్నసత్రము లెడశైనచో సాగించె నోలిఁజేయించె దేవోత్సవములు
తే. సప్తసంతానపతిఁ జేసె జలధినేమిఁ, జేసె ధర్మంబు లెన్నేనిఁ జెలువుమిగులఁ
జేయుచున్నాఁడు సుకృతంబులాయతముగ, మనుజమాత్రుండె వెన్నయామాత్యమౌళి.

మ. శైలయం జిల్లర వెన్నయప్రభుఁడు దా వేదోక్తసంసిద్ధి వే
ళలఁ బ్రాసాదపుఁ బంచవర్ణమునఁ గాలగ్రీవుఁ బూజింపఁగా
నలవాల్మై మతి యొండెఱుంగవు తదీయ శ్రీనివాసంబునం
బలుకుం బంజర శారికాశుకములు స్వంచాక్షరీమంత్రముల్. 60

చ. విడువక సోమవారములు వెన్నన సేయఁగ వత్సలత్వ మే
ర్పడఁ దను దానవచ్చి నిజభక్తముఖంబుల నారగింపఁగాఁ
దడఁబడి పోక గంధములతావులు పూనిన మద్రసంబులం
గడుగఁబడెం గళస్థవిమకల్మష మర్ధశశాంకమౌళికిన్. 61

సీ. విలసితంబైన కావలి వెన్నమారాధ్యమణి దత్తమగు శైవమంత్రశక్తి
సమధికస్ఫూర్తితో శాశ్వతైశ్వర్య బీజంబైన శంభు పూజాఫలంబు

ప్రమథాధిపతిఁ గూర్చి భక్తితోఁ గావించు సోమవారవ్రత సుకృతగరిమ
యన్నమాంబిక కంధరాంతరంబునఁ జాల శోభిల్లు మంగళసూత్రలక్ష్మి
తే. సకలసౌభాగ్యములకును సాధనములుఁ; గారణంబులుఁ దగు బోధకములుఁ గాఁగ
సచివసంఘంబులోనఁ బ్రశస్తిఁ గాంచె; విశ్వనుతకీర్తి చిల్లర వెన్నమంత్రి. 62

## షష్ఠ్యంతములు

క. ఏతాదృశగుణగణ వి, ఖ్యాతునకును నిత్యఘన దయాన్వితునకున్
శ్రౌతపదానందునకును, బోతాంబా గర్భజలధి పూర్ణేందునకున్ 63

క. శరనిధి గాంభీర్యునకును, బరహితకార్యునకుఁ దుహినపర్వతకన్యా
వరపదపంకజపూజా, కిరికాలునకును నిరస్తకలికాలునకున్. 64

క. భాలాక్షపదయుగునకు రమా, హేలాసదనునకు బంధుహితజనరక్షా
శీలాయితమతికిని సఖి, లేలా జనవినుత సురమహీధర ధృతికిన్. 65

క. కౌండిన్యగోత్రునకు ను, ద్దండాహిత సచివమతి లతాదాత్రునకుం
బండిత చింతామణికిఁ బ్ర, చండవచో విభవ విష్ణుశయ్యాఫణికిన్. 66

క. అన్నాంబికా సమంచిత, ప్రసన్న శివాదిత్యునకు మహీ దివిజానీ
కాన్నత్యునకును జిల్లర, వెన్నామాత్యునకు సత్కవి స్తుత్యునకున్. 67

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు నభీష్టఫలసిద్ధియుంగా నాశీర్వదించి నాయొనర్పం
బూనిన శాకుంతల కావ్యకథాలతాలవాలంబగు పురీలలామంబు. 68

సీ. పద్మరాగోపలప్రాకార రుచిజాల గండూషితవ్యోమ మండలంబు
పాతాళగంగాఝరీపర్యాప్త కల్లోల సుకుమార పరిఘోప శోభితంబు
శక్రనీల శిలావిశాల గోపురరోచిరసమయజనిత మిథ్యాతమంబు
కనకగోపానసీ ఖచితముక్తాఫల రాజి విలగ్న తారాగణంబు
తే. రాజసదనాగ్రదేశ విరాజమాన, తోరణాలీన మణిగణ ద్యుతివితాన
విభవ లక్ష్మీవిలంబిత విలసదింద్ర, చాప రుచిచాపలము హస్తినాపురంబు. 69

ఉ. ఆపురి నున్నతస్ఫటిక హర్మ్యవిభాపటలంబు నింగి ను
ద్దీపితమై చెలంగ నది దివ్యతరంగిణి యొత్తివచ్చెఁ దా
నీపయి త్రోవనంచు బయలీఁదుచుఁ గోయఁదలంతు రగ్ర సం
స్థాపిత హేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్. 70

మ. దివిఁ బ్రాకారము ముట్టియుండఁగఁ దదుద్దేశంబునం గోటతోఁ
దవులుం జక్రము నిక్కమంచుఁ బురిమీఁదన్నాక పార్శ్వంబులం

గవనుంద్రోవ నమూరుయత్నమున రాఁగాసొటఁగాఁబోలుఁ బో
రవితేనుత్తర దక్షిణాయనములం బ్రాపించి దీపించుటల్. 71

శా. ప్రాసాదో పరినాట్యశాలికలపైఁ బద్మాసన ల్నర్తనా
భ్యాసక్రీడ లొనర్పఁ దక్ష్మిమిరయవ్యాయామజంభైక నీ
శ్వాసామోదముఁ బ్రోదిసేయు నికటస్వర్వాహినీకూల కు
ల్యా సంవర్ధిత కేసరప్రసవ మధ్వాసార సౌరభ్యముల్. 72

చ. మెలఁతుక లప్పురి న్నిడుద మేడలఁ గ్రీడలు సల్పుచుండి నిం
చులు జళిపించు కన్గవల సోరణగండ్లనుజూడ. నీడ గుం
దెలుపున నల్పుఁగూడ నెడత్రెవ్వనిచూపుల గైరవంబులం
గలువలు దోరణావళులు గట్టిన యోజల రాజవీథులన్. 73

క. పురికోట రత్నదీప్తుల, నరుణములై చుక్కలుండ నంగారకునిం
బరికించి యందుఁదెలియక, కరమువిచారింతు రెంత కార్తాంతికులున్. 74

క. పరిఘజలంబులు మొదలను, సురనదినీరాడుపరికె చుట్టునునుండం
బురికోట లగ్గసట్టఁగ, నరిది నిలరిక్కింప వాసవాదులకైనన్. 75

చ. శ్రుతి గవుడొందినం గమలనూతికినైనను దీర్చిచెప్ప నే
రుతురు పురాణశాస్త్రములు ప్రొద్దున నిండ్లను గీర శారికా
తతులు పరీక్షలీవిని ముదంబును బొందుదు రింద్రుపట్టనుం
గ్రతువులు వేయునర్చినను గైకొనరప్పురి విప్రసత్తముల్. 76

ఉ. మందరగోత్రధీరు లభిమానధను ల్పొగభేసివచ్చినం
గ్రిందుపడంగ నేరనియరిందము లంచిత నిత్యభోగ సం
క్రందను లార్తరక్షణ పరాయణు లంబుజలోచనా శుక
స్యందను లర్థిలోక హరిచందను లాపురి రాజనందనుల్. 77

ఉ. వెచ్చము పెట్టుచున్నఁ బదివేలకు నుద్దరు లొల్ల గర్థము
ద్దెచ్చిన శేషు నాదలల దివ్యమణు ల్వాలెనన్న విల్వలన్
హెచ్చును గుందు నాడుకొన కిత్తురు లాభముఁ గోర కెన్నఁగా
నెచ్చటఁ గోటికిం బడగ యెత్తని వైశ్యులు గల్ల రప్పురిన్. 78

క. సంగరము లేకయుండిన, సింగంబులఁ బులుల సమదసింధురములనే
కాంగిఁ దొడరి పసనైతురు, పొంగునఁ దమ కుబుసుపోక పురి వీరభటుల్. 79

శా. పక్షంబుల్గమ కాలిహ్రోషుఁడు కపింపం బోయిసం బోవనీ
శిక్షానైపుణి నక్క తేజుల కధిక్షేపింపఁగాఁ జాలిన
ట్లక్షీణత్వర నింగినైన గతిసేయంజాలు నచ్చైచ్ఛిక
స్వాక్షాత్కారము లప్పురిం దురగముల్ ఝంపాకశాసంపదన్. 80

మ. గణనాతీతములై సురేంద్రుఁ డెలక ల్ఖండింప వజ్రాయుధ
వ్రణరక్తం బనబిందువుల్వ్రాడమగా వర్తిల్లు జాతివ్యథా
క్వణనంబై పటుబృంహితంబులు చెలంగ న్నాన్యమ్యమొందింపఁ బ
ట్టణమార్గంబునఁ బడ్డ పెద్ద నడగొండల్వోలె శుండాలముల్. 81

సీ. హరినీలరుచుల నీలాలకంబులు గావు చిత్తజు మధుపశింజినులుగాని
క్రొన్నెలవంకలాగుల భ్రూలతలు గావు విషమాస్త్రు తియ్యవిల్లులుగాని
యలసంబులైన వాలారుఁజూపులు గావు రతిరాజు మోహనాస్త్రములుగాని
బంధురస్థితిఁబొల్చు కంధరంబులు గావు కందర్ప విజయశంఖములు గాని

తే. నళినదళలోచనలుగావు నడువనేర్చు, కంతునవశస్త్రశాలలుగాని యనఁగ
నంగకంబుల సౌభాగ్య మతిశయిల్ల, వారసతు లొప్పుదురు పురవరమునందు. 82

చ. వెలకుఁ దగం బ్రసూనములు వేఁడుచు మార్వరికింప నెత్తులం
గలసి చిగుళ్ళు పెట్టి యడకట్టిన క్రొవ్విరి మొల్లపూవు పె
త్తులు దశనాధరద్యుతులఁ దోఁచినఁ బైకొసరీవిగా విటు
ల్వలువగ వారిచిత్తములు విల్తురు తత్పురి పువ్వులాడికల్. 83

మ. సరసుల్ చొచ్చి సరోజకోటరకుటీ సంవర్తి కాచారు కే
సరగుచ్ఛంబులు క్రొచ్చి బాహ్యవనపుష్పశ్రేణి నిర్యన్మధూ
త్కరముం దెచ్చి తదీయసౌరభము లుద్గారింపుచు న్వ్యంజన
స్మరసంజీవనమై చరించుఁ గలయ న్మందానిలం బప్పురిన్. 84

గీ. శశనిషాణంబు గగనపుష్పంబునైన, వణిజు లిండులలోఁ గలువంగఁగలవు
హంసగమనల మధ్యంబునందుఁదక్క, లేమియే వస్తువులయందు లేదుపురిని. 85

వ. ఇత్తెఱంగున సమస్త వస్తువిస్ఫూర్తిఁ బ్రస్తుతివహించి పయఃపారావారంబు ననుకరించుచు సర్వతోముఖ దర్శనీయంబును సదాగతి సంచారసమంచిత బహులహరి మనోహరంబును సంతతానంతభోగలీలాలాలితపురుషోత్తమోపేతంబును సమున్నత లక్ష్మీజనకంబునునై యమరావతియునుంబోలె శతమఖపవిత్రాయమానంబునునలకాపురంబునుంబోలెఁ బుణ్యజనాకీర్ణంబును మధురాపురంబునుంబోలె నుగ్రసేనాభిరక్షితంబును నంతరిక్షపదంబునుంబోలె ననువర్తితమిత్రరాజసంబాధంబును బరమే

శ్వేత వామభాగంబునుంబోలె సర్వమంగళాలంకృతంబును మేరుమహీధరంబునుం బోలెఁ గల్యాణమహిమాస్పదంబును మహాకవి ప్రబంధంబునుంబోలె నుత్తమశ్లోక బంధురంబును రత్నాకరంబయ్యును గుప్తిమప్రదేశ సుగమంబై ముక్తామయం బయ్యును భూరిశిఖానువేశంబై ప్రకటితపర్జన్యవైభవాకారంబయ్యును జిరప్రభా భాసురంబై మంగళాచారమహితంబయ్యును సౌఖ్యసంచారికాధిష్ఠితంబై యారూఢ పాతివ్రత్యంబు క్రీడాకందుకంబులయందును బరిచితస్నేహనాశంబు రత్నదీపంబుల యందు నీరసత్వంబు సముద్రంబులయందును ద్రాసదోషంబు పద్మరాగాదిమణుల యందును మాత్రానిబంధంబు పద్యంబులయందును దారిద్ర్యంబు విద్రుమాధరామధ్యం బులయందును బదచ్ఛేదంబు వాక్యంబులయందునుం గాని దానియందు గలుగదన నొప్పునప్పురంబు కప్పురంపుఁ దాఁపువాలిందు పన్నసున్నంబుచేఁత లేతవెన్నెలల సెమ్మోచు గొమ్మలుంగల మేడలును విరాజితంబులగు వాడలును రేయెండదమ మాటులుచుందు పచాలుపన్ని బంగారుముద్దవసన సద్దుగానవైచి యద్దంబులమీఁదు వలె నుండ మన్నఁజేసి విన్ననువున మెఱుంగుపెట్టినం ద్రొక్కిన జిక్కుంజీమవా రుచుం దళదళ వెలుంగు వేదులును విలసితంబులగు వీథులును బూర్వంబునం బార్వతి యెఱింగిన తెఱంగు నగ్గిరికన్యచేతం బాణపుత్రి నేర్చినరీతి నారత్నోగాజి రాజనందనచేత ద్వారవతీ గోపికాపికవాణులభ్యసించినబుద్ధి శుద్ధదేశి నృత్తంబుల విశేషంబులు భిత్తిభాగంబులం జిత్తరువులం జిత్తరంజకంబులగుచుఁ బ్రత్యక్షంగి సంగీకరించు విలాసలీలలను విలసిల్లు నాట్యశాలలును నొక్కవీఁక నాకసంబెక్క విశ్వకర్మ నిర్మించిన తాపురంబులఁ బోలుచు గోపురంబులమీఁదికి రాఁబో సు సరంబులుగాఁగట్టినం గారుకొనుచు నేచిన మేచకద్యుతులు పుక్కిలించు శక్రోపల సోపానంబులనసాధనంబులగుప్రాసాదంబులును మదంచచ్చంచరీకచక్రహంసక్రౌంచ జలపక్షిసంకలకలంబులం గొలకొలమను కొలంకుల నలంకరించు పంకరుహకుముద కువలయకహ్లారషండంబులం దండతండంబులగు తావులం గదంబించు బావులును జిత్తంబు లుబ్బ గబ్బితనంబున విత్తంబుల్గడ్డి సెత్తంబులాడి యోడినధనంబు లాడి నంగానిపెట్ట మనుదిట్టమాటలం బుట్టిన జగడంబులు విగడంబులై యుద్ధపతత్తంబు లగు పంతంబులఁ గుంతంబులం గొనివచ్చు జూదరిదట్టంబుల హెచ్చగు రచ్చ గొట్టంబులును గలిగి వినోదంబులకు నాకరంబును విశ్రామంబులకు సీమయు విక్ర మంబునకు నెలవును విజయంబునకుఁ దానకంబును విద్యలకు నుపాధ్యాయయు వితరణంబులకు సదనంబును విభవంబులకుఁ బ్రభవస్థానంబును విలసనంబులకు విని మయంబును నైన యప్పురి కధీశ్వరుండు. 86

సీ. విశ్వసన్నుత శౌర్యవైశ్వర్యపరతయా కటిలకుండలి రాజకుండలుండు
దిగ్గజఘటాకాండ దీర్ఘబాహాదండ మానితాఖిల మహీమండలుండు
జనసన్నుతానన్యసామ్రాజ్యవైభవ శ్లాఘాకలిత పాకశాసనుండు
కులశిలోచ్చయసాను కోణస్థలన్యస్త శస్త్రవిక్రమ జయశాసనుండు

తే. భాసమాన మనీషాంబుజాసనుండు, సకలదేశావనీపాలమకుటనూత్న
రత్నరాజద్యశంక్షోణీ రజనీముఖుండు, శంబరారాతినిభుఁడు దుష్యంతవిభుఁడు. 87

మ. రజనీనాథ కులావతంసుఁ డసిధారాదారితారాతిరా
డ్గజకుంభస్రవణ మార్గనిర్గళిత ముక్తారక్తహారుండు స
ద్ద్విజసంతర్పణ కేళిలోలుఁ డఖిలక్ష్మాపాలనీపాల ది
గ్విజయాస్వాదుఁడు పాపభీరుఁడు మహావీరుం డుదారుం డిలన్. 88

మ. ప్రజలెల్లం జయువెట్ట ధర్మమహిమం బాలించె వీరారి భూ
భుజుల న్వేల్పులఁ జేసి యాధ్వరములం బ్రోచెం బదాంభోజ నే
త్రజనాధీశులఁ గాచి నిల్పె నిజసామ్రాజ్యంబుల న్సర్వసా
ధుజనస్తుత్యుఁడు సత్యకీర్తియగు నాదుష్యంతుఁ డత్యున్నతిన్. 89

సీ. నిచ్చఁ జేసె దోర్నిశితాసి యేరాజు దివికేఁగ సమరధృష్టిభుజాలకుఁ
గల్పవృక్షముఁ జేసెఁ గరకాంతి యేరాజు భూచక్రమునఁ గల యాచకులకు
గేహాబ్జములు జేసెఁ గ్రేఁగన్ను యేరాజు చెలఁగి సంక్రీడింప సింధుసుతకుఁ
బూఁటకాపుఁగఁ జేసె భుజశక్తి యేరాజు ఫణిరాజు మోచు భూభరముఁ దీర్ప

తే. ననుచు వర్ణింపఁదగదె యీరాజు వంశ, రాజహంసంబు దానధారాప్రవాహ
జలపరిక్షాళితాఖిల కలుషనికరు, సంచితాశ్రాంత కృపుని దుష్యంతనృపుని. 90

ఉ. ఆజననాథ యౌవనమణియాం దుదయంబును బొంది దిగ్జయ
వ్యాజమునం బ్రతాపగరిమాప్తుఁడు కీర్తిధనుండు రాఁ దదు
ద్వేజితులౌటఁ గాదె పరివేషమిషంబున నాత్మగుప్తికై
యోజ నమర్చికొంద్రు రవియుం గమలారియు నింగి వప్రముల్. 91

సీ. ఆలానదండంబు హేలాహవాహూత రిపురాజ ధరణీశ రేణువునకు
మానదండము మహామనుశేళ గర్వాబ్ధిగంభీరతా పరీక్షావిధికిని
నాళదండము సమున్నత జయశ్రీవధూ సముచిత క్రీడాబ్జ సౌధమునకు
నాధారదండంబు హరిణాంకకులజ భృజ్జిత్రభికీర్తి ధ్వజంబునకును

తే. యష్టిదండంబు వృద్ధశేషాహిపతికి, మూలదండంబు సైన్యసముద్రతతికి
కాలదండంబు శాత్రవక్ష్మాపతతికి, బాహుదండంబుఁ జెప్పఁ దత్క్ష్మాధిపునకు. 92

చ. జగమున రెండుతత్త్వములు శాస్త్రులు చెప్పుదు రందులోపలన్
జగడము కాని యొక్కఁ డయినం బొడఁగానరు వాని కెంటిలో
సగుణముఁ బట్టి నిర్గుణము శత్రువధూగళసీమలం జను
ల్వొగడఁగఁ జూపు నవ్విభుఁ డపూర్వముగా ఘనశాస్త్రపద్ధతిన్. 93

ఉ. పాయక శిష్టలోక పరిపాలనముం బహుదుష్టశిక్షయుం
జేయుచు రాజ్యమవ్విభుఁడు సేయఁగ దాగు నిజప్రయోజనం
బేయెడ లేకయున్న ధరియించు రుదంచిత లాంఛనార్థమై
తోయజనాభుఁడు ద్రవిసుతుండు సుదర్శన కాలదండముల్. 94

సీ. చెఱుప నేరఁడు విశ్వసించియుండినవాని నభిలషింపఁగ నేరఁ డన్యవనిత
నిందింపఁ నేరఁడు నీచశత్రుగణంబు బొంకనేరఁడు హాస్యమునకుఁ బలికి
విడువ నేరడు చెడ్డవిటునిఁ జేపట్టినఁ గడప నేరం డర్థిగణమువాంఛ
నడుగు వెట్టఁగ నేరఁ డపయశం బగుత్రోవఁ జనఁగ నేరం డాత్మజనము విడిచి
తే. దైన్యపదిసేయ నేరఁ డాహవముఖమునఁ, గ్రించు నందును నేరఁడు గీడొనర్ప
ననుచు నేరము లెన్నుదు రవనిజనులు, విపులయశుఁ డైన దుష్యంతవిభుని వలన. 95

వ. ఆ రాజపరమేశ్వరుం డొక్కనాఁడు శుకతుండకోచిద్దామ విద్రుమస్తంభసంభార సమున్నతంబును హాటకమణి వితంకాలంకార విశ్రుతనిశ్రేణికాపద గమ్యమానచంద్రశాలోపకంఠంబును గంగాకాలకంఠ మేచకరుచికచాకచిక్రీడాచతురసితేతరపట్టపటలప్రాలంబముక్తాఫల వితానతారకితవియల్లీమంబును నత్యంతసమున్నతిమదుపరిసితాతశాతమన్యవసిలాశిలా కానీలనీలచ్ఛర్ది విలగ్న వినూత్న రత్న కేసరస్తబకనిబిడబిసకనకకుముదారవిందసౌగంధికసందర్శితలికపటుగగనపుష్పంబును నభిరామదూర్వాదళదామకోమలప్రభాపటలగర్వసర్వస్వపశ్యతోహర హారిదుపలభిత్తికాంతరజితరూప వాతాయనంబును వళక్షకిరణచ్ఛవిచ్ఛటావిస్ఫుట స్ఫటికపాషాణఫలక సోపానమార్గనిర్గమప్రవేశద్వారవిద్యోతమానవిపులతపనీయ కవాటాలంకృతంబును నభ్రంకష శిరోభవనశిఖరస్థాపిత శాతకుంభకుంభ కాంతి గండూషిత నభోమండలంబును ద్రయ్యంతరాస్తీర్ణవిచిత్రరత్నకుథాసన విన్యాసంబుల శోభిల్లు సభాసౌధంబున నమూల్యరత్నకీలన జాజ్వల్యమానకల్యాణ భద్రపీఠాంతరంబున నాసీనుండై యొక్క మంజువాణి వింజామరంబును నొక్క జోటివీటికాపేటికయు నొక్క బాలధూల

వట్టంబునునొక్క కరటిగమనసురఁటియునొక్క లేఁజిగురాఁకుబోణి కాళంజియునొక్క
చందనగంధి గందవొడి బరిణయునొక్క పుండరీకనయన యగరుధూపధూమకరండం
బును నొక్క కన్య పన్నీరుతోడి కప్పురంపుగిండియు నొక్క భృంగాలక బంగారుసం
గెవయు ధరియించి డగ్గతిఁ గొలిచియుండఁ బాండ్యపల్లవపాణి యాటలాడ భోట
కరహాట కళింగాంగ వంగ బంగాళ చోళ నేపాళకాది భూపాలక కుమారవర్గంబుం
దగిన కొలువులం బలసి సేవింప హితపురోహితామాత్య బంధుమిత్ర భృత్యపాఠక పీఠ
మర్దవిదూషకాదులు భజింప సుధర్మాంతరంబున నోలగంబైన దేవేంద్రుండునుం
బోలె సాంద్రవైభవంబునం గొలువుకూర్చున్న యవసరంబున. 96

ఉ. జుంజురుపల్లవెండ్రుకల జొంపములుం గల మస్తకంబులుం
గెంజిగురాకుఁ గెంపుఁ దులకించెడు వట్రువకన్నులుం జర
త్కుంజర చర్మపట్టములకున్ సరివచ్చు బెరళ్ళ మేనులు
న్మ్రుంజులుఁ గొల్వఁ గొంపలు సముద్ధతి వచ్చి పుళిందవల్లభుల్. 97

సీ. కాననేత్రువుల ముక్తములైన ముత్యాలు ముదిరి పండిన మంచి వెదురుఁ బ్రాలు
దినములోఁ గ్రొత్తయొత్తిన కట్టజవ్వాది ముక్కలు మురియని మొరళిపప్పుఁ
జంద్రికారుచిఁ బోల్చు చమరవాలంబులుఁ బొందుగాఁ గాఁచిన పూతివడువు
అలఁతి దంతంపుఁ గామల పీలిసురఁటులు సోదించి వడిచిన జుంటితేనె

తే. కమ్మఁ బిల్లులపిల్లలు కారుకోళ్ళు, కన్నుదెఱవని కస్తురిగమిశిశువులు
పులులకూనలు భల్లూకపోతకములు, నాదిగాఁ దెచ్చి పతి కుపాయనములిచ్చి. 98

వ. ప్రణామంబులొనర్చి కేలుదోయిలు ఫాలంబులం జేర్చుకొని వినయవినమితస్కం
ధులై క్రిందిచూపుల నిట్టతారల వారంగనుగొనుచున్న వారల నవలోకించి చిత్తంబు
మృగయాయత్తం బగుటయు నృపోత్తముం డిట్లనియె. 99

క. దలముగఁ గ్రొవ్వినమృగములు, గలిగి సమీపమున నేఱుఁ గాలువయే దేఁ
గలిగి తఱచైన తరువులు, గలిగిన పేరడవి యెచటఁ గలదు గణింపన్. 100

క. నావుడు వారలు విభుతో, దేవర వేఁటాడవలసితే విచ్చేయం
గావలయును యమునాతటి, నీవరసీమంతికావ నీవనమునకున్. 101

క. రోమము వెతికిన నెత్తురు, నామములేఁ దోడలు చమురునం జేసిన య
ట్లాము గవిసియుండును వా, నాముఖయూథంబు లవ్వనంబునఁ గలయన్. 102

గీ. ఊళ్లకూళ్లు సమీపమై యునికిఁ జేసి, లేళ్ళమైనను గొరనాఁగ లేమిఁ జేసి
యచటికొర్నెలఁ బసికి మేయంగఁ గలిమి, నగరికీబారమున్నది నరవరేణ్య. 103

ఉ. జల్లెఁడ పాటువడ్డ యవసంబులు మేసి సమీపసీమలం
జల్లని నీరు ద్రావి సుఖసంగతి దాపుల గ్రేపులాఁగఁగాఁ
బొల్లఁగఁజేరి గోవృషభము ల్మదికింపులుసేయ నుండియుం
బల్లిక బెబ్బులుల్ దిరుగ సాధ్వసమందును మందధేనువుల్. 104

ఉ. సాయక పుంఖితంబు లగు చాపములం ధరియించి యుక్కునం
బాయక రేయునుంబగలుఁ బాలెము వట్టి మెకంబుఁ గన్నచోఁ
నేయుచు బొంచి రాఁ దెలిపి యీక చరించుచునున్న మందక
ల్యాయతవర్ణసత్వ నినదావళి హావళి మానదెప్పుడున్. 105

గీ. కోలఁ బడినైన గుదిగ్రుచ్చికొనఁగ నేయఁవచ్చు మృగముల నెమకంగ వలసదచట
పసికినయ్యెడు కీడువాపంగగలదు, నేసుకపు నిమ్మగాఁగ వేఁటాడగలదు. 106

వ. అవల దేవరచిత్తంబుకొలఁది యనిన గోరక్షణంబుకొలకును దుష్టమృగశిక్షణంబు
వలన సుకృతంబుగా మృగయాసౌఖ్యంబు సిద్ధించె దేవరప్రసాదంబు జాదులం
బలె నయ్యెనని యమాత్యుల యనుమతంబునం గొలువువిచ్చి యందఱ సముచిత
ప్రకారంబుల వీడుకొలిపి వేత్రవాస్తులఁ బిలిపించి పట్టణంబున మృగయావిహార
సన్నాహంబునకుం జాటించిన. 107

సీ. పులిమల్లఁ డడవిపోతులరాజు గరుడుండు గాలివేగంబు పంజేలపసిఁడి
పిష్ణుప్రసాదంబు వేఁడిగుండులంపఁబరి పచ్చిమిరియము వెట్టిపుచ్చకాయ
వేఁటమాణిక్యంబు విరవాది మెడబల్మి పెట్టుగాఁడు వకారి పిడుగుతునుక
జిగురుండు చిత్రాంగి శ్రీరామబాణంబు పులియండు కస్తూరి బొడ్డుమల్లె
తే. యనఁగ మరియును పెక్కు తోయముల పేళ్లు, దారకులు దేరవచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజవిగ్రహములు, వటుకనాథునివాహ్యాళివాహనములు. 108

మ. శబరు ల్వక్కెడ త్రాళ్ళఁబట్టి తిగువం జండోద్ధతిం గిట్టి వ
ట్టిబయల్ ద్రవ్వుచు విడ్వరాహముల గుండెల్ వ్రయ్య నాకాశముం
గబళింపం జనునోజ మోరలెగయంగా నెత్తి గర్జిల్లఁగాఁ
బ్రబలెం గుఱ్ఱుర కంఠనాళకుహరీ ఘాఘా మహారావముల్. 109

గీ. మృగయు లంతటఁ దెచ్చిరి లగుడుగిద్దు, జాలె జలకట్టె కణుజు వేసడము లైరి
కుహుజులోరణ మనుదేగ కొలముసాళు, వముల బిలుపుకు వేఁటకువచ్చువాని. 110

సీ. బంగారు మెరవడి పల్లనంబులతోడఁ గొంబట్టు కీలుపక్కరలతోడ
ముఖసమర్పితహాటకఖలీనములతోడఁ గాంచన గ్రైవేయకములతోడ

సమకట్టిముడిచిన చామరంబులతోడఁ దాఁపఁబెట్టిన యడిదములతోడ
కనకఘంటల యురగజ్జెపేరులతోడఁ గర్ణకీలిత దీర్ఘకళలతోడఁ
తే. జిత్రమునఁ వ్రాయగారాని చెలువుతోడ, నొప్పియుచ్చైశ్రవముతోడి యుద్దులనఁగ
వాహనులు దేఱవచ్చె దుర్వారశీల, వసుమతీనాయకునిపూజ వారువములు. 111
సీ. వలనఁబుపుట్టించి వంకంబులోలయించి డిల్లాలుప్రకటించి తేవజూపి
వరసంబునొందించి పల్లంబుకలిపెంచి నిగుడంబు సమకొల్పి సెలను సెలపి
లలిగూర్చి లలిదేర్చి లాగిచ్చి ఖండాలముల నోజవట్టించి ఖలువుదెచ్చి
లవణిసంకోచంబులకుఁ దెచ్చి హవణితో రససిద్ధివడయించి రాగలందు
తే. నాఱుతానకములను గృత్యమ్ము లేదు, నమవదేనాపనంబుల నెఱిఁగిహరుల
నెక్కురసికులువచ్చిరి హెచ్చునగరి, రాగరవుతులు సమరానురాగమతులు. 112
సీ. జడలల్లిముడిచి పాగడఁజొక్కెములుపేర్చి తలముళ్ళు బలువుగా నెలవుకొల్పి
మృగము చేరఁగవచ్చు మొగసిరిచూర్ణంపుఁ దిలకంబు లలికసీమలఘటించి
వాకట్టువదినికె చేకట్టుచుండలు కరకాండమధ్యభాగములఁదొడిగి
కుఱుచగాఁగట్టిన కరకటట్టికంచు నంతరమ్మునఁ బిడియాలుదోపి
తే. పందిపోట్లును దడవిండ్లుఁ బాఱవాతి, యమ్ములును జిల్లకోలలు నడిదములును
వలఁతియా టెలు ధరియించివచ్చి రంగ, రక్షకులు తాతతరముల ప్రాతవారు.113
క. అరిగెలు నిష్ఠురబాహో, పరిఘులు ధరియించి నగరిపాచులు నేతెం
చిరి శిఖిపటుజిహ్వాసమ, కరవాలచ్యుతులు గగనకాలిమఁ గడుగన్. 114
శా. సింగంపుంబోది వచ్చుచందమున వచ్చెం బోయకాలారి యు
త్తుంగశ్యామలదేహసంజనితకాంతుల్వీరలక్ష్మీనవా
పాంగచ్ఛాయలతోడఁ బెల్లొదవిమ్రోయ న్వేల్లదుద్యద్భుజా
సంగత్వంగద భంగభంగుర ధనుర్జ్యావల్లరీ ఝల్లరుల్. 115
గీ. ఉరులు జిగురుగండె డెరలును బోనులు, వారువాఱెనలును వసుబుగనులు
మిళ్ళువలలు పేట్లు గోళ్ళు దీమంబు, నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు. 116
వ. మఱియును మూలభృత్యబలంబును సామంత కుమారవర్గంబును సర్వప్రకారంబుల
సముచితాలంకారులు సాయుధులు సవాహనులునై చనుదెంచి రప్పు డప్పుడమి
ఱేఁడు వేటఁకుందగిన శృంగారం బంగీకరించి గతివిజిత మరుత్కురంగంబులగు
తురంగంబులంబూనిన యరదంబెక్కి యిరువంకల నుమ్మంగలింబింగలింజతురంగబలం
బులుగొలువ శంఖకాహళవేణువీణామృదంగంబులు చెలంగ నెడలేక సందడిం గ్రం

దుకొన నమందవైభవంబునం బురందరవైభవుండు పురంబు వెడలి వృద్ధహయంబు
మీఁద విదూషకుండగు మాండవ్యుండుదోడరాఁ గొంతదవ్వరిగి యొక్క చిక్కణ
ప్రదేశంబున రథవేగంబు దెలియువేడుక సారథిం జూచి నిమ్నోన్నతంబులు
గాక యిచ్చట సమతలంబై యున్న యది నీహయంబుల రయంబు జూపు మనవుఁడు
నతండు యుగ్యంబుల పగ్గంబులు వదల్చి యదల్చిన. 117

సీ. కనుదృష్టి నెయ్యది మినుమినుక్కనుచుండు ఘనత వ్రేల్మిడిలోనఁ గానఁబడఁగ
నెడఁద్రెవ్వియుండు నెయ్యదియేని నదిపాడ నడికినచందాన నన్వయింప
నెయ్యది విలువంకరైయుండుఁ బదమున నది సమరేకతోఁ నడమంద
దూరాన నెయ్యది తోఁచు నాలోకింప నది పార్శ్వమున నేక యవులఁ జనఁ
తే. శ్రవణములు నిక్క నిక్కింపచామరాగ్ర, ముగ నిరాయతపూర్వాంగములఁ దనర్చి
ఘనఖురోద్ధూతరేణువు గడవఁబాఱి, నిగిడె భువి తేరిహయములు మృగజయములు.

వ. అయ్యవసరంబున. 119

గీ. కుక్కలలయక యుండంగఁ గొంచువచ్చు, మందియొకకొంతచిక్క నాస్యందనంబుఁ
గూడిరారాక వడిచెడి కొంతచిక్క, ననిలగతి నేగురథ మెవ్వఁడంటఁగలఁడు. 120

క. సారథిఁ గనుఁగొని యపుడా, క్ష్మారమణుఁడు రథము దవ్వుగావచ్చెఁ బరి
వారము గూడనురా నె, వ్వారలు గల రిచట నిలువవలయు ననుటయుఁ గా, 121

వ. అతండును నృపాలకానుశాసనంబునం దేజుల నేఁగనీక వాగెలు గుదియించి వీఁపు
లు నిమిరి నిలుపుటయు సకలజనంబులుం గూడుకొని యుల్లసితయానంబున మెల్లన
చని ముందఱ చేరంజన నయ్యవసరంబున విజయకాహళానాదంబు లాలకించి బిరుద
ధ్వజవితానంబు లవలోకించియుఁ దమరాజురాకఁ దెలిసి నిసర్గభీరువులగు నాభీరు
వులు భీతచేతస్కులై నవీనంబగు హయ్యంగవీనంబుఁ గానుక తెచ్చి ప్రణామంబు
లాచరించి కరంబులు శిరంబునఁ బెట్టుకొని తిర్యగాలోలంబులగు చూపులం గద్గద
కంఠులగుచుఁ బ్రస్ఖలితవినయవాక్యంబుల నిట్లని విన్నవించిరి. 122

సీ. దూరంబువచ్చిన వారికి సైన్యంబు ప్రజలెల్లఁ జాల దూపట్టినారు
నీర్వట్టుకొని దీర్ఘనిశ్వాసములతోడ వరరథ్యములు వ్రేలవైచెఁ జెవులు
వేఁటుకుక్కలు డస్సి వివృతాస్యములనిల్చి వగరించుచున్నవి దగలుదొట్టి
శిథిలపక్షమున నక్షియుగంబులనోర్మిడ్చి శ్రమనొందె డేగలు సాళువములు
తే. తిమురు మధ్యాహ్నమయ్యెను దేవ యిచటు, నేఁడు కాలూఁగి మామందపాఁడిచూచి
గోరసముఁ బాయసంబులు నారగించి, నిగ్రహంబైన మమ్ము మన్నింపవలయు. 123

గీ. అనుచువిన్నపమొనరించు నవసరమున, హయముడిగ్గి మాండవ్యుఁడు రయముతోడ
నవనిపాలునిరథము డాయంగవచ్చి, చేయి పుడిసిలికట్టి యాశీర్వదించి. 124

ఉ. ఒల్లమిచేసి వీరలకు నుత్తరమీకు నృపాల పెయ్యలుం
జల్లలునమ్ముకొన్న యవిచాలఁగ నున్నవి చిత్రధాన్యము
లొక్కల్లలు త్రవ్వితండములు కుప్పలు నేతులు పాలు వెన్నలుం
గొల్లలకేమిమూఁడె మనకున్మతి కూడొకపూఁటపెట్టినన్. 125

క. కానికకప్పముపెట్టరు, మానము దప్పఁ దిని క్రొవ్వి మనుబోతుల సం
తానమువలె నున్నారీ, కాననమున రాచసొమ్ము గతమగఁ గొనుచున్. 126

వ. అదియట్లుండె నింక నొక్క విన్నపం బవధరింపుము. 127

గీ. వేట నోయెడువారలు విప్రమాట, కలుగుచునుపాదప్రవృత్తి కలిగినట్లు
విన్నవింపక నాలుక మిన్నకుండ, కేచినీ మేలుగోరెదు హితుఁడఁ గాన. 128

క. పాయసముం గలలో భూ, నాయక భోజనముసేయు వరులకు నెంతే
శ్రేరస్కరమని స్వప్నా, ధ్యాయంబునఁ జెప్పబడెందుఁ దజ్జ్ఞులచేతన్. 129

గీ. భోజనముసేయుమనఁగఁ తాంబూలగంధపుష్పములుగొమ్మనఁగఁ ద్రోసిపోవఁజనదు
ఇంపుతోడుత నంగీకరింపవలయు, గార్యఫలసిద్ధి కవి యాదికారణములు 130

క. ఇల నెవలి మానవుఁడు తన, తలఁచినతావునకుఁ జేరుఁదాఁకను నేఁడుం
కిలికెక్క నెక్కతీయుపు, వలయును శాకునికవరుల వచనవిధమునన్. 131

సీ. హర్మ్యంబువెడల వాయసము చేరువఁదీర్చి వృషభంబెదురఁ బొంకవేసి నిలిచె
వాడలోనుసకంబు వచ్చెను దక్షిణంబుదపూర్ణకుంభంబు లెదురుపడిసెను
గవని వెలుపల బెరకయాఁబోతు వలనొనె వలకెక్కనూ పెఁ జేవలఁతిఁ జెమరు
పసువు నేలమవచ్చెఁ బాల పయ్యెగవంత కుడినుండి యెడమకు నడిచె నక్క
తే. నీవు వేటకువిచ్చేయునెడ నృపాల, పంచిపెండ్లికి నగుశకునంబులయ్యె
నేఁడు గొల్లలమాట మన్నించినిలిచి, మృగయకరుగుట మిక్కిలి మేలు తెపు. 132

క. నావిష్ణుః పృథివీపతి, నావిష్ణుండనఁగ నీవ నరవర దైవం
బీవారగింపకుండిన, నీవల్లవులకు శుభంబు లేలా కలుగున్. 133

వ. వీరలం గృతార్థులంజేయంగ గృపగలదేని యారగింపవలయు నది యన్ని దినంబులం
గోరెఁ గన్న యదిలేదు దండుగ దర్శనంబులు గొనందలంపయ్యెనేని ముందఱఁజాగి
విచ్చేయుమనిన గొల్ల లుల్లంబునం దల్లడిల్లి యీ బ్రాహ్మణుండు పలికినది
యథార్థంబు మాయర్థప్రాణంబులు నీసొమ్ము వలసినట్లు చేసికొమ్మనినమాండవ్యు

ద్రిమ్మరిమాటలకు దిగులుసొచ్చిన గోపాలకుల భూపాలకుండు మృదువచనంబుల నుపచరించి / సైన్యంబు సముచితక్రమంబున విడియించి కనకకుంభ కలితంబై కనుపట్టు గొల్లైనలం గృతావాసుండై. 134

సీ. పెనుపాయకడియంపుఁ బిఁడివంటలతోడఁ గమ్మనిసద్యోఘృతమ్ముతోడఁ
గనరుపోవండఁ గాచిన యానవాలతోఁ గడిసేయవచ్చు మీఁగడలతోడఁ
బెక్కులాగులఁ గదంబించు జున్నులతోడఁ జేరిచాఱొన్న క్రొంబెరుఁగుతోడఁ
బిడిచినఁ జమురు గాఱెడు మాంసములతోడఁ జేటతియ్యని జుంటితేనెతోడఁ

తే. బాయసాహారములతోడ బ్రేమలాసఁగ, నఖిలసేనాప్రజలతోడ నారగించి
సంతసంబంది పటుపటీరాంతరమున, జనవిభుండు భజించె నిశాసుఖంబు. 135

శా. కౌండిన్యాన్వయ సింధుచంద్ర వినతక్ష్మాపాల కామాత్య వే
దండానీక మృగేంద్ర చంద్రవదనా తారుణ్యకందర్ప శ్రీ
ఖండక్షోదవిపాండు నిర్మల యశోగంగాజలక్షాళితా
జాండాఘోరకలంక శంకర నివాసాహార్య ధైర్యోన్నతా 136

క. సుకసురభికల్పభూరుహా, తరణిజశిబిఖచర దేవతామణి రజనీ
కరకాల బలాహక సఖ, కగపద్మ సమస్తవిబుధ కవినుత సద్మా. 137

మా. జనహితసుచరిత్రా సజ్జనాబ్జాతమిత్రా, జనితవృషపవిత్రా సత్కవిస్తోత్ర పాత్రా
వనరుహదళనేత్రా వంశమాకంపచైత్రా యనుపమశుభగాత్రా యన్నమాంబాకళత్రా. 138

గద్య. ఇది శ్రీభారతీతీర్థ గురుశ్రీచరణ కరుణాలబ్ధ సిద్ధ సారస్వతపవిత్ర
గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర పిల్లలమఱ్ఱి పినవీరభద్ర
ప్రణీతంబైన శృంగారశాకుంతల కావ్యంబునందుఁ
ప్రథమాశ్వాసము.



శ్రీ రస్తు

# శృంగారశాకుంతలము

## ద్వితీయాశ్వాసము



సదన పదారాధిత
వాసుకికేయూర వంశవర్ధన వినతా
వాసపయోజాసన శ
న్యాసఖ కీర్తిప్రసన్న నాగయవెన్నా! 1

వ. ఇత్తెఱంగున దుష్యంతమహీకాంతుండు సంతోషంబునఁ ఘోషంబున నా రాత్రి నిలిచి మ
ఱునాఁడు సూర్యోదయంబగుటయుఁ గల్యకరణీయంబులు దీర్చి లావసుల నేర్చి కదలి. 2

చ. మెకములఁ బట్టఁ గట్టి వలమీటి చనం జననీక యాఁగి తెం
కికిఁ జనఁ జేయ బోనునకుఁ గీల్కొలుపం బయి వచ్చెనేని ద
ప్పక పొడువంగ నేర్పు ఘన బాహుబలంబును గల్గి నేటు వేఁ
టకుఁ దెఱవాదులైన సుభటప్రకరంబులు క్రోల నేఁగఁగన్. 3

క. ముదమును మదమును మనమున, గుదిగొన గోష్ఠంబుఁ గడచి కొండొకచని య
ల్లదె యిదె కాంతారంబన, నెదురం జూపట్టెదాఁక నేఁగఁగ నచటన్. 4

సీ. ఛాయామృగంబుల వ్రేయు గర్జిల్లఁ బ్రచండమై పొడము భేరుండరవము
భేరుండనినదకంపితములై పాఱెడు శరభసంతతి సాధ్వసస్వనంబు
శరభనినాదవిత్రస్తంబులై గమనించు కంఠీరవనిక్వణంబు
కంఠీరవారవస్ఖలితంబులై చను భీతవన్యకరీంద్ర బృంహితంబు

తే. మక్కడింపఁ దదీయ కళ్మాష భీష ణోగ్ర ఘోషంబునను సత్వయూథ వివిధ
సత్వరధ్వానములు బహుజాత పక్షి, కలకలంబులు వినవచ్చెఁ గర్ణములకు. 5

క. ఆరావములఁ గృతాంతా, కారములై నేఁటకుక్క కదుపులు వెలుచం
దారకులు వట్టి తిగువం, గారయమున మృగయులకు వెంగంబులకెనయన్. 6

క. సంతసంబందు నృపతి యాస్యంబుఁ జూచి, తిమురుకుక్కలబెడిదంపుఁ దెంపుఁ జూచి
మృగయువర్గంబు గర్వంపుఁ బొగదుఁ జూచి, యుల్లమునఁ జాలమాండవ్యుదులు కుప్పట్టి. 7

వ. వనంబుఁ జేరవచ్చితిమి. మృగంబులు గానవచ్చుచున్నయవి, యిటవచ్చినవారిలోన నెవ్వరిని విచారించినం గాతరత్వంబు లేదు. పోతరంబు బహుళంబై యున్నది. ఏను వేదబ్రాహ్మణుండ నివ్వనమృగంబుల నవలోకించిన శరభస్వామి తలంపునం బడి పుట్టిన శరభంబులును వైకుంఠకంఠీరవంబు మీఁది యుత్కంఠ నావిర్భవించిన సింగంబులును జాంబవంతుం డల్ల పనిసేయునప్పు డుప్పతిల్లిన భల్లూకంబులు నాగ్రహంబున వ్యాఘ్రముఖ క్షోభ ర్తలాఘారణాతురంబుల నధిక్షేపించి చేయు నిత్యచాప వ్యాపారంబున నుదయించిన పులులును గుంభిదానవుం వకు సంభవంబైన యిభంబులును గృతాంతు నిలాయంబులఁ లాయఁబు సంతతం బ్రబలిన కారెనుబోతులును గుహానారాహంబునై మోహంబున సమూహంబైన పందులును గాని యేతన్మాత్రంబులు గావు నాశంబోవుట బుద్ధిగాదు కాదని మగుడ నుద్యోగించిన మందకును దూరంబుగా వచ్చితిమి నడఁగఁడు నడతెగ మానిసి మట్రచిట్టాడని యీచిట్టడవి నెట్లు చననేర్తు నొకయుపాయాంతరంబున దోడుపెట్టించుకొనిపోయెదం గాక యని యల్లనల్లన భూవల్లభుం జేరంజని యిట్లనియె. 8

సీ. కర్మకాండం బెఱుంగని పాపఁడుండఁ గార్యాదిఁ జేకొని విసాయకుని గొల్చి
వేటమైఁ దమి విఘ్నవిభుఁ బ్రార్థనము సేయుకయ వచ్చినారము గమనవేళ
శరభశార్దూలాది చండసత్వంబుల మర్దించుకొఱకునై మనదురాక
మృగములు మనచేతఁ దగులువడఁగ నందులభీతి ప్రజలకుఁ గలుగకుండ
తే. గజముఖుని సేవ బ్రార్థింతు వ్రజములోనఁ బాలకును నేతి కుండ్రాల ప్రాలకచటి
గొల్లలకుఁ జెప్ప నన్నుఁ దోడ్కొని చనంగఁ నంగజాలలసనుపు ధరాధినాథ. 9

క. సేమంబు పూని మృగజయ, కామన సంకల్ప పూర్వకముగా జపముల్
హోమముఁ జేయుచునుండెద సామజవదనునకుఁ దత్ప్రసాదము కలిమిన్. 10

సీ. చిక్కఁ జీరుగఁ గూల్చు సింహపోతకములఁ బోలి తొప్పఱలాడు గ్రోలుపులుల
విలయశబు నొందించు విపినంబు పందుల పెరఁజి వెంపఱలాడు హరిణములను
విఱువు కంఠాస్థుల నుతికి చివ్వంగుల మొత్తి మోదరలాడు మత్తకరులఁ
గూల్చు మర్వరఁ దన్నికొన మన్నుఁబోతుల వ్రచ్చి వందఱలాడు వాహరిపులఁ
తే. జంపి వసియాడు శశములగుంపు కుటికి, చించిచెండాడు కణుజులఁ జేతికోలఁ ది
వెదకి వేటాడు దుప్పుల మెదలనీక, చండవిక్రమచాప దుష్యంతభూప. 11

క. అనుటయు మాండవ్యుని మన, మునఁ గలిగిన భీతిఁ దెలిసి భూపాలకుఁ డి
ట్లను బ్రాహ్మణమిత్రునిఁ జూచుని సేనిన్నకట యేమఱుదు నే రొచటన్. 12

వ. నీవు నావెంటనంటుకొని యొంటివడక తోడునీవ యుంబోలె నే నెమ్మి ప్రమాదంబు గాకుండఁ బ్రమోదంబుగా వేటవేడుక మాపి కుసుమంబునుం బోలెఁ గందకుండ

నిన్నుం దెచ్చెదనని భుజం బప్పళించి మృగయావర్గంబునుం దానును నిర్గళప్రచారం బులఁ దాయనేఁటి ప్రోఁగువాఱించి దాపులమేపుల జివ్వల మొవ్వల రేఁగుల గోఁగుల రేలలజాలల నొద్దుల నుద్దుల గురుగుల విరుగుల నెమ్మిల జమ్మిల నేరేళ్ల మారేళ్లఁ గలువుల బలువులఁ గోడిసెల నోడిసెల నందుగుల నిందుగులఁ గలుగొట్లఁ గొట్లఁ బంచాయల నాయలఁ బ్రేంకణంబుల గణంబులఁ గొండమావిళ్ల వావిళ్ల తాండ్ల మాండ్ల జంగ్రుల సుంగ్రుల వెలఁగల మొలగల బీరలగారల వేములఁ ద్రేముల మఱియునుం బెదబిచ్చి పిఱిబిచ్చి నల్లింద నెల్లింద యుప్పి కప్పి మద్ది గద్ద గోరు గోరంట వెలచ యులిమిరి మారేగ వేఁగిస మొగలి గాఁ బెక్కు తెఱంగుల బ్రాఁకులు మాఁకలుఁ గొని యుసుము జల్లించి చల్లిన రాలని దట్టంబునం బాఱకట్టు లేక పరిక్రీడమాన క్రోడ సింహ సైరిభ శరభ శార్దూల చమరురురుసురంగాది జంతుఘోషంబులును గంకకలవింక కజం జగ ఖంజరీట కపోత శిఖావళ శుకపికానేక పక్షికులకలకలంబులను ఝుంఝుమాపవన ఝంఝాసంపాత కంపమాన కల్పాంతకాలజలధి ననుకరించు నరణ్యంబుఁ బ్రవేశించి వలయు వంకలం గాలువలలు నుచ్చులుబోనులు దీపంబులుం జిగురుం గండెలు పెట్టి వేయించి సారమేయంబుల విడిపించిన. 13

సీ. గళనాళములఁ ద్రుంచెఁ గాలుబోసులఁ గొన్ని తోలాడెఁ గొన్ని శార్దూలములను
ఎలుఁగులఁ గొన్ని మేనుల నఖంబులఁ ద్రచ్చె జమరీమృగంబులఁ జంపె గొన్ని
కొఱప్రాణములఁ జేసి కూల్చె దుప్పులఁ గొన్ని చెండె మన్నులఁ గొన్ని గుండెలవియఁ
గఱచె బందులఁ గొన్ని కంధరాంతరములు కొండగొఱియల మన్నిగొనియెఁ గొన్ని
తే. చటులగతిఁ గొన్ని కణుజులఁ సంహరించె, వెంటఁబడి కొన్ని శశముల విత్తుమాల్చెఁ
గొన్ని జింకల ప్రేవులు గ్రుచ్చివైచెఁ, గుక్కలాటవికంబులు సుక్కు మిగిలి. 14

సీ. కడిమి మైఁ బిడియూనఁ బొడిచి యొక్కఁడు కొఱప్రాణంబుతోఁ బులిఁ బట్టి తెచ్చెఁ
భల్లాన నిర్గళప్రాణంబు గావించి లావున నొకఁ డేకలంబుఁ దెచ్చె
నసిధార మెడఁ ద్రెవ్వ నడిచి కొమ్ములతోన నొకఁడు కాసారపు మస్తకముఁ దెచ్చె
బాణాభిహతిఁ గూలబడ వేసి యొకఁడు కాననదంతి తొండంబు నఱికి తెచ్చెఁ
తే. గుఱుచ కుంతాన బెనుమోర గ్రుచ్చి యెత్తి తొలుఁగు నొకఁడు కాల్వట్టి యీడ్చి తెచ్చె
శేవమైఁ జిల్లకోలనాటించి యొక్కఁ, డెద్దుఁ గొనివచ్చెఁ గరిపురాధీశుకడకు. 15

చ. అవి గనుఁగొంచు నెంతయుఁ బ్రహర్షము నొందుచుఁ దాను లీలఁగా
నవిరళశక్తిఁ గాంచన సమంచితపుంఖ శిలీముఖంబులం
గవయ వరాహ దంతి రురు కాసర పఙ్క్తులఁ గూలనేయుచుం
గవిసి తదీయకంఠములు ఖడ్గముఖంబునఁ ద్రెవ్వనేయుచున్. 16

క. వనచరులను జూచుచు నటఁ, జన జనపతి కాంచె నొక్క చక్కని యిఱ్ఱిన్
మ్మునిపతి పెంపుడుబుట్టిని, వనముఁ జరియించు వేళ వలపులకట్టిన్. 17

క. హరిణము నెఱిఁగని పుంఖిత, శరుఁడై వెంబడిన యరిగె జనపతి కడిమి
స్వైరయజ్ఞమృగము వెంబడి, నరిగెడు సాక్షాత్పినాకహస్తుఁడు పోలెన్. 18

చ. విలుగొని వెంటవెంటఁ బృథివీపతి రా శరపాతభీతిఁ దా
మలఁగి మలంగి కన్గొనుచు మార్గము క్రేవల నడ్డగించుచు
న్నిలుచుచుఁ గొంతకొంత గమనించుచు నర్ధము మేసి మేసి ద
ర్భలు వివృతాస్యపార్శ్వముల రాలఁగ మింటికిఁ జౌకళించుచున్. 19

సీ. శారాంతరంబు మోసంబైన విడివడి యరుదెంచు గాడ్పువాహనమృగంబొ
శశముతో నొంటక జగతిపైవచ్చిన చంద్రునిలోని లాంఛనమృగంబొ
వీరభద్రుని కృపావీక్షణంబునఁ బునర్నవమై చరించు జన్నపుమృగంబొ
పార్వతీకన్యక ప్రార్థింపవిడిచిన యగేంద్రకంకణుకరమృగంబొ
తే. యనఁగ మాయామృగమువోలె నామృగంబు, ధరణిపతిబాణనిహతికిఁ దగులువడక
నదులు నగములు ఘనకాననములుగడచి, చటులగతి నేగె మాలినీతటమునకును. 20

క. ఏ తెరువున నరిగె మృగం, బా తెరువున నదులు వనము లద్రులనక ధా
త్రీతలపతి సైన్యసమా, న్వీతుండై యరిగె మాలినీ నదిడాఁకన్. 21

గీ. అచట మృగమును బోలేక యలసి నిలిచె, నానెలవు నాశ్రమాంతిక మగుటఁ జేసి
స్థలవిశేషంబదెట్టిదో ధరణిపతికి, హరిణపతిమీఁద నెంతయుఁ గరుణపుట్టె. 22

వ. ఇత్తెఱంగునం గురంగంబుమీఁదఁ గురంగాంకకులీనుండు కృపాతరంగితాంతరంగుండై యేయక యుండం దత్తరంగిణీతటంబున. 23

సీ. కడగి సంక్రీడించు నడవియేనుంగుల గండస్థలుల దానగంధములను
చెంచులరాచకెంజిగురాకుఁబోఁడుల శిరసుల జవ్వాది పరిమళముల
విచ్చిన నెత్తమ్మి విరులఁ దుమ్మెదలాడఁ జాతినపూఁజేనె సౌరభములఁ
గూలద్రుమంబుల గాలిత్రాఁకునరాలి వచ్చిన యలరు క్రొవ్వాసనలను
తే. శబలితంబగు నర్యేటి సలిలకణము, లల్లనల్లనఁ గొనుచు మందానిలుండు
చల్లఁగా వీచి వనపథశ్రాంతిఁ దీర్చె, కరిగముంగొను వేడుకఁ గదలి కదలి. 24

మ. ఒకచో మత్తమరాళ నృత్తవిసరం బొండొక్కచోఁ జక్రవా
క కుటుంబస్మర కేళిజాల కలనిక్వాణంబు వేరొక్కచో
వికచాంభోజ మరంద సన్మధు మదావేశ భ్రమద్భృంగ గా
నకలాపధ్వని మానసంబునకు నానందంబు సంధింపఁగన్. 25

క. కంజకుముదోత్పలచ్యుత, కింజల్క పరాగపటల కీలిత మగుచు
న్మంజుసరోవర దేవత, మాంజిష్ఠము గట్టుకొనిన మాడ్కిం దనరున్. 26

మ. చలదిందీవర చారునేత్ర సముదంచచ్చంచరీకాల కం
జలజాతాననఁ గంబుకంఠి బిసహస్తం జక్రవాకస్తని
న్బులినశ్రోణి మరాళరాజగమన న్భూజాని గాంచె న్నటు
జ్జలకల్లోల పరంపరానినద వాచాలిని న్మాలినిన్. 27

వ. కాంచి వితత పరిశ్రాంతుండును సంతోషితస్వాంతుండును నై చెదరి బెదరి తన వదనంబుఁ గనుంగొను చుంగదలకున్న యిఱ్ఱిగున్న వీక్షించుచున్న యవసరంబున. 28

సీ. దీర్ఘదీర్ఘంబులై తిరిగట్టి మడపులు గడచి తూలాడు కెంజటలతోడఁ
వింజామరము విచ్చి వ్రేలవైచినమాడ్కి డాలొందు నెరపగడ్డంబుతోడఁ
ఫాలబాహూరపార్శ్వదేశంబులఁ గొమరారు భూతిపుండ్రములతోడఁ
బోసెంబువిడిచి కప్పుకొనివచ్చిన క్రొత్తచుణుఁగుఁ జమూరుచర్మంబుతోడఁ

తే. బ్రహ్మతేజోధికులకైన బ్రహ్మచారు, లిద్దఱిరువంక నలమిరా నెలమితోడఁ
నగ్నిశిఖవోలియును జల్లనైనకాంతి, యదర నొకవృద్ధమునివచ్చె నధిపుకడకు. 29

వ. వచ్చి వెసవెస దీవించి కృతాంజలియై యున్న రాజునుం గూర్చుండుమనక తాను నాసీనుఁడుంగాక నిలిచి హరిణంబు నంగుళిముఖంబునం జూపి. 30

క. ఆశ్రమ సారంగంబిది, యాశ్రితమందార దీని నలయించితి నీ
విశ్రామమునకు నిధి మా, కశ్రాంతముఁ బ్రాణమిత్రమై చరియించున్. 31

ఉ. ఏమనిచెప్ప నప్పుడటు లీనినమై దడియాఱలేదు దా
నీమహితాశ్రమంబునకు నేసరవింబడి తప్పివచ్చెనో
ప్రేమముఁజేసి యంగుళులబెట్టిన దర్భలు మేయుచుండఁగా
నోమనఁ బాపగోలెఁ గృప నోమితి నీమృగరాజ డింభమున్. 32

క. తనతల్లులు మునిపత్నులు, తనతండ్రులు మునిజనములు తన సహజన్మల్
మునికన్యలుగా గారవ, మునఁ బెరిఁగి వనౌకసులకు ముద్దులుగురియున్. 33

వ. ఇది యొకనాఁ డాహారవిహారార్థం బరిగి కాననంబులం గసవు మేయుచుఁ దాపస
జనంబు వేరసెవ్వరుం గనుంగొనినం గనుచూపుమేరను మేఁతచాలించి డాయవచ్చి
యొరసికొనుచు సౌహృదోత్కంఠం గంఠంబెత్తి కండూయనంబుఁ జేయించుకొను
మమ్ము సమ్ముఖంబున నాలోకించుచుండియు జెండుపడి యోలంబు లందలఁ బ్రాల
వైచుకొని మిన్నకున్న యది యొచ్చెల యెంత నొచ్చెనో కదా యని దగ్గతి కపో
లంబులు పుడికి గళంబు దువ్వి యంగంబులు నిమిరి పారంగంబు నుపలాలించుచుఁ
గృపాతరంగిణీ తరంగంబులగు నపాంగంబుల మృగంబు వీక్షించు మునిపుంగవుం గని
నృపపుంగవుండు కలంగిన యంతరంగంబున. 34

క. నొచ్చెనొ వీరల హృదయము, లిచ్చట నామీఁదకలిగి యేమని శాపం
బిచ్చెదరో కదా సాలుక, వెచ్చన మునులకును గినుక వేగమవచ్చున్. 35

సీ. భృగుని నూసరవెల్లి వగుమని యొకఁడగ్గె సగరుల నొకఁడు భస్మముగఁ జేసె
శీతాంశునొకఁడు నాశిలుచుండఁ గోపించె భానుని నొకఁ డుర్విఁ బడ నడల్చె
నబ్ధిలేడును నొకఁడాపోశనముగొనె నగభేది నొకఁ డేవతుగ శపించె
శంకించి యొకఁడగ్ని సర్వభక్షకుఁ జేసె నహుషుని నొకఁ డంపె నహులఁ గలయ
తే. గోత్రరిపులక్ష్మి మున్నిటఁ గొల్చెనొకఁడు
మునుల మనసులు నొప్పించి మొక్కవోయి
బైసి దొలఁగిన వారెంతలేసి వార
లితర జనముల కణుతింప నెంతవారు. 36

చ. దిరిసెనపూవుకంటెను మతింపఁగ మెత్తన చాలఁ జిత్తముల్
కెరల యుగాంతవాయుసఖ కీలలకంటెను వేఁడి నాలుకల్
దొరసినఁ గూలఁ ద్రోయుదురు వొంతులతోడ దిగీశరాజ్యముల్
కరుణవహించిరే మునులు కట్టుదుగల్పుల బ్రహ్మపట్టముల్. 37

గీ. కుడిచితూర్చుండ యూరక యున్నఁడును లేని, వేఁట యే నేలవచ్చితి విపినమునకు
వచ్చెఁ గాకేమి దుష్టసత్త్వములఁ జంపి, యేల తనియకవచ్చితి నట్టిబడిని.

వ. విధికృతం బెట్లు కానున్నదో కాక యని యాకులితచిత్తుండై యానృపోత్తముండు
తాపసోత్తము పదంబులకు ముదంబొదవం బ్రణామంబుచేసి కరకంజంబు లంజలి
బంధంబుగావించి యంటియంటి మంజులోక్తులఁ దపస్వికుంజర యేను దుర్వ్య
సనంబున మృగయావిహారంబునకు గడంగినదిలేదు. సింహశరభసైరిభద్వీపిద్వీపాది
దుష్టమృగంబులుగోష్ఠంబులకు నేధిష్ఠి గ్రామంబులకు నరిష్టంబు సేయుచున్న యవియని

భిల్లపల్లవజనంబులెత్తింగించిన వానిఁబరిద్దించుటకునై నిర్దయ శార్దూల సమ్మర్దంబును
మదభగ్నోత్కంఠ కంఠీరవారావభైరవంబును శరభ సైరిభ ధ్వాంతభయదంబును
ప్రచండ వేదండ ప్రకాండ బృంహితకాండ జలదగర్జానూర్జితంబును సముల్ల
సద్భల్లూక కీంకారనిక్వణకలితంబును మద్ధతస్తబ్ధరోమోద్ధామనిఘ్రాణ ఘుర్ఘు
ఘుర్ఘుర నిర్ఘోషభీషణంబును దుర్వ్యాఘ్రద్వీకరభీకరంబును నైన యరణ్యంబున
వేఁటలాడుచు వచ్చి యిది యాశ్రమమృగంబౌటయెఱుంగక కురంగిలంచియుండ
వన్యమృగంబకా నిర్ణయించి వేఁటాడి యాలయించితి నీ యజ్ఞానంబు సహింప
వలయు నని నం బరమజ్ఞానియగు మునీంద్రుండు నరేంద్రు నాలోకించి. 39

క. జననాథ దుష్టమృగ మ, ర్దన మొనరింపంగ నీ వరణ్యంబునకుం
జనుదెంచు టంతరవలో, కనముల నెఱుఁగుదును నీకుఁ గలుషము గలదే. 40

గీ. దీని నాశ్రమమృగ మని తెలియ కీవు, వచ్చుటెఱుఁగుదు మది నీకు వలదు భయము
వైరిమర్దనుఁడవు వంశవర్ధనుఁడవు కీర్తిధనుఁడవు నీకొక కీడుగలదె. 41

ఉ. సర్వజనైకపూజ్యుఁడవు సత్యయుతుండవు నీవు మాను కా
శీర్వచనంబునం గను ప్రసిద్ధ నపూర్వ సుపర్వనాయకాం
తర్యసుఁడైన నీ యనుఁగుఁదాతఁ బురూరవుఁ బోలువాని నీ
యుర్విరఁ జక్రవర్తిపద మొందు సుపుత్రుని సచ్చరిత్రునిన్. 42

క. ఈ మాలినీతరంగిణి, సీమముగా నింతనుండి క్షితినాయక ని
స్సీమ తపోనిధి కణ్వుఁడు, హా ముని తపముండు నాశ్రమాటవి యిచటన్. 43

సీ. మునులు నిత్యస్నానములుదీర్చి యుటలక కాసారముల కంచ గదియవెఱచు
మౌనిజనం బనుష్ఠానంబుఁదీర్పక మృగశాబకము దర్భ మేయవెఱచు
సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక ప్రసవంబునకుఁ దేఁటి ముసరవెఱచుఁ
బారికాంక్షులు ఫలాహారతృప్తులు గాక కీరంబు పంటికిఁ జేరవెఱచుఁ

తే. దపసిజనములు నతిమంత్రజపములుడిగి, వచ్చియుండక పికశిఖావళములాది
గా వనంబునఁగల విహంగకులంబు, లత్తిగమునోంది నోరువా రుత్తవెఱచు. 44

సీ. వృద్ధసింహమునకు విహరింపఁ దొండంబు కైదండగా నిచ్చు గంధగజము
పులిక్రొత్తయీనిన పాదచింటిలోనికిఁ బురిటాలితగఁబుఁ గొంపోవుహరిణి
శరభంబుకోనగోళ్ళ శిరము దువ్వఁగఁజొక్కి కనుమోడ్చుసుఖనిద్ర గండకంబు
సింహకిశోరంబు చేరవచ్చిన వింతలేక చన్నిచ్చు బాలెంతకరిణి

తే. ఎలుకతోడుతఁ జెలఁగాడు నెనసిపిల్లి, నెమ్మిబురివిచ్చి నిలిచి పింఛమ్ము నీడ
భుజగశక్యక నాడించుఁ బూరినెమలి. యనఘ కణ్వమునీంద్రు పుణ్యాశ్రమమున. 45

మ. పవనుం డాహుతిగంధముల్గొనుచుఁ బైపైవచ్చె నాసాపుటీ
వివరప్రీతిగ నాస్వదింపుము చతుర్వేదోక్త మంత్రధ్వనుల్
కవియం బారెడు యజ్ఞవాటముల నాకర్ణింపు వీక్షింపు వ
చ్చె వియద్వీధికి హోమధూమలతికల్ జీమూత జీవాతువుల్. 46

వ. సంయమీంద్రులు నరేంద్రు నీవిచటికి వచ్చుట తమ దివ్యజ్ఞానంబున నెఱింగి యున్నవారు నీ వెఱుంగమిచేసికొని పోవక యాయురైశ్వర్యాభివృద్ధికరంబును గలుషకర్శనంబును నగు తాపసదర్శనంబుఁ జేసి పొమ్మని యమ్మునివరుండు నిజేచ్ఛం జనియె. నృపవరుండును నచటనుండి యరదంబెక్కి చనుట యుచితంబు గామింజేసి తేరు మాలినీతీరంబున నునిచి శరాసనాదిసాధనంబులు సారథిచేతికిచ్చి తేవనంబునం బరమపావనంబగు తపోవనంబుసొచ్చి. 48

సీ. శుకగర్భకోటరచ్యుతములై నీవారప్రాల్క్రిందఁ జెదరినపాదపములఁ
దలలపు గారకాయలు నూఱ నందులఁ జమురంటి మెఱయు పాషాణతతులు
నిబిడవల్కలశిఖానిష్యందరేఖల జాలులుగల జలాశయపదములఁ
దమమేను లొరసికొంచు మనుష్యులరిగిన భయమునఁ జంచలింపని మృగములు
తే. గలిగి యన్యోన్యమైత్రి నక్కడఁ జరించు, పులులకూనలు జింకపిల్లలు మృగేంద్ర
పోతకంబులు నాలక్రేపులును గఱుపుఁ, గట్టికొని కూడియాడ నక్కజముఁ జెంది.

శా. వేదాధ్యాపకులైన రాచిలుకలన్ వేదాంతమీమాంసలన్
వాదం బిమ్ములఁ జేయు శారికలఁ దత్వంబిదు జారుండుఁగా
నాదేశించు పురాణముల్ చదువు చక్రాంగంబులన్ సామముల్
నాదంబొందఁ బినాకిఁ బాడు నళులన్ వందారుఁడై చూచుచున్. 49

చ. చనునెడ నంతలోఁ గుడిబుజం బదరంగఁ దొణంగినన్ మనం
బునఁ గడుఁ జోద్యమందుచుఁ దపోవన మిచ్చట దీనికిన్ ఫలం
బొనర మనోజ్ఞమూర్తి యగు యువ్వలిఁ గౌఁగలిఁ జేర్పఁగావలెన్
గొనకొని యాశ్వయుండ యెఱుఁగుం గనలా దిది మానుషంబునన్. 50

మ. అని శార్ఙ్గనుపదంబు లేఁగునెడఁ గర్ణానందసంధాయులై
వినఁడా వచ్చెఁ బ్రియంవదా నిగిడిరావేయంచు రారాఁగదే
యనసూయా యని వృక్షసేచనము సేయంజాలఁ బ్రొద్దెక్కెఁగా
యని యాక్షేపము సేయు నొక్కతెను మధ్యామంజులాలాపముల్. 15

క. ఆమాట లాలకించుచు, భూమీశుఁడు కొన్ని చరణములు చని యెదురన్
గామునిదీపములనఁ జను, వామాక్షుల ముగురఁ జూచి వారలలోనన్. 52

శా. చంచత్పల్లవ కోమలాంగుళికర స్సంపూర్ణచంద్రాసన
స్యంచచ్చందనగంధి గంధగజయానం జక్రవాక స్తని
గించిన్మధ్యఁ జటిల్లతావిలసితాంగిం బద్మపత్త్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతల న్మధుకరశ్రేణీ లసత్కుంతలన్. 53

సీ. దర్పకురాజ్యంబు దలఁచూప నెత్తిన బంగారుటనఁటికంబములనంగ
రతిమన్మథులు విహారమునకై చేతులఁ బట్టియాడెడి సిమ్మపం డ్లనంగ
రేయి వెన్నెలనాఁటి రేయెండ యుదయింపఁ బెదరు చకోరంపుఁ బిల్లలనఁగ
శృంగారసరసి రాజీవకాననమున విచ్చినకనకారవిందములనఁగ
తే. నూరుయుగమును జనుదోయి యొప్పువిప్పు, కన్నుఁగవ నెమ్మొగంబు నుత్కంఠఁ బెనుప
గౌతుకముఁ జేసె మేదినీకాంతుమదికి, విపులలావణ్య పరసీమ తపసిలేమ. 54

వ. అప్పుడ ప్పుడమిఱేఁడు విస్మయాయత్తంబగు చిత్తంబున న త్తపస్విమత్తకాశిని
నవలోకించి తన మనంబున. 55

సీ. సురకన్యకాఁబోలు సురకన్యయయ్యెనే తీవిమై రెప్పలాడించు టెట్లు
పుత్తడికాఁబోలుఁ బుత్తడియయ్యెనే హంసీగతుల నడయాడు టెట్లు
వనలక్ష్మికాఁబోలు వనలక్ష్మియయ్యెనే కటివల్కలంబులు గట్టు టెట్లు
రతిదేవికాఁబోలు రతిదేవి యయ్యెనే వలరాజుఁ బెడఁబాసి వచ్చు టెట్లు
తే. కన్నుఁగవ యార్చుటను సురకన్య కాదు, నడచియాడమిఁ గానఁ బుత్తడియుఁ గాదు
లలిఁదపశ్చిహ్నమున వనలక్ష్మి గాదు, ప్రసవశరముక్తయైనది రతియుఁ గాదు. 56

వ. మానవ మానవతియ కావలయుఁ గాక దేవకామిని యయ్యె నేని నన్ను నవలోకించి
యంతర్ధానంబునొందుఁ గాకుండె నేని నన్యోన్యసల్లాపంబులఁ జగించి యూరకుండు
రు కావున నొక్కదిక్కున మఱుఁగుపడియుండి యవలోకింపవలయునని సమీప
వటవిటపిమూలంబునం దాఁగి కనుంగొనుచుండె నయ్యవసరంబున. 57

క. బిందెలు కరములఁ గొని యర విందాస్యలు జలముదెచ్చి వేడుకతో నం
దందతరుసేచనంబును, సందడిగొని చేయుచును ససంభ్రమలీలన్. 58

క. అనసూయ నిగిడిచన న, య్యనసూయం గడచి వడిఁ బ్రియంవద చన న
య్యనసూయఁ బ్రియంవద మును, గొని వేగిరపాటుతో శకుంతల చనఁగన్. 59

సీ. అరుణపల్లవములు హస్తాంగుళంబులు గాంజూయఁ దమలోన శ్రేణిసేయ
వెలిమించుమొగ్గలు విమలదంతంబులు చెలువంబుఁ దమలోనఁ గలసి వెలయఁ
బరువంపుగుత్తులుఁ బ్రస్ననిపాలిండ్లు మన్వంబుదమలోన మార్పుకొనఁగఁ
జిందుపేనియలును జెమటచిత్తడి మును గ్రొత్తావితమలోన బిత్తరింప
తే. లలితపుష్పిత జంగమలతికవోలె, వల్లికాప్పక్షముల యాలవాలములకు
జలమువోయు శకుంతల చంద్రవదన. చాయతఁ వైభవముఁ జూచి జనవిభుండు. 60
చ. దిరిసెనపువ్వుకంటెఁ గణుతింపఁగ మెత్తనమేనుదీఁగె యా
తరుణికి [illegible] లతాతరుసేచన మాచరింపఁగాఁ
గరుణ [illegible] లేక కడఁగట్టె మునీంద్రుఁడు మాటలేటికిన్
సరవిరొమలు [illegible] జూతులు వేచర [illegible]. 61
గీ. చందనంబునఁ బుష్పంబుఁ గుందనమునఁ, బరిమళం బిక్షులతకును ఫలమువోలె
రతిమనోహరమైన యీయతివ మేన, నరయఁ గనుఁగొంటిఁ గాని యీయౌవనంబు.
వ. ఈలతాతన్వి తపస్విని చిహ్నంబులు పూనియున్నను నెంవుచూపుచు శరీరకాంతి
సౌందర్య సౌభాగ్యంబు వలన రాజసంబును బ్రతాపంబును గర్వంబును తేరము
నించుకించుక ప్రకాశించుచున్నయవి మానికన్యాకలితంబగు బ్రహ్మతేజోవిశే
షంబు లేశంబును గానరాకున్న దదియట్లుండె. 63
ఉ. సందియమేల యీవికచ సారసలోచన రాజపుత్రి నా
డెందము మౌనికన్యలబడిం జనసేరదు నిక్కమంబ యే
చందమునందు సంశయ విచారపదం బగునట్టి పస్తుసీ
మం దమ చిత్తవృత్తు ప్రమాణము లుత్తములైనవారికిన్. 64
ఉ. పౌరవవంశసంభవుల పావనచిత్తవిధంబు లన్యకాం
తారతికిం బ్రమోదభరితంబులు కావు ప్రకంపమొంది యీ
ధారుణి సంచరించినను దామరచూలి వరంబు దప్పినన్
వారిధులింకినన్ మతి దివాకరచంద్రులు తప్పఁ గ్రుంకినన్. 65
క. కానీ సంశయమెల్లను, మానుం బరిపాటి వీరి మాటలవలనన్
లోనున్న రాగి వెలుపలఁ, గానంగావచ్చు పూఁతకడియముభంగిన్. 66
గీ. వీనులకుఁ బండువులుగాఁగ వీరిమాటు; లాలకించెదఁ గాకని యధిపుఁడుండె
నంత నొకతేఁటివచ్చి శకుంతలాము, ఖాంబుజమునందు ముసరిన నలఁతనొండి. 67
క. కరమునఁ బలుమఱు నా మధు, కరము నదల్ప నదినెమ్మొగము విడువమికిం
గరము వడఁకుచు రజనీ, కరముఖి యననూయఁ జూచి కడుదీనతతోన్. 68

ఉ. ఈయలిపోత మేఁ జెలుఁగ నెక్కడనుండియొ వచ్చి మోముపై
రాయిడిచేయుచున్నది కరంబులఁ జోపినఁ బోవదన్న నో
తోయజనేత్ర నే నెఱుఁగుదున్ విరవాదికి నీరువోయఁగా
నాయెడనుండి వచ్చె భవదాననగంధము నాస్వదింపఁగన్. 69

మ. శ్రవణేందీవరముం భజించె నదియుం బ్రస్థానముక్తంబుగా
భవదక్షిన్ వసియించె నక్షిముకుళింపం జేఁటినెమ్మోము నైఁ
దవిలెన్ దానిఁ దొరంగఁ జోఁపుటకు హస్తంబెత్తి వారించ డా
నవు నంభోరుహసామ్యదోషము వయస్యా లేదె నీచేతికిన్. 70

గీ. కమలరుచి నీముఖాక్షి హస్తములు చూచి, పద్మినీభ్రాంతి నీయళి వాసిపోవ
దనిరొ యెఱుఁగునీ వఱుంగుదువనినవిభుఁడు, తెఱవమోమున భ్రమరించు తేఁటిఁ జూచి.

మ. వనిలేం జంచదపాంగఁ జేసి కనుఁగ్రేవన్ ముట్టుచుం జేరి మం
తనముం జెప్పెడుభంగి నొయ్యఁ జెవిచెంతన్ మ్రోయుచున్ మెల్లమె
ల్లన మోవిన్ రతిసౌఖ్యసంపదలు గొల్లగ్గొంటి ధన్యుండ వీ
వనఘా తుమ్మెద నేను వెల్వడితిఁ దత్త్వాన్వేషముం జేయుచున్. 72

వ. విమలసుధాకరకులీనుండ నేను శంకాకలంకితచిత్తుండనై యుండ మలీమసమధుప
కులీనుండ వీవు నిశ్శంకంగొంకక పంకజముఖిం జవిఁగొంటివి చండాలిభర్తృపుణ్యుం
డును విశ్వంభరాభర్త యపుణ్యుండును నయ్యెంగదా యనుచు నా చంచరీకంబు
నాక్షేపించుచు నాడు పల్లవాధరులసల్లాపంబులు చెవులకుఁ జల్లఁగా వినుచు నల్లం
బున భూవల్లభుండు చప్పుడుసేయకుండె నప్పుడు శకుంతల విస్రస్తకుంతలయు
విధ్వస్తధైర్యయు విన్యస్తసాధ్వసయునై యనసూయాప్రియంవదల నవలోకించి.

గీ. ఏను మీచెలి నింతేని యొరవుసేయ, వింతవారైన మొఱయాలకింతురకట
ప్రాణసములరు కావరే ప్రాణమెత్తి, మమతవిడువక మార్పరే మధుపబాధ. 74

క. నేఁ జనినచోటికెల్లను, దాఁ జనుదెంచుచును మరలఁ దనుఁజోఁపంగా
మోఁజేతులెల్ల గిజిగిజి, గా జేసెను మొగలిముండ్లు గాఁడినభంగిన్. 75

గీ. వివర మొనరింప బొందులు వేఱుగాని, ప్రాణమొక్కటి మనకుఁ బద్మాక్షులార
పాపరే నాకు నీయాతిబాధ యనిన, జిట్టకాలకు వార లచ్చెలువతోడ. 76

ఉ. ఇంతి తపస్వికన్యకల మేమసమర్థల మీతిబాధ భూ
కాంతుఁడు మాన్పె ధాత్రి ప్రజఁ గావను బ్రోవను గర్తకాన దు

ష్యంతున కేమి చెప్పెదము సాధుజనార్తిహరుం డతండు దు
ర్దాంతుని నియ్యలిం గడపి తామరపూఁ జెఱసాలఁ బెట్టెనన్. 77

వ. రాజసన్నిధికిం బోయెద మన సఖులకు రెండుమూఁడు పదంబు లరిగిన ననసూయాప్రియంవదల వెంట నాక్రోశంబు సేయుచు శకుంతలయు గదలె నయ్యవసరంబున భూవల్లభుం డప్పల్లవాధరలం గనుంగొని లీలావ్యాజంబున నీ రాజవదన లాశ్రమసదనంబునకుం జనకుండ సెలంగించుకొన నిది యవసరంబు గ్రమ్మనిచాటుపడదగి జవనిక వాయందట్టినం బోడనూవు బహురూపితెఱంగున వలుంగుపడియున్న తానన్నలిననిలోచనలకుం గోచరుండై నిలిచి యేవకం డోడకుండు తపస్వికన్యలకు మీకు నావలం బొనర్చిన దుశ్చరిత్రుం డెవ్వండు వానినాజ్ఞాపించెదనని సుధామధురంబు లగు నతని వాక్యంబు లాకర్ణించి కనుంగొనునెడ. 78

సీ. కస్తూరిరాసిన కరణి మీసలు నల్లదొగడు రేక జనించు మోము మెఱయఁ
గ్రొత్తమ్మిసోగ రేకులమీఁదఁ దుమ్మెద లున్నలాగునఁ బెద్దకన్ను లమర
నాజానుదీర్ఘంబులైన బాహులు పెంపు శేషభోగాకృతిఁ జెలువమొందఁ
బిడికిలింపఁగవచ్చు నడిమి యొప్పిదముతో నురము విస్తారంబు సిరి వహింప
తే. నాననము పూర్ణచంద్రుఁ బెం పపహసింప, గగనమునుండి వేడ్కానకాఁడమిలకు
నదరిపాటున డిగిన జయంతుఁ డనఁగఁ, జాలనద్భుతమొసగె దుష్యంతమూర్తి. 79

వ. ఇట్లు పొడచూపిన నృపాలచంద్రు నాకారతేజోవిశేషంబులు భావించి జయంతుండో, కంతుండో, నలకూబరుండో యిచ్చటికివచ్చుట కెయ్యది కారణంబకో యని యద్భుతంబును భయంబును మనంబునం బెనంగఁ గొండొకపడి గనుంగొని నరుండకా నిశ్చయించి యతని కులనామధేయంబు తెలిసికొనవలెనని యనసూయాప్రియంవదలు రాజువదనారవిందంబు నాలోకించి. 80

ఉ. ఎక్కడివాఁడవన్న జగతీశ్వర లక్షణలక్షితంబు నీ
చక్కనిమేను దీర్ఘభుజశాఖలఁ జేడముఁ జర్చ సేయఁగా
నిక్కడికొంటివచ్చుటకు నెయ్యది కారణ మంతపట్టు నీ
నిక్కముఁ జెప్పుచున్న ధరణీపతి సత్యచరిత్రుఁ డాత్మలోన్. 81

క. వారక యసత్యవచనము, నారశ హేతువనఁగను వినంబడెడుం బు
ణ్యారణ్యములోపల ముని, దారికలకుఁ బొంక నేల ధర్మచ్యుతిగన్. 82

వ. అని విచారించి వారలతో నేను దుష్యంతుండఁ గాంతారంబున దుష్టమృగంబుల మర్దించుటకై వేఁట వచ్చి మాలినీతీరంబునం బరివారంబు నిలిపి కణ్వమహామునిస్న

మస్కరించి పోవుతలంపున వచ్చి యిచ్చట నొక్క కలువకంటి యొంటి సాక్రో
శింప మీ యార్తనాదంబు విని యరుగుదెంచునప్పటికి మీ సరససల్లాపంబులై యున్న
యవి యని యల్లనల్లన శకుంతలం గనుంగొనుచుండ వచ్చుట. 83

శా. ఆ కాంతాతిలకంబు చన్నుఁగవపై సందంద రోమాంచ మ
స్తోకంబై పొదకట్టు నుత్కలికఁ జేతోభీతి సంధిల్ల నా
ష్మాకాంతాగ్రణి మంజుభాషణము లాకర్ణించుచుం దోన తా
నాకర్ణించె మనోజచాపగుణసాహంకార టంకారముల్. 84

క. భావభవపుష్పచాప, జ్యారవమున తన్మయత్వముఁ దెలుపం
జేసే ప్రతినయనసన్నిభు, నావిభుఁ గనుఁగొనుచునుండ ననిమిషదృష్టిన్. 85

చ. కొలఁదికి మీఱు కోర్కుల శకుంతల మాధవనృపాలు డెందము
న్నలుపుము దెల్పునైన నలినచ్ఛద లోచనలోచనచ్ఛవు
ల్వలలముట్ల పాటుకొన సౌరభలోభమున న్మధువ్రతం
బులు దగులంగ నాటుకొనెఁ బుష్పధనుర్ధరుఁ డేయుతూపులన్. 86

క. వాలికలై వీఁదమ్ములఁ యేలికలై భావభవుని యలదూపులకుం
బోలికలై యుత్పలికల, మూలికలై యబలఁ దాఁకె మొగి నృపుచూపుల్. 87

ఉ. బాలికచూపులన్ ధరణిపాలుచూపులు నొండొకళ్ళపై
గీలుకొనం జనంగఁ గనుగ్రేవల నవ్వుచు నిల్పి యర్ధట
స్వాలిక పువ్వుఁదూపు లిరువంకలఁ బాఱఁగ నిక్షుచాపముం
గేల నమర్చి యేయఁదొడఁగెం బ్రసవాస్త్రుఁడు సవ్యసాచియై. 88

ఆ. కాముఁ డనెడు వేటకాఁ డేయుచును రాఁగ, నవిద చేతమనెడు నోదమునను
వసుమతీశ చిత్తవన్యకరీంద్రంబు, పడియెఁ గాని మగిడి వెడలదయ్యె. 89

వ. ఇత్తెఱంగున లతాంతశరనికరనిర్భిదేళిమస్వాంతుండై యుండ నందు శకుంతలాలికుం
తల తన మనంబున. 90

చ. విరులశరంబునుం జెఱకువిల్లును బూనఁడు గాని వీఁడుగో
మరుఁడు మరాళయానలకు మానవతీవచనంబు పల్లవా
ధరలకుఁ జెల్లదింక విదితంబుగ నీతనిఁ జూచిరేని సా
తరుణి కితండు గూర్చునది దర్పకు నేలదె యింతిబంటుగన్. 91

గీ. యక్షనందను రూపంబు హాస్యకరము, పాకశాసనిరూపంబు బడిసివాటు
విషమబాణుని రూపంబు వినిమయంబు, ధరణినాథరాజచంద్రు సౌందర్యమునకు.

వ. ఇతండు ప్రియుండుగాఁగల భాగ్యవతికన్య యెవ్వతెయొకో యని చింతించుచుఁ గనుంగొనుచున్న యన్నలినలోచనయు ననసూయాప్రియంవదలు రాజు విచ్చేసియున్నవాఁ డెక్కడఁజూచెద నేల నివ్వెఱపడియున్నదాన వర్ఘ్యపాద్యంబులొసంగ వలయుఁ బర్ణశాల కతిత్వరితమ్ముగ రమ్మని కరమ్ము పట్టుకొని తోడ్కొనిపోయి యప్పుడు సర్వంబును సమీచీనంబు చేయించి భూపాలుపాలికి నొక్క శిష్యుం బుత్తెంచిన. 93

క. అంతేవాసియు నా దు, ష్యంతుని గని యధిప యతిథిసత్కారము నీ
కెంతయు భక్తినొసఁగ శ, కుంతల పుత్తెంచెఁ దోడుకొని రమ్మనుచున్. 94

గీ. వేగవిచ్చేయుమనిన నావిప్రుతోడ, నసఘు యందు శకుంతల యనఁగ నెవ్వ
తె తపస్విని వ్రతమెద్ది యెట్టిచర్య, యరయ కింతులచేఁ బూజ యనుచితంబు. 95

క. అనవుడు భూపాల తప, స్వినిగా దాయింతి భువనసేవ్యుండగు క
ణ్వునికూఁతు రాయమకుసై, మునిముఖ్యుఁడు సోమతీర్థమునకుం జనుచున్. 96

వ. అతిథిసత్కారంబొనర్ప నాకన్నియను నియమించిన నంతరాంతరంబు లెఱింగి యార్యులకు సపర్యలు సేయుచుండుననిన నతని వదనంబు నవలోకించి యూర్ధ్వ కేతుండు కణ్వమహామునీంద్రుం డతనికి నపత్యలాభం బెట్టుగలిగె నది యద్భుతంబు వినవలయు ననిన. 97

క. ఎంతేనియుఁ గలదీ వృ, త్తాంతము మీ రలసినార లరుదెంచు పథ
శ్రాంతి హరియింపుఁ డమలఁ, స్వాంత శకుంతల యొనర్చు నాతిథ్యమునన్. 98

క. తడయవల దనిన నేమిటు, బడతి యదితేమి కాశ్యపమునీంద్రున కీ
పడఁతి జనించిన క్రమ మే, ర్పడ వినుపింపుమన నతఁడు భాసురఫణితిన్. 99

వ. మధ్యమలోకపాలకుండవైన నీవచనంబు మాకు నలంఘనీయంబు తత్కథాక్రమంబు యథాక్రమంబునం జెప్పెద దత్తావధానుండవై చిత్తగింపుము. 100

సీ. మునిమనోమోహన ముక్తినటీ నాట్యరంగంబు లగు హేమశృంగములును
గనకాబ్జకైరవకల్హారసౌరభోద్గారంబులగు జలాధారములును
క్రీడారతిశ్రాంతి కిన్నరీపరిచితస్నేహంబు లగు గుహాగేహములును
గుంజన్మదాలినీ మంజులమంజరీ పుంజంబులగు లతాకుంజములును

తే. నలరి పెంపొందుఁ బూర్వాపరాంబునిధుల, నడుమ ధరణికి మానదండంబువోలె
దేవతాత్మ ధరాధీశ దివ్యభూమ, పుణ్యనిలయంబు నీహారభూధరంబు. 101

ఉ. ఎంచి నుతింపశక్యమె యహీశ్వరు నంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమని రస్తసమస్తకవీందుజాలముం

గాంచనకందరాయవనికాయితవారి ధరాంతరాళ ని
త్యంచిత దేవతామిథున వాంఛితమూలము శీతశైలమున్. 102

గీ. భూధరములెల్లఁ దమవత్సముగ నొసర్పఁ, బృథుస్పృహాలోపవిష్టయై ప్రియముమీఱ
నఖిలరత్నౌషధులను జన్నవిసి పిదికె, నమరశైలంబు దోగ్ధగా నవనిసురభి. 103

ఉ. వారని మంచుపైఁ బొదివివచ్చిన పోయిన చొప్పుమాసిన
న్భారినఖాగ్రముక్తరుచియి పొల్పగు ముత్తెపుఁజాలు పెట్టఁగా
దారటులేగి కాంచుసహతద్విపకేసరి వాస సీమలన్
వీరకిరాతులద్రివనవీథుల సింగపు వేఁటలాడుచున్. 104

ఉ. పూనము దప్పకుండ ననమాన దరీ ముఖరాయమాన హే
లా నిలపూర్ణ రంధ్ర నిచయంబయి కీచకరాజి మ్రోయఁగా
నానగరాజు కిన్నరుల యుంచిత గాన వినోద వేళలన్
దానొకవాసికాఁడువలెఁ దక్కఁగ మాల్కొనఁజేయు తానముల్. 105

క. ధరణిధర సానుతటములు, పరిమళవంతములు సేయుఁ బాయక యెపుడుం
గిరికందరాయన విస్స్రుత, తరళ క్షీరప్రనూతి సౌరభలహరుల్. 106

ఉ. బింగపుతాలుగా హిమము పేరిన యగ్గిరిత్రోవ దుర్వహో
త్తుంగ కటీకుచాలసవతు లొత్తరగాస్యలు సంచరించుచో
నంగుళి పార్శ్వభాగముల కార్తి యొనర్చఁగాని యయ్యెడ
న్జంగలుచాచి మందగమనంబున కొందఁగ నీరపాయముల్. 107

సీ. ఏదేవి నఖరోచు లిందురేఖల భంగిఁ బ్రవహించు నోంకార పాదపీఠిఁ
గొమరొందు నేదేవి కుడివాక నర్ధపల్లవిత శంకరరూప లలితముద్ర
ఏదేవియందు బ్రహ్మాదులీడని నతావృత్తిఁబొల్తురు కల్పవిరమవేళ
జనియించు నేదేవి శాంభవీవిలసచ్ఛ్రీశతాంశమున వైరించ సృష్టి

తే. కన్నుసన్నల నేదేవికడఁ జరింతు, రఖిలదిక్పాలశుద్ధాంత హరిణనయన
లామహాదేవి పుత్రికయయ్యెఁ. గూర్మి, నెట్టి తపమాచరించెనో హిమనగంబు. 108

వ. ఇట్లనన్యసామాన్యసౌభాగ్యప్రాభవవైభవంబుల జగన్నుతంబగు నమ్మహాశైలంబు
నుపాంతంబున సర్వర్తుకిసలయ ప్రసవఫలభరప్రకాండ మండితంబగు కాననాంత
రంబునఁ బుండరీక కైరవోత్పల షండ సంపన్నంబగు జలాకర సమీపంబున
నొక్క చిక్కణసికతాప్రదేశంబున. 109

సీ. పంచాక్షరీమంత్ర పరమోపనిషదర్థవాసనా సురభి తమువ్యానిబుద్ధి
శ్రుతిపాఠ పూత వాక్పతి ముఖస్తుతులచే వదలె నెవ్వఁడు నవస్వర్గసృష్టి

బాహుజుండయ్యు దపశ్శక్తి నెవ్వాఁడు బ్రహ్మర్షియై యెక్కె బ్రహ్మరథముఁ
బందె మోడిచెవంబు పంచియిప్పించె నిశ్శంక నెవ్వాఁడు హరిశ్చంద్రునకును

తే. నమ్మహాత్ముండు సకలలోకైక వినుతుఁ, డొవ్వసేయునితోఁడి పుండ్రాటకాఁడు.
నిష్ఠతోఁ దుత నాశ్చర్య నియమవృత్తిఁ, దపము నొనరించె నంబికాధవుని గూర్చి 110

ఉ. పద్మజసంభవుం డతుల భాస్కరతేజుఁడు గాధిసూనుఁ డ
త్యద్భుతమతిం దపోనియమసంగతి నొంచె సముల్ల సన్మన
స్సద్మమునందు నిందుధరు శైలసుతాధవు భోగికంకణు
న్పద్మనిశాచరాంతకుఁ గృపానిధి నిల్పి యనన్యచిత్తుఁడై. 111

మ. ఇనయుం గందువులం బలంబునను నట్టెండ త్వెసంగా యనఁ వే
సవులం బంచమహాగ్ని మధ్యమున వర్షావేళల న్వర్ష వృ
ష్టి వితానంబులు లేని బట్టబయల న్నాకాశవాసుండౌ యుమా
ధవుఁ జింతించుచు నిల్చి చేసెఁ దపముం దాత్పర్యధైర్యంబునన్. 112

గీ. మానసాంబుజ కర్ణికామధ్యమునను, గొన్నిదినములు శశిమౌళిఁ గనుచుఁ గొల్చి
మీఁది గాడ్పుఁ గ్రిందిగాడ్పుతో మేళవించి, భానుశశిమార్గములు గట్టువఱపి తగను.

శా. లీలన్మధ్యమనాడి నాజమిలి గాలిం జొన్ప లావెక్కి యు
త్కీలంబై యొగి బ్రాకి చిద్గగనవీథిం జెంది యందున్న యా
ప్రాలేయద్యుతిమండలంబుఁ గరఁగింపం దత్సుధాసారముల్
మూలంగూర్కెడు పాపకన్నె దెలుప న్మూర్ధాభిషేకంబునన్. 114

కం. కదవలి దిరిఁగాదు తొల్లిటి, తెవులుచెవ నంతరసులఁ దెలిపి కనుక నిక్
బదవులు వెట్టెఁడు తనతమ, యిరవులు గోల్పడిరి పడిరి యెట్లనొ తారున్. 115

మ. వశమై పశ్చిమనాడియందుఁ బవనద్వంద్వంబు వర్తింపఁగా
దశనాదంబులు సంభవించి మొరయన్దాని న్వశానందుఁడై
యశనాయాసల పేరుయుం న్మటియు దైన్యాదైన్యముల్లేక యా
శశిజూటుం డతను దాను దానయయి విశ్వామిత్రుఁ డిట్లుండఁగన్. 116

మ. అవనీచక్రము గ్రుంగె నింగి ఘనగర్జాతంబరంబయ్యెఁ జి
క్కువడెం జుక్కలు తుల్లె దిక్కరులు సంక్షోభించెఁ గుంభీనస
ప్రవరుం డుల్కెఁ దలంకె ధాత వగిలెం బ్రహ్మాండభాండంబు బి
ట్టగిసెం నిర్జరరాజధాని వడి నూటాడె న్మహాశైలముల్. 117

వ. ఇట్లు విశ్వాధిపుఁడగు విశ్వామిత్రుఁడు తపంబు సేయ భీకుండై పురుహూతుం డెం
తయు నంతరాయంబు నొందింప నిలింప చంపకగంధులందు నెవ్వరు గలరొకో
యని సమీపంబునం గొలిచియున్న నిర్జరజనంబు నవలోకించి. 118

సీ. కమనీయసురసభాగారమధ్యమునకు దీపించు మాణిక్యదీపమనఁగ
రంభాదిదేవతా రంభోరువులకెల్లఁ జారుచూడావతంసంబనంగ
జగములు గెలువంగ సానఁబట్టించిన రతిరాజు నవఖడ్గలతికయనఁగఁ
యతుల మానసము లుద్ధృతి నాకర్షించు వరవశ్యమంత్రదేవతయనంగ
తే. బంతమాడిన హరునైనఁ బద్మభవుని, నైన హరినైన మోహరసాబ్ధిఁ ద్రోచి
యూఁచు లాతింపనోపెడు నిగురుఁబోఁడి. మేనకాసతిఁ జూచి సన్మానమొసఁగి. 119

వ. సకలసౌభాగ్యసౌందర్య మందిరంబగు నీచేతం గాని గాధినందనుతపంబు విఘ్నంబు
గాకేరదు. శీఘ్రంబ చని యమ్మౌనివరుని మరునియాజ్ఞకు లోనుచేసి రమ్మనిన
మహాప్రసాదంబని యక్కొమ్మ పాకశాసను శాసనంబునఁ గౌశికు తపోవనంబు
నకు వచ్చి వియచ్చరపతియాజ్ఞ నత్యుచ్చర మచ్చెకంటి కనుంగొని. 120

శా. ఏతెంచె న్మధుమాసలక్ష్మి తరుణీహిందోళరాగ ధ్వను
ల్వాతెంచె న్బటుమీనకేతనుఁడుతోఁ గల్లండి పూఁజేతపైఁ
దోతెంచె న్దరిరాయుఁ గైకొనువులఁ దోడ్తోఁ దాల్మిలేఁదీఁగల
న్వ్రేతెంచె న్జంజేకపిక్రమకశాఖీమండు షూఖుం డౌగిన్. 121

ఉ. వామనదిగ్గజంబు మదవాసనతుం జనకోపహాటించు ను
ద్దామగతి స్నభోమణి రథంబుల నూరుఁడు ద్ధతుం
డై మగుడింపఁగా మిగుల తద్దముదాఁకె ననంగ నుత్తరా
శాముఖవీథి నేగె దినసంబులు దీర్ఘత పల్లవింపఁగన్. 122

గీ. తరణి మధువేళఁ బద్మినీ సరసకేళిఁ, దడసె ననవాసరంబులు నిడుపులయ్యె
బాసె విరహంబు నైంపమిఁ జేడి రథము, దటిమి కొనివచ్చె ననరేలు కలుచలయ్యె.

క. భూరుహములెల్ల నామసఁ, గారాకులు రాలి చిగురుగలయ నమి సొం
పారెను మధుమాసమునన, గారంబులు డులిచి క్రొత్తగప్పిన భంగిన్. 124

చ. మలయసమీరమ స్వేటుఁడు మచ్చరికంబునఁ బట్టి తీవలం
జెలువులనైఁ బురాణదలచేలములన్ హరియింప లజ్జనాఁ
జలనమునొందఁగా ననుపుబాణుఁడు చైత్రుఁడు తెప్పెఁ దోనతో
నొలపిన కూర్మి పేర్మి చెడకుండఁగఁ గెంజిగురాకు బట్టలన్. 125

సీ. తళతళమించు కెందలిరుటాకుల నెడనెడ నొయ్యనొయ్యనఁ దొడిమలెత్తెఁ
దొడిమల నడుమ వాతలాకింత గనవచ్చె రానన ననలంకురంబునాఁదెఁ
నన లంకురంబంది నవకంబుతోఁగూడ బలసి లేఁదావుల కలికలయ్యెఁ
గలికల పంచలేఁబులు వాకొలుపు మోము లరవిచ్చి మవ్వంపు టలరులయ్యె

తే. నలరుగుత్తులు మకరంద మలకనెఱయ, విచ్చి సోడుముట్టింపఁగా వీథికలను
దరుణభావంబు నొందించెఁ దరులతల, నభినవంబైన నవవసంతాగమంబు. 126

శా. సంపెంగ ల్పరువంది క్రొవ్విరులచే శంపాలతాలక్ష్మి నొం
దింపం బాదపముల్ప్రసూనంబులయి పూఁదేనె ల్దువాళించి వ
ర్షింప న్వల్పిరి చల్లి పాంథజనరాజి న్గమ్మగాడ్పు ల్చలిం
పింపన్మాన్మథవుఁ డంబువాగతి విడంబించె న్విజృంభించుచున్. 127

శా. హేమంతంబను రాజు సేనపటుపన్ హేలాగతిన్ జైత్రుఁడన్
సామంతుం డెదురం దదీయ జనరాజత్కార తుష్కార శిం
ఖామార్గంబుల నించు పాంసువులు నాఁగాఁ జర్వె నానామ గుం
జామల్లీలవలీల వంగ నవపుష్పశ్రేణికా రేణువుల్. 128

ఉ. తెమ్మెరలూఁపఁగా నలరు దేనియలాని మదించి యింపునన్
దుమ్మెదలేచులాగకులతో మధురస్ఫుట కోకిలా నినా
దమ్మునఁ బాడుచుండెను లతానవడోలలనూఁగి యాడుచుం
గమ్మని వింటిజోదు జయగాథలు పుష్పిత భూజ వీథులన్. 129

ఉ. ఆపువువింటిజోదు మధుపావళి నారిదొనర్చి చక్కఁగా
మోపిడిపట్టి జుమ్మనుచు మ్రోయఁగ మీటుచునున్నవాఁడు మా
కా పనిగాదు తాల్మి గొరఁగాదిఁక చన్నుల నంటఁబట్టుకొం
డో పథులన్ లతాంగులను నోజఁ గరం బెలుఁగించె గోయిలల్. 130

క. వలరాజు దండువెడలఁగ, బలములు నియమించు సైన్యపతు లెదురెదురన్
దలతలఁతను నెలుఁగులక్రియఁ, గలకల నెలుగించె నల్లకర రాచిలుకల్. 131

సీ. సమవర్తి రాణివాసాల పాలిండ్లపై మృగమదామోదంబు మేఁత వట్టి
దర్వీకరస్త్రీలు తన్ను వాచవిచూడ గందంపుఁగొండ చెంగటసుఖించి
దర్దరశైలమధ్యమునఁ గర్పూరంపు తరువాటికలలోనఁ దెరువుదప్పి
తామ్రపర్ణఖ్యాతిఁ దనరారుముత్యాల యేటి యంబువులలో నీదులాడి

తే. విరహిజనముల హృదయకోటరములందు, రాజుమదనానలముమించ రవులుగొల్పి
గాధిపుత్రుడు దపమున్న కాననమున, నల్లనల్లనవీచె మందానిలుండు. 132

వ. ఇత్తెఱంగున సంతోషితసకలజనస్వాంతంబగు వసంతంబుచమదెంచిన నుల్లసిత పల్లవంబును నుదార కోరకంబును నుత్ఫుల్ల కుసుమంబును నున్నత స్తబకంబును నుద్గత మకరందంబును నుద్ధూతపరాగంబును నుదంచితఫలంబునునై చైత్రరథమునకుం బ్రత్యాదేశంబును నందనంబునకుం బ్రతిచ్ఛందంబునునగు విశ్వామిత్రు నాశ్రమవనం

బున మనంబు లలర నలకువిలుకాఁడు సహాయంబుగా విహారవిలాసినులు పుష్పాప
చయంబు సేయంబూని. 133

క. తలఁదిరుగఁ దరుణకిసలయ, విలసత్ఫలభరిత విపినవీథిని వర
త్కాంకంత శారికా శుక, కలకంఠధ్వనులు చెవులకుఁ జవులొసఁగఁగ. 134

గీ. వలపుగాడ్పు లూర్పులఁ గలసి పెనఁగఁ, దుమ్మెదలఁ గుంతలమ్ములు దొట్రుకొనఁగ
బుప్పొడి మనవ్వులను గూడి పొత్తుకలఁగి, విరులు గోయఁదొడంగిర వ్వేళయందు. 135

ఉ. ఆసన్నంపుమైన వదనానిలముల్ పయిఁ బ్రోదసేయఁగా
గోసిన కొంబె వేగమునఁ గోసిన వృంతమునందుఁ బుట్టఁగాఁ
గోసె మనోజ్ఞమూర్తి యొక కోకిలభాషిణి నిండు కేదుకన్
డాసి సమస్యలెల్లఁ బొగడ న్బొగడ న్బొగడ ప్రసూనముల్. 136

క. సువ్వంపు టలరులు గోసెను క్రొవ్వాఁడి వఖాంతరములఁ గొమరుదళిత్వన్
బువ్వారుబోఁడి యొక్కతె, నవ్వులు బువ్వులును జడిగొనన్ సురపొన్నన్. 137

సీ. చటుకున నడిచి రసాలంబు నొక్కతె నలిపించి యా ప్రసూనములు గోసెఁ
జులకఁగాఁ దన్ని యశోకంబుఁ బూయించి విద్రుమాధరి యొర్తు విరులఁ గోసె
నవ్యగీతులఁ బ్రేంకణము వికసింపించి వనిత యొక్కతె ప్రసవములు గోసె
సమదరాగస్థితి సంపెంగ విరియించి చంద్రాస్య యొర్తు పువ్వులను గోసెఁ

తే. గలికిచూపులఁ బరువంబుగా నొనర్చి, తిలకమునఁ బూవు లొకవేల్పు తెఱవ గోసె
నిండుఁగౌఁగిటఁ గొరవి మన్నించి యొక్క, పురతలోదరి యలరు మంజరులు గోసె.

వ. మఱియును బురందరపురారవిందలోచనలును లోచనానందకరంబులగు తరు
లతాంతరంబుల లతాంతంబులఁ దెచ్చి రేకు మడంగకుండఁ గందకుండ మకరందంబు
చిందకుండఁ దేఁటి గ్రోలకుండ బరాగంబు రాలకుండ మేనకాహస్తంబునకు నిచ్చిన
నా హస్తిరాజగమన యా నవీన ప్రసూనంబుల ప్రసూనశరదమనమూర్తి యగు
విశ్వామిత్రపాదపద్మంబులకు సమర్పించి దండంబు వెట్టి లేచి సమీపంబున నంబూనిన
సహకారంబు నీడ నొక్కపాదం బాకుంచితంబుగాఁ దరువున నొఱగి, యొయ్యా
రంబున నొసలి చిట్టంటుఁ జెమట మాటిమాటికిఁ గొనగోర మీటుచుఁ దుంటవిలు
కాని మోహనశక్తియుం బోలె నున్న యెడ. 139

సీ. కేఁటిమొత్తము నేఁపు దూఁటుబుచ్చఁగనోపు కమనీయనీలాలకములు చూచి
చిగురుటాకుల డాయఁ జిన్నఁబుచ్చఁగఁజాలు సాంద్రంపు కెంపుహస్తములు చూచి
కరికుంభముల క్రొవ్వుఁ గాకుసేయఁగ నవ్వు దోరంపు సరి చన్నుదోయిఁ జూచి
చంద్రబింబము పెంపు సవతుగా దనిసొంపు మొలకనవ్వుల ముద్దుమోముఁ జూచి

తే. రసనులొప్పెడు బింబాధరంబుఁ జూచి, పసిఁడిపొడిరాలు కుచ వైభవముఁ జూచి
కమలములనేలు పాదపద్మములఁ జూచి, మునికిఁ జక్కిలిగిలిగింతఁ గొనె మనంబు. 140

శా. ఆతన్వంగిపయిం బ్రియంబొదవ విశ్వామిత్రుఁ డీక్షించు మం
జేతఃపద్మమునందునున్న శివునిం జేమోడ్చి ప్రార్థించి తా
పాతాళాద్రికిఁ బంపి యచ్చట లతాంతావాస సీమస్థలో
జాతుం బ్రీతుని జేసి దేవగణికాసంభోగసౌఖ్యంబులన్. 141

క. మేనకయుఁ దాను హిమగిరి, తానకముగ జపముఁ దపముఁ దవమదిలోనం
బూనక యొకనాఁడైనను, మానక సుఖియించుచుండె మన్మథకేళిన్. 142

సీ. ప్రసవకార్ముకుఁడను పాపకర్మునిచేత నూనాస్త్రుఁడనెడు దుర్మానిచేత
పంచబాణుండను కిరాతునిచేత మన్మథుండను పసవాత్మగుచేత
శంబరాంతకుఁడను జాల్మచిత్తునిచేతఁ గందర్పుఁడను పలుగాకిచేత
నంగసంభవుఁడను నతినిర్దయునిచేత దర్పకుఁడను పాతకాయిచేతఁ

తే. జెడ్డవారలఁ గథలుగాఁ జెప్పనేల, వేల్పు లోఁడంప నొక దేవవేశ్యఁ జూచి
తోడరి యజునైన నోసరివ్రాల్చుకొనఁపు, కౌశికునియంతివాఁ డూడ్చెఁ గచ్చడంబు.

క. ఈగతి వేలుపువెలయల, నాఁగను దగులుకొని నాఁడు నాఁటికిఁ గోర్కుల్
దీఁగలు సాగఁగ మన్మథభోగంబుల మనసు తృప్తిఁ బొందిన పిదపన్. 144

క. అలిమిళితచతురిగత, కేళీవన పవనచలిత కేసరధూళీ
పాళీ ముహుర్వసుగత భృం, గాళీ గణ్యంబు హిమనగారణ్యంబున్. 145

వ. ప్రవేశించి యచ్చటఁ దపంబునకు నిలిచె. మేనకయు గర్భమునిసంగంబున నొక్క
కూఁతురుఁ గని యప్పుడటు పుట్టిన యప్పురుటిపట్టిఁ గల్లవల్లనట్టుకొనిపోయి మాలినీ
నదీసైకతంబున నేకతంబున బద్మపత్రంబులు పొత్తులుగా నమర్చి మెత్తమెత్తన
యునిచి దివంబునకరిగె నిచ్చట. 146

క. అత్తఱిని శకుంతంబులు, తత్తఱపున నెండ గాలి దాఁకక యుండన్
మెత్తనయీకలఁ బొదువుచు, నెత్తురుఁగందుపయినిల్చె నెయ్యముఁ గృపయున్. 147

ఉ. ఆనది నొక్కనాఁడు ముదమారఁగ శిష్యులుఁ దానుఁగూడి వి
జ్ఞానధనుండు పుణ్యనిధి సాధువరేణ్యుఁడు కాశ్యపుం డను
స్థానము సేయ నేగి యచటం బొడఁగాంచె శకుంతపక్షర
క్షానిరుపద్రవస్థితిఁ జొసంగిన కౌశికవీర్యసంభవన్. 148

వ. కాంచి యది విశ్వామిత్రువీర్యంబగుట నార్యజనసేవితుండగు కణ్వమునీంద్రుండు
గాధిపుత్రునిమీఁది మైత్రియుఁ దల్లిలోఁ బాగు నిసుంగుమీఁది కారుణ్యంబును
బెనఁగొన నాపేర్వం బూఁప నొక్క శిష్యునిచేతికిచ్చి యాశ్రమంబునకుం దెచ్చి
శకుంతరక్షితయగుటయు శకుంతలయను నామంబు వెట్టి ప్రేమంబునం బెనుపుచున్న వా
డన్నప్రదాతయు నభయప్రదాతయు నీ యిద్దఱుం గన్యలకు గురువులై రీ రెండు
తెఱంగులు నమ్మునిపుంగవుని యందఁ గలిగెఁ గావున నతండు తండ్రియు నయ్యెం తి
కూఁతురయ్యె నిది శకుంతలావృత్తాంతంబని యాద్యంతంబును తెలిఁగించిన మహీ
కాంతుండు నితాంతసంతోషంబునొందె నంత నుష్ణకాంతుండును జరమ
గిరి శిఖరంబునకు బంధూకపుష్పమంజరియుంబోలెఁ గెంజాయ నలంకరించె. 149

గీ. అపుడు భూపతి విప్రుని నాదరించి, చరమసంధ్యావసరమయ్యె సంయమీంద్ర
కన్యకలు చెప్పి పుత్తేరఁ గాదనంగ, రాదు నడువుము వేగమ పోదమనుచు. 150

శా. శంకాతంకువుఁ ద్రుంచె నీవడుగు దాజత్తుఃప్రియం బొప్పఁగాఁ
గొంకొక్కింతయులేక నిర్భయుండవై కొక్కెల్ కొనల్ సాఁగఁగా
నింక న్నాకొకమాటు చూడఁగలిగెన్ హేలాశరత్పూర్ణిమా
పంకేజాహితబింబ చారుముఖబింబ శ్రీకబింబాధరా. 151

మ. అనిచింతించుచు సంతసించుచు రయంబారంగ సారంగ లాం
ఛనవంశాగ్రణి యేఁగుచోఁ జటుల వర్షాకాల కాలాంబుద
స్తనితధ్వానపథాధ్వనీనగళ గర్జత్క్రోధ నిష్ఠ్యూత ని
స్వన నిర్భగ్న నితాంత కాంత బహుసత్వస్వాంత కాంతారమై. 152

క. శైలద్రుమచరదేణీ, జాలోదరదళనకేళి సమయాతిగళ
త్కీలాలలిప్తదంష్ట్రా, భీలనఖంబగుచు నొక్క బెబ్బులివచ్చెన్. 153

శా. ఆ శార్దూలముఁ జూచి భీతహృదయుండై మేను కంపింపఁగా
నాశల్ జూచుచు బ్రాహ్మణుండపుడు ప్రాయఃప్రాణ రక్షార్థమై
యోశార్దూలమృగేంద్రచర్మధర యోయుగ్రాక్ష యో యద్రిజా
ధీశా యోయపమృత్యువుం గడపరావే యంచుఁ గీర్తింపఁగన్. 154

వ. ఆ విప్రవరుని యార్తియు నిర్దయశార్దూల విస్ఫూర్తియుం గనుంగొని కారుణ్య
మూర్తియగు నా రాజు భీతచేతస్కుండైనవాని నుపచరించుచు శీఘ్రగమనంబున
వచ్చు వ్యాఘ్రంబు నడ్డగించునప్పుడది నగరి వేఁటపులి యగుటం జెలిమి మృగయు
లెట్టు దీని నేమఁతిరి దీనివలన నీయాశ్రమవాసులకు నెవ్వరికిఁ బాధయు నట్టిదె

మహాపరాధంబు వచ్చుననుచు నమ్మృగరాజుం బట్టుకొని బంధురగమనంబున నిజ
స్కంధావారంబునకుం జనుచుం దన మనంబున. 155

క. తాపసశిష్యుని లలితా, లాపంబుల నా శకుంతలావృత్తాంతం
బేపారఁగ వినియును నా, క్ష్మాపాలుఁడు సంతసిలక సంశయచింతన్. 156

గీ. కన్య క్షత్రియవీర్యజఁ గాక యేమి, కణ్వుఁ డొకనికి నీఁగడ కట్టెనని
చెలువ నామీఁదఁ గూరిమి సేయదేని, కెంట మద్వ్యంతుకోర్కి పూరించు టెట్లు.

చ. కొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి యొయ్యెడ వజ్రసూచి డా
యని రతనంబు జిహ్వ చవియానని తేఁ యం గోరుమోపి గి
ల్లని చిగురాకు లాలితవిలాస నికేతన మాలతాంగి దా
ననుభవకర్త యేఘనుఁడో యావిధి యెన్న మెఱుంగనయ్యెడున్. 158

ఉ. ఆడదుగాని మాట లొకయంచుల నించుక వీనులొగ్గి నా
యాడినమాటలెల్ల వినునర్మిలితోఁ దను నేను జూచినం
జూడదుగాని యొండుదెసఁజూచినఁ దానను జూచుచుండు నీ
జాడలు నాపయిం దగులు చందము డెందముఁ జేర్చ నేర్పఁగన్. 159

ఉ. అచ్చపలాక్షి కన్య విమలాశ్రమవాసిని ప్రేమచిహ్నము
ల్మచ్చికలేక చేయ దనుమానము గల్గగు సత్యసంతతు
ల్వెచ్చపుఁగూరిమి ల్పరిభవింపగ నేరదు నేర దబ్జసం
పచ్చటులంబులై మెఱయు పచ్చనిచూపుల క్రేళ్ళుచూడఁగన్. 160

మ. చికురంబు ల్సొగసలంటు సున్న చెమటల్ జెక్కుల్దలిర్పన్ ఘటో
దకభారమ్మునఁ గెంపుహస్తయుగ ముద్ఘాటింప నంసంబు లిం
చుకజాఱం జనుదోయి యూర్పువడి సంక్షోభించి కంపింపఁ దా
నొకకేలం దుఱుమావటించు చెలువం బుల్లంబుఁ గొల్లాడదే. 161

వ. అనుచు నచ్చెలువ చెలువంబు దనమనంబున ననుచుకొని యచ్చోటువాసి మగిడి
చూచుచు నిలుచుచు నివ్వెఱపడుచుఁ బ్రొద్దువంకఁ గనుంగొనుచుఁ బెద్దసడిం గొం
కొకదవ్వుఁగమనించుచు నిట్టూర్పునిగిడించుచు నెట్టకేలకు వేలంబున్న కోటికిఁదపసి
బోటికి బసంబిచ్చి యేటికెదురంటినకరణి ధరణీనాయకుండు ప్రవేశించి. 162

చ. తపసి శకుంతలావదన దర్శనయాత్రకు విఘ్నమాచరిం
చిన పులిఁ జంపఁజాలదయొకు పెంపుకు గావ్యు వేటకాండ్ర మాఁ

దనెపము వెట్టి యేమఱుట తప్పుగఁ గట్టి యథాపరాధ దం
డన మొనరించె సత్తమజనంబులు చూపరసహ్యకోపముల్. 164

గీ. అవనిపతి యువ్విధంబున నరుగుదెంచి, యపరసంధ్యాభివందనం బాచరించి
యుష్ణమును దీక్షమును గాఁగ నుస్సురనుచు, సంయమీంద్రకుమారకసంస్మరించి.

సీ. పిలువవచ్చినఁ బోక నిలిచి యేటికి యింతిప్రట్టువుఁ దెలియ దుర్బుద్ధివైతి
బుట్టినీ యతఁడేల పూర్వాపరంబులు సూచించి విడువక జోలివైతి
బట్టినీగమన సంభ్రమవేళ కార్తాల వదరిపాటున నేల యడవిసొచ్చెఁ
జొచ్చిరానీ మాఱుసుద్ది వంపక యుండఁ బనుపెంచె నేటికిఁ జరమసంధ్య

తే. విఘ్నములు పెక్కులిట్లు సంభవింపఁజేసి, తెలియఁగని కన్నులాఁకలిఁ దీగ్ర నుండ
నదయుఁడై విధి కంచము మొదలివాని, తేకమఁతయుఁ గృపలేక తేవసేత్తె 165

క. అని దైవముదూఱుచుఁ దన, మనమెల్లను గొల్లగొనిన మానిని తరు సే
చన చర్యలు నలస విలో, చన ముఖభావములు మానసము నలరింపన్. 166

ఉ. మజ్జనభోజనక్రియలు మానివలాని యరోచికంబునన్
ఖజ్జము గొంతగొంత కసిగాటులుగా భుజియించి యొవ్వతిం
బజ్జను జేరనీక తన భావములోపల దాఁపురంబుగా
సజ్జకుఁ జేరియుండె నృపచంద్రుఁడు సాంద్రవియోగవేదనన్. 167

క. ఆవేళ హాస్తినగర క్ష్మావల్లభుఁ డున్నయెడకుఁ జనవుసఁ జేవం
గా వచ్చిన మాండవ్యుఁడు భావము దెలియంగ వలసి బలిహాసోక్తిన్. 168

క. వనమునకు నొంటి యరిగితి, జననాయక యచట మనను కంకించెనొ యు
మ్మునివరు లేమిపరాభవ, మొనరించెనొ నాకుఁ జెప్పు మున్నవిధంబున్. 169

చ. మనమున జంకుఁగల్గినను మాన్పెద నేనది మంత్రశక్తిచే
మునుల యవజ్ఞఁగల్గినను ముందటికి న్మనసీమలోని కా
ననములు గుత్తయిచ్చి జలవంబుగఁ జేసిరి కందమూలముల్
ద్దినియెడువారు గాఁగ నరుదెంచి వళంవదులౌదు లందఱున్. 170

వ. దీని కింత చింతయేల జగతి యేలంగలిగిన నావంటిసేవకుండు సిద్ధించియుండ నశ
క్తుండునుంబోలె నుండుటేటి ప్రాభవం బనిన సాధుజనపోషకుండు విదూషకున
కిట్లనె. 171

గీ. ప్రాణసఖుఁడవు నీకుఁ జెప్పక మదీయ, వృత్తగోపన మెట్లు గావింపనేర్తు
మచ్చవాలునవాఁడవు మంతనంబుఁ, బోదమ నీక నీరసునకు బుద్ధిచెప్ప. 172

మ. మదనారాతిసమాను గాత్ర్యపము హేమాసీంద్రు సేవింప స
మ్మదమూనం జని యాశ్రమంబు వనసీమం గంటి వాల్గంటిఁ దో
యదనీలాలకఁ గంబుకంఠిఁ గరిణీయానం బయోజానన
న్మదసల్లాపశుకోఁచరోదరి సుధాసంబాధబింబాధరిన్. 173

సీ. నిండుజంఘలకును నెత్తమ్మివలపుల నొద్దంపుఁ బోలుపును నబ్బెనేని
కరికుంభములకును బంగారుకొప్పెల యొప్పు శకటాంగముల విప్పు జరగెనేని
యరఁటి కంబములకు నరభంబు ననుడాలుఁ దూణీరముల మేలు దొరకెనేని
సరసిజాళములకు జంత్రంబుఁ జెంపును జిగురాకుసొంపును జేరెనేని

తే. చపలలోచన మొగముతో సరియవచ్చు, నింతి పాలిండ్లసోయగతో నీడువచ్చు
వనితయూరుద్వయంబుతో నెనయవచ్చుఁ, జంద్రముఖిపాదయుగముతో సవటువచ్చు.

వ. అని యతియు నాపాదశిరోరుహాంతంబు వర్ణించు నుత్కంఠ నా రాజ కంఠీరవుండు
మాండవ్య కొండు తలంపులేక వినుమని యిట్లనియె. 175

సీ. వెడవిల్తు చిగురాకు గొడుగులు గొనివచ్చి చరణద్వయంబుగా సవదరించి
సంకల్పసంభవు జయకాహళుల దెచ్చి జంఘాయుగంబుగా సంఘటించి
దుగ్ధాబ్ధి మనుమని తూణీరములు దెచ్చి యూరుకాండంబుగా నుపచరించి
శ్రీదేవి సుతు హేమసింహాసనము దెచ్చి జఘనచక్రంబుగా సంతరించి

తే. నీరరుహసూతి శోభాంగ నిర్మితికిని, దగినయావి లేక కనకపత్రమున నిచటఁ
గడచు కలదని వ్రాయు రేఖయును త్రివళియు, మధ్యమును నాభియునయ్యె సన్మానవతికి.

సీ. ప్రసవాస్త్రుచాయాని ప్రైలవ్రాసిన సుడి బిసరుహాననకు గంభీరనాభి
మోహవార్ణము వోసి మూసిన బంగారుబరిణె లుత్పలగంధి గురుకుచములు
యౌవనామరభూరుహమున డిగ్గినయూడ లరవిందవదనకుఁ గరయుగంబు
సౌందర్యజలధిలో సంభవించిన పాంచజన్యంబు మీనలోచనగళంబు

తే. వదనమును తామ్రపర్ణి జెల్వంబు లైన, విశదమౌక్తికములు లేమ దశనపఙ్క్తి
శంబరారాతి సామ్రాజ్యసౌఖ్యపదవి, యలికులాలక కెంజిగురాకుఁ బెదవి. 177

గీ. జవ్వనంబను తొలుకారు నివ్వటిల్ల, సాటిలేదను మోహబీజంబు లలుక
మానసక్షేత్రములు దున్ను మదనుఁడనెడు, కర్షకునకింతి నాసిక కనకహలము. 178

క. శ్రీకమలగృహము మోము వి, లోకింపఁగ దీపకళికలు కనుంగవ యా
హైకొనిన సన్నపు, రేకలు నా బొమలు సుందరికిఁ జెలువొందున్. 179

గీ. మహితకీర్తి శకుంతలా మంజువాణిఁ, బోలె సప్తాదశద్వీపములను గలుగ
రమణశుకములను సంజ్ఞలనతివయందుఁ, గొమ్మనుం జెరంపు లిఖియించెఁ దమ్మిచూలి.

క. బాలేందునిభాఁ దిమిరము, పాశము పట్టుకొని వేళఁ బరికించుచుఁ దా
వేలము చేసినపోలిక, బాలిక వాలిసీల కేశపాశం బమరున్. 181

గీ. చదువు రాజశుక బ్రహ్మచారులకును, దామరసనేత్ర వదన మధ్యయనగృహము
గానయై వచ్చు కోకిలగాయకులకు, నాతి కంఠంబు దలఁప సంగీతశాల. 182

ఉ. కన్నులతీరుఁ జక్కని విహంగంబు మెఱుంగును శోకిలించు లేఁ
జన్నులమించు నెన్నడుము సంకటశాలేఖయు మేనియందమున్
జెన్నెసిఁజేని సొంపు మురిపెంపును దన్నని మొలకింపులున్
వన్నెలుఁగాని కావు రవణంబులు వన్నియలాలతాంగికిన్. 183

మ. నవలావణ్యపయోధిఁ జిత్తమను మంథానాద్రికిం జంద్రికా
పవనాళం దరిత్రాడుగాఁ జేఁచి యజ్ఞాతాళుగుం దచ్చినన్
రవలిం గోకిలకీరముల్దరువ నా రత్నాకరంబందు ను
ద్భవముం బొందిన లక్ష్మికావలయు నా పద్మాక్షి భావింపఁగన్. 184

ఉ. చిత్తరువు న్లిఖించి మతి జీవము వోసెనొ రూపసంపదం
జిత్తజునిం దలంచియు సృజించెనొ కొడుకు జగ్గుసేయఁగాఁ
జిత్తరువందు నాకరణి చెల్వముగల్గ దనన్యచిత్తుఁడై
చిత్తమునం దలంచియ సృజించెఁ బితామహుఁ డా తలోదరిన్. 185

శా. ఆదిం జంద్రుఁడు చంద్రికారుచుల నయ్యబ్జాస్యఁ గల్పించెనో
లేదేఁ గంతుఁడు చెల్వము ల్వెనఁగి యాలీలావతిం జేసెనో
కాదేఁ జైత్రుఁడు తావులెల్లఁ గొని యాకాంత న్నిర్మించెనో
వేదాభ్యాసజడుం డజుం డెటులఁ గావించుం దదీయాకృతిన్. 186

సీ. పాలమున్నీటిలోపల సంభవించిన జలజాతనయనల దక్కుఁడదనముఁ
జంచలాలతికల జననంబు గాంచిన ధవళలోచనల సౌందర్యలక్ష్మి
వసుధాంశుశైలయం దావిర్భవించిన నీలవేణుల రామణీయకంబుఁ
బుండ్రేక్షు కోదండమునఁ బుట్టువొదవిన లావణ్యవతుల విలాసరేఖ

తే. నరసభుగియూరు కాండంబువను సముద్భ, వంబునొందిన యుదు రాజవదనచెలువుఁ
గుప్పగాఁజేసి మునికన్య యొప్పులొడ, వానిఁ దలపోయ వారాశి కిసవలెం. 187

శా. ఆవాలుంగనుదోయి యానగుమొగం బాగుబ్బపాలిండ్లపెం
పావేణీరుచి యాతనూవిలసనం బాయొప్పు నేఁ జెప్పినం
గైవారంబగుఁగాని యయ్యెడ శిరఃకంపంబుతోఁ గూడ నా
హావృట్టింపదె యిట్టిధన్యునకు నయ్యబ్జాక్షి నీక్షించినన్. 188

వ. అని తదీయరేఖావిలాస విభ్రమంబులుఁ బ్రసంగించుకొనుచు నొండెఱుఁగక మహీ
విభుండుండె నంతనిక్కడ నాశ్రమపదంబున శకుంతలయుం దాఁజనవచ్చినవిప్రుని
వలన రాజు తన జన్మప్రకారం బడిగిన విధంబును దదాకర్ణనంబునం నిరస్త సంశ
యుండై పర్ణశాలాభిముఖుండై గమనించుటయు దదవసరంబున నకాండంబుగఁ
బ్రస్ఫుటపుండరీకంబు వచ్చుటయు నాశార్దూలంబు గోవత్సంబునుం బోలె గొనివచ్చు
టయు నాలోనన యపరసంధ్యాసమయంబు రాజశార్దూలంబు సంప్రాప్తం బగు
టయుఁ బ్రతివచనంబులకు నెడలేకుండుటయుం జెప్పెఁ దన మనంబున. 189

గీ. నరవరుం డస్మదీయజన్మక్రమంబు, వినుట నాపుణ్యమయ్యె నివ్వనములోని
కెన్నడునులేని శార్దూల మెట్లువచ్చె, నరయరాకుండ నరికట్టె నామృగంబు. 190

క. ఎప్పుడకో యీనిశి చను, నెప్పుడకో తెల్లవాఱు హృదయేశు మొగం
బెప్పుడకో చూచుట నా, కెప్పుడకో భాగ్యలక్ష్మి యెదురఁగుటనుచున్. 191

మ. చెమటం జెక్కులు తోంగలింప ముఖరాజీవంబు వాడంగ సో
లమునఁ గ్రొన్నెప్పలు వ్రాలఁ గన్నుఁగవ జేనొల్కవి నిట్టూర్పులం
గమలం దల్పముఁ జేరుచు న్విభునిరాకల్గోరుచుం బ్రొద్దు భా
రమునం బుచ్చుచు వర్షమానవిరహగ్లాని న్మతిం గందుచున్. 192

మ. మలయక్ష్మాధర నిర్గళత్పవనము ల్మండింపఁ గామాగ్ని యం
గలతం గాల్పకయుండఁ గంతుసుమనఃకాండ ప్రకాండాహతిం
జెలువెల్లం జెడకుండ నవ్విభు నురస్సీమంబుతోఁ దార్కొనం
గలలోనైనను గల్గునో కొక్కొ యని యక్కంజాస్య దీనాస్యయై. 193

శా. ఆచంద్రాన్వయ రాజచంద్రముని పొందాపించి చన్నుంగవం
జూచుం గన్నులనీరునించుఁ దలయూఁచు న్మేను శయ్యాస్థలిన్
వైచు న్లోచను నవ్వు నుస్సురను బోవం గంటగించున్ ధృతిం
గాచున్ బ్రొద్దుఁ గనుంగొను న్వెతఁబడుం గామాంధకారార్తయై. 194

వ. ఇవ్విధంబున. 195

గీ. అచట విరహాగ్ని రాజును నిచట చుడఁగ, బాణవేదన నింతియుఁ బరితపింప
బ్రహ్మకల్పంబుపోలె నా రాత్రి వేఁగ, నెట్టకేలకు నంతట నినుఁడు పొడిచె. 196

శా. నానామాత్యకుమార భూరమణమాన్యశ్రీక శ్రీకంఠచూ
డాగంగాసఖకీర్తి కీర్తితనిరూఢ ప్రౌఢనిర్నిద్రవా
చాగుంభాంబుజగర్భ గర్భసుఖితా సౌభాగ్య భాగ్యస్ఫుర
త్త్యాగోద్యత్సురభూజ భూజనహిత వ్యాపారపారంగతా. 197

క. కవిలోకకల్పకలతికా, నవపుష్పమరందపానకామధుపనిజ
శ్రవణేంద్రియ సకలజగ, ద్భవనతిమోదీపకీర్తి భాసురమూర్తీ! 198

పృథ్వి. అమాత్యగుణబంధురా యఖిలబంధుకల్పద్రుమా
సమస్తజనసన్నుతా సమధిక ప్రభావోన్నతా
అమర్త్యతటినీ ధరాయతపదారవిందద్వయీ
సమంచిత మధువ్రతా సతతపూత సత్యవ్రతా! 199

గద్య. ఇది శ్రీ భారతతీర్థ గురుచరణ కరుణాలబ్ధసిద్ధసారస్వత
పవిత్రిగాదయామాత్య పుత్ర ఆరాధితామరవీరభద్ర
పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతం బైన శృంగార
శాకుంతల కావ్యమునందు ద్వితీయాశ్వాసము.



శ్రీ ర స్తు

# శృంగారశాకుంతలము

## తృతీయాశ్వాసము



కర పతిహితకార్య ని
శాకర సౌందర్య బంధుసత్కవిజన ప
ద్మాకర సూర్యసమో ర
త్నాకర గాంభీర్య వెన్నయప్రభువర్యా! 1

క. దినవాథుం డుదయించిన, జనవాథుండుచితభంగి సంధ్యావిధు లె
ల్లను దీర్చియున్న సమయం, బున సేనావిభుఁడు వచ్చి మునుకొని కసుఁడై. 2

గీ. తోఁటకల్లాడఁబోయిన తోఁడిసచుము, నేఁటి వేఁటకు మృగములు గాటసునచు
వేడ్కతో వచ్చియున్నారు వేఁటకాండ్రు, వేగ విచ్చేయుఁడనినఁ బృథ్వీవిభుండు

సీ. కొమ్ముల సుదకంబు గోరాడి వేఁచల్లు కఁచి క్రీడింపనీ కాసరములు
దంష్ట్రాంకురముల ముస్తలు త్రవ్వి భుజియించి సుఖవృత్తినుండనీ సూకరములు
గడుపార మేసి క్రమ్మాన్గను వేసి నీడల నెమరు వెట్టుచు నుండనీ మృగములు
నిష్ఠుర జ్యాబంధనిర్బంధమునఁ బాసి గవిసెన నుండనీ కార్ముకంబు

తే. వలలుబోనులుఁ గౌలేయకులము మగుడఁ, బట్టణమునకు సకలంబు వెట్టియనుపు
పనుపు మృగయులఁ దమతమపల్లెమూలకుఁ, జాలు మృగయావిహార విశ్రాంతసుఖము.

గీ. ఆశ్రమాంతికమున వేఁట యనుచితంబు, నేము నేఁడును నేపును నిచట నిలిచి
మునుల బొడఁగని వారల ననునయించి, పిదపఁ బురికేగుదెంచు టభ్యుదయకరము

వ. ఏమిక్కడనుండు దివసంబుల నాశ్రమంబులకు రాయిడి గాకుండ మదీయస్యంద
నంబును సారథియును నీవు మాండవ్యుఁడును గతిపయాప్తపరిజనంబునుం దక్కఁ
దక్కిన శతాంగమాతంగతురంగ పదాతివర్గంబు దుర్గంబున కనుపుమనిన నతండును
నట్లు గావించె నిట్లు సకలసైన్యంబునుం గరిపురి కనిచిన నా రాజోత్తముండు
చిత్తంబు శకుంతలాయత్తంబు చేసి చిత్తమాటల మాండవ్యసేనాపతులతోడ
నేమేనిఁ బ్రసంగంబు జరపుచునుండె నయ్యవసరంబున. 6

గీ. వరతపోధను లిద్దఱం దరుగుదెంచి, సవినయంబుగఁ గృతనమస్కారుఁడైన
ధరణిపతిమౌళి మంత్రాక్షతములు నెట్టి, వరుస నాసీనులై మృదువాక్యములను. 7

మ. అతిరాత్రం బను పేరిటి మ్మఖము సేయంబూని కణ్వాశ్రమం
బు తపస్వి ల్చవదంతికంబునకు మమ్ముంబెట్టి పుత్రేరక
చ్చితి మిచ్చోటికి నుల్లసద్విజయలక్ష్మీశాలి వచ్చోటికిం
గ్రహసంగతు రయొనర్ప రావలయు నక్షత్రేశ వంశాగ్రణీ. 8

మత్తకోకిల. జంభశాత్రవతుల్య వైభవ చక్రవాళ బహిస్తమ
స్తంభనక్షమ కీర్తివల్లభ దానవాహిత ఘోణిరా
ట్కుంభికుండలిరాజ కచ్ఛపకుంభినీధరబంధురో
స్తంభ సంభృత భూమిమండల సంగరోరగకుండలా. 9

క. బాణాసనబాణతను, త్రాణకృపాణములతో రథస్థుండవై నీ
వేణాంకకులజ రాదగుఁ, గౌణపదుర్జనులు గలరు క్రతువిఘ్నకరుల్. 10

క. అనవుడు నట్టేకాకని, జనపతి యమహాత్మునివరుల సన్మానముతో
ననిచి రణోచితపటు సా, ధనసంపద సొంపుగా రథస్థుండగుచున్. 11

వ. పచేళిమంబు లగు పనసనహకార నారికేళ ఖర్జూర జంబూజంబీర రంభాకపిత్థక
ర్కంధూతిందుక సౌగంధికారి సుగంధ బంధురఫలంబులును నొడిపి ప్రాలు దూసరి
బియ్యంబు నివ్వరివడ్లు గుమకులూదలాదిగాఁగలుగు వన్యధాన్యంబులునుడియలంగా
వళ్ళం బెట్టించుకొని కదలి కదలికా చందనస్యందన మరువకాగరు కురవకాశోక
పూగపున్నాగభూర్జ ఖర్జూరసర్జ కార్జున శిగ్రున్యగ్రోధగుగ్గులు మధూక వాశ్వత్థ
కింశుక శింశుపచూత జంబీరోదుంబర కదంబవంజులకుం జరాశన కరంజభల్లాతకీ
సల్లకీ చిరిబిల్వ బిల్వప్రముఖ వివిధ విటపికోటర క్రోడక్రీడాచిక్రోడ కంకకలవింక
కపింజలఖంజరీటకపోత పారావతశారకాశుకపిక శిఖాతతావళి ముఖరితంబగు వనం
బుం బ్రవేశించి యతి చపలవిపుల కపిలంఘనంబులం గరువలితాఁకులం బాయక
రాలుపండ్ల నవిసి తొలఁగు ననేకవిధ స్వాదురసంబులు పెనువఱద్దలై పండిపగిలిన
కానవేక్షుదండ ప్రకాండంబులం బర్వ నిర్ముక్తంబు లగు ముక్తాఫలరాసులపైఁ
బొరలిచి పరవందాశ్రుపర్ణిస్థలవిశేషంబునభినయించు నభిరామప్రదేశంబులంగనుం
గొనుచుం జనిచని తాపసపరిషదుపనిషదుపబృంహిత బ్రహ్మవిద్యాతర్కఫక్కికా
చర్కరితనూతన శ్రుతిశుభగారవంబులను నిస్త్రానబద్ధవృద్ధమునిపద్యానుసారిణిద్యార్థి
వటుకపటుముఖోచ్చరిత వేదనాదంబులుం గర్ణగోచరంబులైన నాకర్ణాంతవిశ్రాంత
లోచనుం డచ్చటు నరదంబు డిగ్గి యరిగి. 12

మ. హరిదశ్వాధిక తేజుల న్విమల భస్మాపాండు సర్వాంగుల
న్వరరుద్రాక్ష విభూషితావయవుల న్వ్యాఘ్రాజినాసీనులం

గరుణామూర్తులఁ బుణ్యవంతుల బహుశ్రుతదర్శుల శాంతులం
బ్రాసుబ్రహ్మ శిఖాముఖోపవిమదభ్యాసస్థితస్వాంతులన్. 13

సీ. ఫలభోజనులఁ బర్ణభక్షులఁ బంచగవ్యప్రాశనులను జలాశనులను
నీహారభుజులఁ గాకాహారుల సమీరవాసులఁ ద్రసరేణు పారణులను
మాధ్యావలోకనస్తోకులఁ బంచాగ్ని మధ్యవర్తుల సదామౌనపరుల
బంచాక్షరీమంత్ర పారాయణులను నిష్కలశివనిర్మల ధ్యానరతుల
తే. సంతతబ్రహ్మచర్యుల సంగవర్జితుల నకాముల నూర్ధ్వరేతుల విజి
తేంద్రియుల నిర్మమత్వ నిరీహులను ని, రాకులుల నిత్యముక్తుల నేకమతులు.

సీ. అంధకాసురవైరి యాపాదశాఖుల యక్షేశసఖుని పర్యాయపదుల
సాక్షాత్కరించిన శశిమౌళిమూర్తుల నంబికేశ ప్రతిబింబములను
భావజారాతిలీలావిగ్రహంబుల నిటలలోచనుని మూఁటి మొదళ్ళ
నగరాజకోదండు నామాంతరంబులఁ బ్రమథాధిపతి బహిఃప్రాణములను
తే. ఫణికులాధిపధరు నవీన ప్రాసములను, దనుజపట్టణభేదను విగ్రహములఁ
బంచబాణారిపట్టము భద్రకరులఁ, గాశ్యపునియాశ్రమస్థానకము మునులను. 15

వ. కాంచి రోమాంచకంచుకితగాత్రుండును సమంచానందనిష్యందసలిలనేత్రుండును
నై యాధాత్రీకళత్రుండు దండకాకు వందనం బొనర్చి తాఁ దెచ్చిన వన్యఫలధాన్యం
బులు ముందటం బెట్టి వినయవినమితస్కంధుండై నిలిచిన నా మహాత్ములు ప్రహృ
ష్టులై యారాజర్షి భూరియైన నెనరులుంగులైన మైత్రియుం గరుణయుం జేసి యుచి
తాసనంబున నాసీనుం గావించి హస్తపద్మంబులెత్తి యాతని వదనపద్మం బవలో
కించుచు నచ్ఛపద్మంబులకు సుధామధుర వాక్యంబులం బ్రస్తుతించిరి. 16

సీ. స్వస్త్యస్తు శశివంశజలధికౌస్తుభరత్న శ్రీరస్తు సమరసర్జితసపత్న
దీర్ఘాయురస్తు పృథ్వీజనస్తుతశీల కల్యాణమస్తు విక్రమవిశాల
ఐశ్వర్యమస్తు ధర్మానోకహస్కంధ సమధికోన్నతిరస్తు సత్యసంధ
సౌభాగ్యమస్తు సజ్జన చూతవనచైత్ర విశ్వలోకవిజయోస్తు విమతజైత్ర
తే. భూవినుతకీర్తిరస్తు సత్పుణ్యగాత్ర, సంపదభివృద్ధిరస్తు విశ్వప్రశస్త
శక్రవిభవోస్తు పూరువంశప్రదీప, జగతి భవతశ్చిరాయు దుష్యంతభూప. 17

క. అని మతియుఁ బెక్కుఁ దెఱఁగుల, మును లభినవ వేదమంత్రముల దీవనల
న్మనుమని యాదృశభూపతి, మనుమని దీవించి సంప్రమదమానసులై. 18

మ. కొనిరని రాన్పొలకులకుంజరు నాశ్రితవజ్రపంజరున్
ఘనకులశ దర్భకంతు పరికల్పిత పంపరపల్లవావళి

చిత్తవైకల్యంబు చెఱచుఁ బ్రజ్ఞాప్రౌఢి పరవధూసంసర్గశైలిఁ జెఱచుఁ
జెఱచుఁ గ్రోధము తపస్థిసమాధిస్థితిఁ గాముకత్వము వివేకంబుఁ జెఱచుఁ

తే. కుటిలమానవుమైత్రి సద్గుణముఁ జెఱచు, వసచువిద్యావివాదంబు యశముఁ జెఱచు
ఫలితకార్యంబు నేగిరపాటు చెఱచుఁ, దనక మెప్పగు పనికి నెంతటి ఘనునకు. 30

వ. దుష్యంతుం డలంతులం బోవువాఁడు కాఁడు, వాఁడిగూపుల వేఁడి చూపక మూఁడుకన్నులవాఁడు వచ్చిన వెచ్చపడండు, వియచ్చరులకుం దోడువచ్చిన వేళ నాహవక్రీడ నతని బాహుబలంబును జలంబును శౌర్యంబును జేవయుం జేవయుఁ దేఁపును బెంపును నెఱపును నొఱపును గబ్బును నుబ్బును నెఱుంగుదు, జన్నం బేనుదినంబు లున్నయది యదియునుంగాదు నక్తంచరులమైన మనకు శక్తి యగ్గలంబు దివసంబున జవంబు నష్టంబైయుండు మాపు రతీయవైభవంబుఁ జూపుదమనిన నట్లు కాక యని యెట్టకేలకుఁ గార్యంబు నూఁది కాఁక యుడిగి యాఁకటం బెట్టిన యహీయుంబోలె నిశ్వాసంబులు నిగిడించుచు వాసవారాతి నిలువలేక యుద్ధసన్నద్ధుండగుచు నుండె నంత నిక్కడ నాశ్రమంబున 31

గీ. ప్రథమసవనక్రియలు సుసంపన్నమైన, మునులు భూపాలుఁ బిలిపించి జనవరేణ్య
యతులితంబైన భవదీయరక్షణమున, నధ్వరము చాఁగె నంతరాయంబు లేక. 32

చ. అలసితి వెంతరేనియును నాఁకలిగొంటివటంచు దేనెలు
స్ఫలములుఁ దెచ్చియిచ్చి సవనక్రియ మాపటిదాఁకఁ గల్గ ది
చ్చలఁ జని విశ్రమింపు నృపచంద్ర యని పొమ్మని యంప నత్తప
స్వ్యులకు నమస్కరించి తనఁజూచి విచారముచేసె నాత్మలోఁజా. 33

ఉ. పోవ ననుజ్ఞ యిచ్చిరి తపోధను లింక శకుంతలా ముఖ
శ్రీవిభవంబు దర్శనము సేయఁ నేగినఁ గంతుఁడు గ్రుఁడై
త్రోవని యార్చి తేఁజిగురు కుంతముఁ గైకొని యడ్డగించునో
తావుల వింట నేయునొ లతాంతశరంబుల గుండెఁగాఁడఁగన్. 34

సీ. రవులుకొల్పుచు సన్నఁబావలతో దాఁకెను కామాగ్ని దక్షిణగంధవహుఁడు
పుపుళింజినాదంబు చెవిసూది వెఱపింపఁ జూచునో మరునింటి జోగి తేఁటి
పకులతోఁ డుత మాట పలు కాడకుండంగ వాకట్టునో మంత్రవాది చిలుక
తెరువడ్డ కట్టంగ మరుని కింకరులకుఁ గూకలు వేయునో కోకిలంబు

తే. భావజునిచేత నొవ్వక పవనుచేతఁ, దూలిపోవక యళిచేతఁ దొట్రువడక
చిలుకచేఁ దాల్మి చెడక కోకిలముచేత, గాసి గాక శకుంతలఁ గనుట మేలు. 35

వ. ఈవేళఁ బర్ణశాల నా విశాలలోచన నిలువక తరుసేచనంబు సేయంబోవు నేను
నచ్చోటికిం జని.

సీ. కుంతలమ్ముల పేరఁ గొదమతుమ్మెదలను గ్రాలు గన్నుల పేరఁ గండుమీలఁ
జన్నుఁగుబ్బల పేరఁ జక్రవాకంబుల హస్తద్వయము పేర నబ్జములను
త్రివళిరేఖల పేర నవవీచికములను నతనాభి పేర నెన్నడిమిసుడిని
గటిమండలము పేరఁ ఘనసైకతోన్నతిఁ గోమలాంఘ్రుల పేరఁ గూర్మములను

తే. రుచిరమైన శకుంతలా రూపసరసి, నీఁదులాడింపఁ బూనిన నెట్టులైన
దర్పకానంగశరజాలదావదహన- తప్తమన్మానసము నేళ తాపభరము. 37

ఉ. కూరిమి బోటికత్తియలఁ గూడి శకుంతల మేలమాడి సాం
పారెడు పల్కులందు దరహాసపు చంద్రిక లంకురింప న
య్యారిక లందచంద భుజియింపఁగఁ గల్గుటఁ జేసి యచ్చటం
గోరికలంద లోచనచకోరకలం దనుపారఁ జేసెదన్. 38

క. ఆరామ చెలులతోఁ దుల, నారామక్రీడ మాటలాడెకొన సుధా
సారపుఁబల్కులు మతి ఘన, సారపుఁ బల్కులయి చెవులు చల్లంజేయున్. 39

వ. ఆకర్ణించుకొనుచు నొక్కలతాకుంజకుటీరంబు మాటుగొని యనంగ వేదనాపనో
దంబుగావించుకొని యెదం గాక యని తొంటితోఁటకుంజని నిగూఢవృత్తి నీక్షించు
నప్పు డంతకమున్న హృజ్జాతభల్లభంజమానమానసయగు శకుంతల నచ్చటికిం గొని
వచ్చి కుముదకువలయసౌగంధికారవిందనిష్యందమకరంద బిందుసందోహశబళవం
బులగు నిగుడాయ నీకుదొలంకునఁగల కొలంకు కెలంకునఁ బల్లవసముల్లసితలబగు సహ
కారంబునీడ చవ్వంపుఁదిన్నె సోపరింబుఁ బువ్వుడి నొప్పెడి యరుఁగుమీఁదఁ గెం
పెసంగు కిసలయంబులఁ బఱపుగా నమర్చి యచ్చటికిం గొనివచ్చి. 40

సీ. కడలేకు లాలిచిన కల్హారదళములఁ దలగడబిళ్ల లందముగఁ జేర్చి
మీఁదిబప్పెడ గీసి మృదువుగాఁ జేసిన విపులమృణాలహారమును వైచి
పూదేనెఁ బదనిచ్చి పుప్పొడి మేదించి కలఁగొన మేన జొబ్బిలనలంది
చలువవెట్టిన క్రొత్తజలజపత్రములను దోరమ్ముగాఁ జనుదోయిఁ గట్టి

తే. చరణముల లేఁతచిగురు సోఁజాలు చొడిగి, కటిభరంబునఁ గురివెలకమరుఁ గట్టి
పొగడలను బొడ్డుమల్లెలఁ బొన్నవిరుల, బాలనాలుగుదిక్కుల బడిసి వైచి. 41

క. అననూయయును బ్రియంవద, యును గెందలిరాకుసురఁటి యొయ్యన వేళ్ళం
బెనచిన చామరములుగొని, యనువారఁగ విసరఁ దాపమగ్నలమైనన్. 42

క. అనవరాయ ప్రియంవదతో, మనమీచందమున నిన్ను మాపటఁ గొని తె
స్వవిలపు శీతలకృత్యము. లొనరించుచు నున్నవార ముడుగని పనిగాన్. 43

గీ. శయమొకించుకయైనఁ గానంగఁబడదు, చలువమందుల శైత్యంబు సంభవిలక
నినుఁడు గుడిచిన నీరయ్యె సంతిపేన, నంతకంతకు సంతాపమగ్గలించె. 44

క. వెలఁదికి దునమొనరించెదు, చలువలు రవి మీఁద నైన శైత్యము నొందుం
బలుకులు వేయును నేటికి, వలిగొని వడఁకాడుచుండు వైశ్వానరుఁడున్. 45

ఉ. నేసరకాచరించెదము నేమఁదెఱంగుల శైత్యకృత్యము
ల్వేసవి పళ్ళెరానిలము వేఁడిమికిన్నను వాఁడిగల్గి తో
డ్తో నయుక్షీణమై యుఁదయ ధూపము పెట్టినఁ దావులుబ్బ ని
శ్వాసవిసర్గణంబు వడవల్లఁదొడఁగెఁ గడంగి మైపయిన్. 46

క. చదుర్భల విధియించఁగు మీ, యదవద విరహప్రకారమును యాపనికి
న్నదతి కలలోన నెఱుఁగదు, కదిసెన్నఁడు విసదు లోల్లి ఫలంబైనన్. 47

వ. ఇది యేమిమాయయో కదా తాత కాశ్యపమునీంద్రుఁడునుం జేరువ లేఁడు, మన
మీపూఁబోఁడియున్న పోఁడిమియు వగ్గలతవేఁడిమియు నేయుపాయంబులం జక్క
జేయుదు మెవ్వరికిం జెప్పుద మెక్కడం జొచ్చువార మే దైవంబుం బ్రార్థింతము ని
యనసూయ కన్నీరునించిన ప్రియంవద యిట్లనియె. 48

చ. ఎఱుఁగుదు కొంతకొంత యదియే నెఱిఁగుండియుఁ జెప్పనేల యం
చెఱుఁగనిదాని బోలెఁ జరియింపుదు నిట్టి రహఃప్రయోజనం
బఱకతమంతఁ జెప్పుట యయుక్తము నేఁగఱఁగొన్న చిహ్నము
ల్వేఱవక చెప్పెద న్గినుక లేక శకుంతల సమ్మతించినన్. 49

క. అన బోమముడియుంబెట్టుచుఁ, గనుగీటెశ వనుమతంబు గైకొనినదిరయై
యనసూయ చెప్పుమనుచును, దనునడుగఁగ నాప్రియంవద గభీరోక్తిన్. 50

శా. నీవున్నేమను జూడఁగా వనములో నిన్నమ్మదాలివ్యథన్
దావర్తింపఁగ వచ్చె రా జెఱుఁగవా తత్వేళఁ బాలింత్లమైఁ
బ్రోవుల్గ్వోసినభంగి ముత్పులకము ల్పుంఖానుపుంఖంబుగా
నావిర్భావముచుఁ జూచె భూవిభుని దా నొయ్యారపుం జూపులన్. 51

చ. మసతకళాక్షి సిగ్గు తెరమాటుననుండక దాఁటిదూఁటి పా
టిసఁ గదియంగఁ బట్టి యసితాంతలచూపులఁ దన్నుఁజూడగా
మనుజవిభుండు ప్రేమగరిమంబునఁ జూచె లతాంగి నయ్యెడన్
జను మెఱన నాటె నానృపతిచంద్రుని మహాపులఁ గంతు తూపులన్. 52

క. అప్పటఁగోలెను లలనకు, నిప్పంటినయట్లు మేన నిగుడెడుఁ దాపం
బిప్పగిది నేను గన్నది, తప్పదు నిక్కంబటంచు దాఁపక చెప్పెన్. 53

క. ఆమాటలు విని నృపతికిఁ, గాముని శరనిహతినైన గంటులు పూడెం
గామాస్నయుఁ దల్లాడెను, గామిని తనమీఁది ప్రేమ కలిమియుఁ దెలిసెన్. 54

వ. ఇత్తెఱంగునం బ్రియంవద మృదూక్తులం దత్ప్రకారంబు విరహవికారంబు [illegible] ప్ప
యించి తన్ముఖంబునం దెలియక ప్రయోజనం బోజవడనేరదని యనసూయ
శకుంతలం డగ్గఱి కుంతలంబులు దువ్వుచు నుదురుచుం దొరంగు కన్నీరు కపోలం
బుల రాలినం దుడుచుచు మృదుమధుర మందమంద స్వరంబున. 55

గీ. తలఁపు వంచింపుసుతల్లిదండ్రులకును, జెలులయెడ దాఁచి నిలుపరు చిత్తవిధము
ఇంతి నీకింక నీకింక యెందుమాను, చెప్పు జాతోడ నాతోడఁ దప్పుగాదు. 56

క. నీకుఁ బహిఃప్రాణములము, మాకె యెఱింగింప వింక మతి యెవ్వరికిం
గోకనదహస్త చెప్పెదు, దాకొని మదిలోననున్న తగులు న్నెగులున్. 57

ఉ. లాఁతితనంబు చేసి యబలా యెఱిఁగింపక నిల్వనోపుదే
లేఁతలు గాక గుండె లగలించెడు కోయిల దుండగీల వె
న్నాఁతలు గండుఁదుమ్మెదల గుంపుల మ్రోఁతలు గాన నీఁతలుం
బోఁతలు నైనయట్టి తలపోఁతలుఁ గంతునివీఁక చేతలన్. 58

క. రోగంబు పేరెఱుఁగక, యేగతి నౌషధము శాంతి కీనొప్పదు నా
లాగున నీ హృదయమునను, రాగము కీలెఱుఁగకే వెరవు సేయునగున్. 59

వ. ఏమను బ్రియంవదయు నీకుం బర్యాయదేహంబులము పతిచ్ఛాయలము మాకంటె
నింక నెవ్వరు వశ్యులు వయస్యలుం గలరు నాయాస్యంబు చంద్రాస్య చక్కం
జూడు నీయాశయంబు నెఱిఁగింపకున్న మమ్మొల్లకుండుట ప్రియంవదప్రాణంబు
లకుఁ దప్పినదానవు నీవు ప్రేమవాటించి పెంచిన మాలతీలత స్వహస్తంబునం
ద్రుంచినదానవని యానలువెట్టిన నిట్టూర్పు నిగిడ్చి మగిడ్చిన లోచనంబు లించుకవిచ్చి
నెచ్చెలి వదనంబుఁ జూచి తదీయాంకపీఠంబున వదనపంకజంబు మోపికొని గద్గద
కంఠనాళయై యుత్కంఠ నీకుం బ్రియంవద చెప్పినది తప్పదని. 60

శా. గంగాగర్భమునందు నేఁటి తుదదాఁక న్మాటురాకుండ నుం
డంగాఁ గ్రగ్గెను మామొగంబు లిఁకఁ జూడన్నారు మోమేది యే
భంగి న్నిల్తు మునీంద్రకన్యకలతోఁ బాటించి మాతండ్రిఁ ద
న్వంగీ యేగతిఁ జేరఁబోదు నని యొయ్యొయ్యక్కి వెక్కెడ్చినన్. 61

క. కన్నీరుఁదుడిచి గొజ్జఁగి, గ్రొన్నీరున మోముగడిగి కూరిమి పలుకన్
న్ననీరజముఖిఁ గౌఁగిటఁ, జెన్నారఁగఁ జేర్చి యలమి చెన్నుదలిర్పన్. 62

క. కోమలి మేనకకును వి, శ్వామిత్ర మునీంద్రునకును జనియించిన బా
లామణివి నీవు నీ కే, లా మునికన్యకలతోఁ గళంకము గలుగున్. 63

ఉ. నీకు విచారమేల మహనీయచరిత్రవు నీమనంబు గం
గాకమనీయపావనము కల్మషమందఁగ నేరదెంతు మం
దాకిని సిగ్ధునాకృతి నుదారగతిం జనుదెంచు పెల్ల ర
త్నాకరుఁ బొందఁగాక యపహాపచన నేర్చునె పాటుకంటకున్. 64

గీ. చంద్రవంశోద్భవుండు దుష్యంతవిభుఁడు నీకుఁ బతియౌటకుం దగు నీరజాక్షి
తగుదు వతనికిఁ గౌశికాత్మజవు నీవు, నెట్టి యనుకూలదాంపత్య మిఁక మీకును.

వ. అరూఢయౌవనవైన నీకుం దగిన వల్లభుండు గాఁగ మహావల్లభుని సేవింపం దాత
కణ్వమునీంద్రుండు సోమతీర్థంబునకుం బోయి వ్రతంబుపూని వర్తించుచున్నవాఁ
డేతత్కార్యంబు సిద్ధించిన నాశ్చర్యచరితుం డుల్లసిల్లుంగాని ఘల్లసిల్లఁడు చింత
యుడిగి సంతసంబునొందుమని పల్కి యనసూయ ప్రియంవదవదనంబునఁజూడ్కి
నిలిపి యిట్లనియె. 66

గీ. తెన్నుచోటనె నిలిచె నీ లేమప్రేమ, తాత వినినను మిగుల సంప్రీతినొందు
ధరణిపతి చిత్తమేమిచందంబొయనిన, నింపుమీఱఁ బ్రియంవద యిట్టులనియె. 67

క. ఆవిధము నించుకించుక, భావంబునఁ దోఁచె నాకు నృపాలుఁడు నిన్నున్
దా వనమునఁ గను వచ్చిన, తేవదొలంగినది పల్లటిల్లిన చెలువున్. 68

ఉ. తేఁకువ దప్పితప్పి వడదే యెడుకన్నులు మిన్నునంటి యా
కూఁకువలేక మేను గడుఁ దూలియయున్నది మోదచందమున్
నేఁకువ చందమామగతి విన్ననరైనది మన్మథాస్త్రము
ల్దాకినభంగి దోఁచు వసుధాపతిఁ గాంచితి యాగశాలలోన్. 69

వ. మృగయావిహార వ్యాయామంబునం గలయలపు సొలపుంగాదు ప్రసవబాణ తపన
వ్యథాజాలసంతాపశ్రాంతయసిద్ధంబు. ఆ మూర్ధాభిషిక్తునకు శుద్ధాంత కాంతా జన
చింతాభరంబో శకుంతలాచింతాభరంబో నేఁట యూపట నెల్లి యెల్లుంట మెల్ల
మెల్లనఁ దెలిసికొనియెద నీలోన నిప్పల్లవాధర ప్రసవభల్లంబుల నుల్లంబు జల్లని
యుల్లంబోయి యపాయంబు నొందకుండ నుపాయంబు విచారించుకొనవలయు
ననిన నవ్వచనంబులు భూవల్లభుండు విని. 70

చ. అనిలము రోగమై యనువు నగ్నియుఁ దోయము దైవికంబులై
చనఁ దనవారిఁ జోరులును శాత్రవులుం బయివారిఁ జేయఁ బీ
డనములు మానవంబులగుటం బతివంపని యీద్వివర్గము
న్మనమునఁ గాంచి నేర్పు మెయి మాన్పుటయొప్పు ప్రజాభివృద్ధికిన్. 80

వ. ఈయర్థంబున మారుండు చోరుండు మా మానిని మానధనంబు ముచ్చిలి తెచ్చి మీకిచ్చిన చోరుండు భవత్సమీపంబున యున్నవాఁడు స్త్రీధనంబులు రాజుల కగ్రాహ్యంబు లింతిసొమ్ము మగుడ నిప్పించి యశస్కరుండవై మదనతస్కరుని శిక్షించి విచ్చేయు మనిన మందస్మితవదనారవిందుండై యయ్యిందువంశసంభవుండు విస్రంభగంభీరంబుగా నిట్లనియె. 81

గీ. మొదల మాధైర్యధనములు మ్రుచ్చిలించి, యించువిలుకాఁడు దొంగ మీయింతికిచ్చె
నేము కోవెలపులుఁగుచే నెఱుఁగుటయును, గుదువ మాకిచ్చె మీయింతి హృదయధనము

క. మాసొమ్ము మాకొసఁగిన, మీసొమ్ము నీకు మగుడ మీ మాసొమ్ము
ల్వాసివడకుండ నూరక, గోసన యేమిటికి మార్చుకొనియెద మొందెన్.

గీ. ఇందులో నిప్పమెద్ది మీయిందుముఖికి, నడుగుడెడమాటలకుఁ బ్రొద్దు నడపలేదు
సాయకువసానమైనను సవనరక్ష, కొదగవలెఁ గాని యింకిట నుండరాదు. 84

మ. నయశాస్త్రంబులు మీరెఱుంగనివి యెన్నం గల్గ వింతుల్మనః
ప్రియముల్ వీక్షింపఁగదా స్వయంవరము కల్పింపంబడె నీకుమా
కు యశోహానులు లేవు కౌతుకము మీకున్నన్ నిలంగల్గె నే
నియుఁ గావింపుఁడు మాకుఁ గోర్కులు మదిన్నిండార గాంధర్వమున్. 85

వ. వివాహంబులు బ్రాహ్మ్యంబును దైవికంబును గారుడంబును బ్రాజాపత్యంబును రాక్షసంబును నాసురంబును గాంధర్వంబును పైశాచికంబును నను నెనిమిదితెఱంగులం బ్రవర్తిల్లునందు క్షత్రియులకు గాంధర్వంబును రాక్షసంబును ముఖ్యంబులనిన నృపముఖ్యుని వాక్యంబులు శకుంతలవయస్యలు విని వినయంబున నిట్లనిరి. 86

చ. జనవర నీవుచెప్పినది సత్యము నీమది దుష్పథంబునం
జనదియు నేమెఱుంగుదుము సర్వవిధజ్ఞుఁడు కాశ్యపర్షి యీ
న్మనమున నొందు హర్షము నమర్షము నొందఁడు మాకు నీ ప్రయో
జనము శుభంబెరయైన నొక సంశయమున్నది మానసంబులన్ 87

వ. అది యెట్టిదనిన. 88

క. వేఁటకుఁ బయివచ్చి నృపమా, బోఁటికిఁ జిట్టింట్ల నంటిపోయిన పిదపం
దాఁటుకడుం గులమునకును, మాటయుఁ గణ్వునకువచ్చు మానులచేతన్. 89

ఉ. మాతఁ గలాక్షిపైఁ గలుగు మక్కువ నిక్కువమయ్యె నేని యా
భూతలనాథ యాతనికి భోఁడికి నీకుఁ బుట్టు పుత్రుఁ బ్ర
స్ఫీతిగ యౌవరాజ్యపదపీఠమున న్నిలుపంగ సత్కృపా
న్వీతుఁడవై మనోజ్ఞ మహనీయముగా శపథంబు నీఁదగున్. 90

క. అనవుడు నవ్వనితలతోఁ, జనపతి యాపనికి నేల సందేహము నా
ఘనలక్ష్మికిఁ గాశ్యపముని, మనుమనికంటెను మఱొకఁడు మాన్యుఁడు గలఁడే. 91

సీ. నిజముగా నీబోఁటి నెలతపైఁ గూరిమి గలుగు నా యంతరంగంబు సాక్షి
కలహంస కీరకోకిలములాఁ గొలువ నోలగమున్న యీ వనలక్ష్మి సాక్షి
కుధరకన్యానాథ కోటీరరత్నంబు చంద్రుండు మాకులస్వామి సాక్షి
యలికలోచనమూర్తియైన కాశ్యపమహామునీంద్రు పాదపద్మములు సాక్షి
తే. సాగసత్యచరిత్రలు మేరుసాక్షి, యాలతాంగికి సుతుఁ డుదయించు పుణ్య
మేను జేసిన నతని నాయేలు సకల, సింధు నేమికి యువరాజుఁ జేయువాఁడ 92

వ. అని యుర్విఫథంబున నవ్విశ్వంభరాభర్త విశ్వాసంబు చేసిన విశ్వామిత్రపుత్త్రిం దెచ్చి
గాంధర్వంబమంత్రకంబు గావున నారాజు హస్తంబునకు నారాజవదన కరసరో
జంబిచ్చి శచియు శతమన్యుండు శరధికన్యయు శార్ఙ్గపాణియు శైలరాజకన్యయు
శశాంకశేఖరుండును బోలె శశివదన శకుంతలయు శశికులావతంసంబు దుష్యంతుం
డును ననుకూలదాంపత్యసౌఖ్యంబు లవిచ్ఛిన్నప్రీతి ననుభవింపుదురుగాక యని
యనసూయా ప్రియంవదలు దీవించి వాసవాప్రసవముకుళంబుల నిరువురి శిరంబులం
జల్లి పల్లవతల్పంబునకుఁ గొనిపోవునెడ. 93

సీ. ప్రళయసంధ్యానటత్ఫాలాక్షు డమరుగోచ్చండ నిర్ఘోషంబు బెండుపఱచి
మందరాచల మహామథనవేళా గుంభదంభోనినాదంబు నపహసించి
గిరిగరుత్ఖండన క్రీడాసమారంభ దంభోళిరుదితంబుఁ బ్రస్తరించి
పుష్కలావర్తకాంభోధరోదరగళన్నిర్ఘాతరావంబు నీచపెట్టి
తే. వసుసదిక్కుంజములఁ బ్రతిధ్వనులు చెలఁగ, నాశ్రమారణ్యముల నెల్ల నాక్రమించె
మునులు భీతిల్లఁ గాలికాముఖమహోగ్ర, భూరిసన్నాహసమరభేరీరవంబు. 94

స్రగ్ధర. ఆనిర్ఘోషంబుకంటెన్ హరదురగతి మున్నాడి యొక్కింతనార్తి
ధ్వానంబుల్మోని రాజీవదనభవములై వచ్చె నస్మత్తపోర
క్షానిస్తాలోల హేలాసమరవిజయ దుష్యంతభూపాల రక్షః
కీనాశుల్వచ్చి యద్యాత్రిం యఁ దపసులరక్షింపు రక్షింపు మంచున్. 95

గీ. పిశితభోక్తల నిస్తుకభేరిరవము, నధికభీతమునీంద్రుల యార్తరవము
గోపకామిన్యారవములు వినిగొనంగ, నపగావంబు భూమిభుఁ డాకర్ణించి. 96

సీ. సౌధాగ్రవర్ణ పంజరముల రంజిల్లు రాజకీరమనోజ్ఞ నదముకంటె
భోగినీనఖరాగ్రముల మోహనంబైన కలహానగీర్ణారవంబుకంటెఁ
కలకంఠకంఠముల కలరవంబులఁ గొల్వు రమణీయ సంగీతరవముకంటెఁ
వారాగ్రవాహిణీ జనముల కరవర్ణ వలయ మంజీరరావంబుకంటె

తే. నందిరోద్యానసార మధుపచక్ర, వాక కలహంస మధురరవంబుకంటె
నత్తశుకకృత్రికలజాలు చిత్తగించి, యాదరించును కణ్వుతో నార్తరవము. 97

వ. ఇత్తెఱంగునఁ గురంగనాకోలాహలమహీభర్త మహర్షుల యార్తరవంబు విని మహార్త మూర్తింబునుం దనతూరక తదీయరక్షార్థంబు నిశ్శోకులపై నటువనముకట్టి రపంతిల నదనం బవలోకించుమనప్పుడు. 98

ఉ. తాఁగవలంగ బాణ్పలుల ధారలతోం గదలంగ నింతి నా
నాఁగకయున్న దుశ్చ్యవన మాటని యెప్పల నప్పళింపఁగాఁ
దోఁగిన యశ్రువారిఁ గనుదోయి ధగంబయి యుప్పి వెట్టఁగాఁ
గ్రాఁగిన చిత్తమోయమగు కాయజుపాయక యున్మమోయనక్. 99

క. ఆవేళ శకుంతలతో, నీవేల లతాంగి యింత నెగులువడంగా
నావేళను వసియింతువు, నీవేలం జిటికవేసి నిలిచినమాత్రక్. 100

క. నాలావుకొలఁది నెఱుఁగక, బాలా వెఱచెదవు కోణపనికాయముపై
కోలాహలముం జేయుదు, వాలావలవానుడువచ్చి యుద్ధంబైనక్. 101

క. అని తేర్చెఁ బ్రియుంవదయును, ననసూయయును విభుని జేరి యట్టిట్టనరా
కనివీక్షింపనతనిమే, లానకుం దమసఖికి వామలోచన మదరక్. 102

గీ. కాంచి మనములఁ గడుఁ గౌతుకంబునొంది, యాశకుంతలతోడ నోములఁ బొడి
జయము పశ్యంబు నీనిజస్వామికవును, నగుమొగంబున ననుచు భూనాథుఁ జూచి.

ఉ. హస్తికాసురభంజనుఁడు హైమవతీ రమణుండు దేవతా
మస్తకరత్నపుంజరుచి మంజులపాద సరోరుహుండు లో
కస్తవనీయధాముఁడు జగన్నుతుఁ డాత్రిపురాంతకుండు దా
స్వస్తి యొసర్చుగాఁక! విలసత్కరుణామతి దానవాజిలోక్. 104

వ. అని యాశీర్వదించి సమ్మతింప నమ్మహీవరుండు వనబహిరంగణంబునకు సారథి యెదురు తెచ్చిన స్యందనంబెక్కి యొక్కరుండును నుక్కుమిగిలి త్రిపురాసుర వీరుల పయింజను ఫాలలోచనుండునుం బోలె నాలంబునకు నడచె నెడ. 105

సీ. జడలూడ ముహుల కైనడిఁ జిక్కఁ జీఱఁగా నవని నైఁబడి పొరలాడువారు
పదిరైన కుంజల పరు చత్తి గాంశక దగఁగొట్టి పెదవులు దఱుపువారుఁ
గఁపతాఁకుల జీరుగంటులై వీఁపుల కేఁగలంటఁగఁ బొదల్లాఁబువారు
నెకుకుఁబోవఁగ లేక యుటుంకోటములలో నొఱగి యూఁపు పుచ్చ వెఱచువారు

తే. లేఁటిఁ బోడఁగని జెనబారలిఁచువారు, నైన కుసులను జూచి హాస్యాబ్జమిత్తి
వెఱపుసుగుఁడోడకుఁడు భ్రమవిసావుఁడనుచు, నంచితాలాపములభీతిఁ నణఁచి

క. యూఁను గొదవడకుండఁగ, సాగింపుఁడు యుష్మదీయ సవనానలకుం
డాఁశివిసిలభూమస, మాగమనుస దనుజసేన మండలి ప్రుగ్గుక. 107

క. అంతేప్ప యుఁగయమునఁ, దనయూటు నయగవిచ్చి దౌదవుల్లల
ద్దము వాలఁ గనుఁగొని పుఖం, డచండభుజుండు విలుగుణధ్వని చేయన్. 108

మ. చెలిమిం జేసెఁ దదాహవస్థలమునం జృంభించి యాచంద్రమః
కుళభూపాలక చాపదండ విలసత్కోదండటంకారము
స్తగిరి వానఖీంఠ్రైన మహోత్కోగ్ర హుంకారము
ల్ప్రళయారంభ నటత్కృతాంత పటహప్రస్ఫుగ్ర భాంకారముల్, 109

క. ఆగానము దమకుం గ, గ్గాయంపుదమైన దానవాధిపుఁ డని పెన్
భూనభోగమునిమీఁద దిక్కరి, సారుల మాకందశరభసైన్యాధిపులన్. 110

ఉ. వారును నేఁటదెంచి జనవల్లభుపై మిహిరాంశు తీవ్రకిం
శాసుపరంపగల్వఱపఁ జంచలపుంచక వజ్రదీప్తి మ
ద్దామణ బాణయుక్తముల దారికఁతులఁ గోసి వీరల
క్ష్మీగసణీయ భూపబలిక స్పలుగొట్టెలఁజేసె నిద్దఱన్. 111

క. మాకందశరభులిద్దఱు, సీకరణిని సమరధరిణి నీల్గుటవిని యా
రాకాసి తేఁడు కుపితయు, మాకారత నగ్నికణము లమలరాలన్. 112

శా. ఏమేమీ మఖరక్షకు న్మనులు ధాత్రీశాధముం దెచ్చి సం
గ్రామక్రీడకు నొడ్డిరే నఱచిరో కాకాత్మలం గర్జదం
భోమత్కల్ప నిశాట వీరసుభట స్ఫూర్జన్మజాకార్ముక
జ్యాముక్తాతత రోగసాయక మహోశంబాళి సంబాధమున్. 113

వ. మాకందశరభులిద్దఱు వడ్డ సేమితప్పెదర్పకారాతయే తెంచినఁ జక్రధరుండు విక్ర
మించిన టెప్పుడని వియచ్చరకోటిసీన లెచ్చటికిం బోయునని నిర్నిద్ర నిర్ని
రోదక్రోధంబున నసురనాథుండు సుభటయూథంబు నాయోధనంబునకుం బనుప

వాసినుం జని యుద్ధవ్రత భేరీభాంకృతులును జటులమదకరి ఘటాఘీంకృతులును దురగహేషాహ్రేంకృతులును గుండలితకఠినకోదండజ్యాలతాటంకృతులును బదాతి నదనాదసాహంకారహుంకృతులును నబ్జజాండకటాహంబు చిప్పలసందువాపం గోపంబు పెక్కురూపంబులుగఁ గొన్న విధంబున నీరంబు బహుశరీరంబు లెత్తిన చాడ్పున మూఁకంగొని వేఁకనిడిమి నాకంగొనక వీఁక నొక్కుఁకువం గరిపురాధీశ్వరుండు వాఁకి నల్లగిరులుంగొను నొడళ్ళ కాంతులు మెఱుఁగుళ్ళను, విస్ఫూర్జితాట్టహాసంబులు గర్జారవంబులుగ స్యందనప్రభాపుంజంబులు మెఱుంగులుగా నంపవానలుముంపఁ జలింపక నిలింపపతి సత్వసారుఁడై యొకవీరుండు ఫల్లుండెసఁగొని వాలమున వెల్లువ పెల్లుగాఁ బఱపి నంబసని యశనిరోచిరుద్భల్లంబులగు మనుజవల్లభుభల్లంబులం గృతాంతపురపథికులగు రథికులును విశ్లథంబులగు రథంబులును వికర్తనతనయకింకరప్రాప్తులగు వీరరాహుత్తులును విగతత్రాణంబులగు ఖత్తుబాణంబులును విస్తీర్ణశీర్ణాంగంబులగు మాతంగంబులును విన్యస్తదైన్యంబైన సైన్యంబును విస్రస్తంబును, విధ్వస్తంబును వీటతాటంబును వీరాకుల పదళంబునుం గావించి విలోకించిన: 114

చ. అఖిలజగద్విహార కులహారపరాయణుఁ డుల్లసచ్ఛిఖా
శిఖిసఖ ఖడ్గపాణి గవిజిహ్వుఁడు విస్ఫురితారమండలీ
ముఖుకులు వీరశేఖరులు ముప్పదిగోటులు ముఖ్యనాయకు
ల్సఖులమఁబోలె నుండ బలసంపను పేతుఁ డభీతుఁ డాజులన్. 115

సీ. తురగరింఖాముఖోద్ధూత ధూళీపాళి నభ్రగంగానది నడఁసు రేఁగ
లసితశస్త్రప్రద్యోతు లాశాధినాథుల యిండ్లముండళ్ళ నీరెండ గాయ
దంతిసంతానదుర్దాంత ఘీంకృతులచేఁ జెవులు జుమ్మనుచును జెజ్జవోవ
విపుల సైన్యవథోగ్రవిన్యాసరవమున నుర్విపట్టదలి యుబ్బాఁతలూఁగఁ

తే. గుండలీకృత చాపకోదండదీర్ఘ, నిష్ఠురజ్యారవంబుల నింగి వగుల
విక్రమాభిక్రమంబున నాక్రమించి, రభసమునవచ్చి దుష్యంతిపభునిఁదాఁకె. 116

ఉ. తాఁకి పరేతరాజవరదత్తములైన మహోగ్రబాణముల్
ద్రేఁకని వీఁకతోడఁ బృథివీపతిపై నిగిడింప నాతఁ డ
శ్శంకకు నోర్వలేక యలుకం బిశితాశన భర్తవక్షముం
దాఁకఁగ నేసె శాత్రవవిదారణ దారుణ వారుణాస్త్రమున్. 117

క. వారుణబాణమునకుఁ బ్రబలి, కార మెఱుంగక సురారి గతజీవుండై
ధారుణిఁ బడెఁ బవిధారా, దారిత మైపడిన గోత్రధరుచందమునన్. 118

వ. రవిజిహ్వుఁడు వారుణబాణపాతంబునం బ్రేతపతిపురంబునకుం బోయినం గనలి
కాళికాముఖుండు క్రోధపాటలముఖుం డగుటయుఁ బాటలవర్ణమానాశి మర్త్యా
శిత్రయం బగ్నిత్రయంబు ననుకరించి లోకత్రయదాహకులై ప్రచండవేగంబున
సేనంగుపురాధిపు నేననేన సంహరింతునని పంతంబులాడుచు నా రాజసింహంబు
పయిఁ గదిసిన. 119

శా. సంగ్రామంబున నుత్సహించుటయు నాత్మాభర్త కల్పాంతవే
ళం గ్రీడించులు లాయవాహునిలీలం గ్రుద్ధుఁడై యుద్ధసీ
మం గ్రోధాగ్నికిఁ జేసె నాహుతులుగా మానాసిమర్త్యాసిపే
శ్యం గ్రూరాకృతిఁ గ్రాలు దానవుల శైలద్బాణయుగ్మంబునన్. 120

గీ. పార్శ్వ్యాలిద్దఱు నభూమిపాలు నిశిత, బాణయుగమున నిర్గతప్రాణులైనఁ
దూర్ణముగవచ్చి పాటలవర్ణుఁడేసె, నవనిపతిమీఁద నైంద్రజాలాశుగంబు. 121

క. ఆయింద్రజాలబాణము, మాయావిధమేమిచెప్ప మహనీయంబై
యాయోధనసీమ నుహీ, నాయకుకన్నులకు మునివశంబై తోఁచెన్. 122

మ. కకుబంతంబులు ముట్టి మ్రోయుచుఁ బరీక్షావేదఘోషంబుఁ గా
నొకచో నధ్వరతంత్ర మంత్రనినదం బొండొక్కచో స్మార్తక
ర్మకలాపారవ మొక్కచో లలితమీమాంసానినాదంబు వే
ఱొకచో యుద్ధవిజృంభణం బుడిగి యయ్యుర్వీశ్వరుం డుండఁగన్. 123

క. ఆరాజుసమాయాస్థితి, సారథియెఱిఁగింప దెలిసి సారాస్త్రమున
న్వారించియొక్కతూపునఁ, జౌఱండిల గూలనేసెఁ బాటలవర్ణున్. 124

శా. క్రవ్యాదుం బరిమార్చి యంతయును సంగ్రంపశ్యుఁడై నిల్చి వా
యవ్యాస్త్రిం బరవోసి యే యుఱయు వాత్యావేగవిస్ఫూర్తి నా
ర్తివ్యాహారము లుప్పతిల్ల నుడువీథిం గొండ్లియాడించె దై
త్యవ్యాఘుత్తైరబొమ్మలట్లు నిగుడం దా నాటకాఁడుంబలెన్. 125

స్రగ్ధర. ఆజన్యంబందు నిమ్మై సఖిలదనుజవీరాతి వీరోగ్రసాద
వ్రాజన్యాస్త్రాళిచేత వ్రణమున బడిన వ్రాతుసాధీసుఁడేగన్
రాజన్నాసీరవాజి వ్రజఖురజరజోరాజి ఘోరాజిభూమి
వ్రాజివాప్తుం గ్రహింప వ్రభసమునఁ బయోరాసులన్సంగ్రహింపన్. 126

వ. ఇట్లు సంరంభవిజృంభమాణుండై కాళికాముఖుండు బర్హిర్ముఖవిరోధిదిశాధికముఖం
బులం జలింపఁ బంచదశాక్షౌహిణీయుక్తుండై మూర్ధాభిషిక్తునిపయిం గవిసిన నసి
ముసలభిండివాలముద్గరతోమరప్రాస శరాసన ప్రముఖ నానావిధప్రహరణంబులం

గుప్పించినం దప్పించుకొనుచు నుప్పరవీథికిం దత్తటిల్ల తలంగఁద్రొప్పించు పోలికఁ గవశ పుంఖశిలీముఖంబులు వఱపి యాకసంబునంగనక సంఘంబువోలె నల్లఁగనుల శరంబులు దట్టంబుగఁ జేసియు విహాయసంబునకు రాయంచలదుఖు లెగయుచు చందంబునం దెల్ల పింజెలఖల్లంబుఁ జేసియు మహానక్రంబు సముద్రక్రోడంబునుంబోలె విక్రమాభిక్రమంబున నుక్కుమిగిలి యాశరకారిసేనానక్రాశకరంబుఁ జొచ్చి శోధించి కలంచి కలగుండుసేసి మట్టిమల్లాడి వెరఁజి వెంపరలు వెట్టి వచ్చిపోయిన తెరువెఱుంగరాక యొక్కెడఁ జూచిన రథమయంబై యేవంకఁ జూచిన దుష్యంతమయంబయ్యు నే నిశాచరుం జూచిన శరమయంబయ్యెనుండె నట్టి బెట్టిదంపు మహాహవంబున. 127

చ. తొడుగుటు కానరాక వెసఁదొడిన యేయుట కానరాక పై
వెడలుట కానరాక యుఁకువీథికిఁ బోవుట కానరాక య
య్యెడ విభువంశసంభవు నుగ్రశరంబుల దైత్యమస్తము
ల్వడుటయు రక్తవాహినులు పాఱుటయుం గనవచ్చె నాజిలోన్.

గీ. హస్తిపురరాజ శరవాతహతిని ద్రెళ్ళి, రాసులైయుండె సంగ్రామరంగమునను 128
నరిదిప్రోవులు చేసిన నల్లపేటి, తాటికాయలగతి దైత్యకోటుల తలలు. 129

ఉ. అబ్బురముద్రించి దానవుల నాహవభూమి విభుండు గూల్చినం
గొబ్బునఁదెచ్చి జాతరకు గోసిన పోలికనుండె మేదముం
బొబ్బుమ మాంసము ల్చవులు చూచుచు భూతములుండె నాజిలో
గబ్బునఁ జేస్చిచుం జయముగాథలు పాడుచు సోలియాడుచున్. 130

వ. ఇవ్విధంబుననుండె నంతట. 131

క. ఖలమెల్లఁ దెగిన నిజ దో, ర్బలముం జలముం బ్రతాపపావకుఁడును ను
జ్జ్వలశస్త్రాస్త్రంబుల నిజ, బలముగ నెదిరించె దనుజపతి నరపతితోన్. 132

శా. నిన్నున్నిర్మించితి సైన్యములన్నియుగుపోనీ దీననాకేమియు
న్విన్నంబాటు ఘటింపనేరదు సురానీకంబులం బోరుల
న్వెన్నుల్ద్రిప్పిన నన్ను మార్కొనెదువో వీర్యం బవార్యంబుగా
సన్నద్ధుండవుగమ్ము చూపు నిజశస్త్రప్రౌఢిమ ప్రౌఢిమన్. 133

మ. అనినం గొండొక నవ్వి రేల యిటు వీరాలాపముల్మద్భుజా
ఘనకోదండము కాలదండము భవత్కన్యంబు సవ్యంబు భూ
తనికాయంబున కిత్తుఁ బోవిడువఁ బాతాళంబు భేదించి చొ
చ్చినఁ జక్రాంకుఁడు తోడువచ్చిన మహాశేషుండు దావచ్చినన్. 134

క. అని వీరోక్తులతోడన, యనిసేయఁగడంగ మానవాధిపుఁ డచ్చో
మనుజాధిప దనుజాధిపు, లనువొందిరి రామరావణాకారములన్. 135

శా. ఉల్లంబుల్ రణకౌతుకంబున సముద్యోగించి సావష్టంబులై
యుల్లాసంబులు వీరరేఖలును నుద్యోగింప నొక్కంతలై
భల్లాసారము పెల్లుగా వసుమతీపాలుండు దైత్యుండు ఘం
భల్లీలాఁతిఁ బేర్చి మార్కొనిరి ప్రాబల్యంబు తుల్యంబుగన్. 136

గీ. దనుజశరములు భూభర్త దునుమువృపుని, శరములమరారి దునుము నయ్యిరువురకును
జయము నజయంబు నవ్యవస్థంబులయ్యెఁ, దూఁచి వేసినగతి నుండె దోర్బలములు. 137

క. ఈశరణిధమారణము, స్తోకగతిం జేయుచుండి దోర్బలమొప్పన్
భూకాంతుఁడు నొసలేసెను, భీకరబాణమున నసుర పెడతలవెడలన్. 138

మ. సురవిద్వేషి తదస్త్రపాతమున సంక్షోభించి యొక్కమ్మున
న్నరలోకేశు నురోవిభాగము వడి న్నాటించి యాఱమ్ములం
గరముల్నాయక సప్తకమ్మున బరుల్గట్టంగ బెట్టేయ నా
ధరణీనాథుఁడు లెక్కసేయక తదుత్సాహంబు డాహంబుగన్. 139

క. అక్షుద్రశితశరంబులఁ, బ్రత్యుభితుండగుచు నేసి ప్రధనక్రీడ
న్వీక్షింపుచునుచు రాక్షసు, వక్షము జయలక్ష్మికిని గవాక్షము చేసెన్. 140

గీ. ధ్వానిపాలుఁ డేసిన దహనతీవ్ర, సమశిలీముఖములవేఁడిఁ జాలనొచ్చి
దర్పమెడలక విలుగుణధ్వని యొనర్చి, భీకరధ్వని దిక్కులు వెకలనార్చె. 141

సీ. పలలాశవిభుఁడేసె పైశాచబాణంబు భైరవాస్త్రంబు భూపాలుఁడేసె
వ్యాళక్షురప్రంబుఁ గాలికాముఖుఁ డేసె గరుడభల్లంబేసె నరవరుఁడు
పావకాంబకము విభావరీచరుఁడేసె శశికులీనుండేసె జలశరంబు
తిమిరప్రదరమేసె దితినందనుఁడు భానుసాయక మిభపురస్వామి యేసె

తే. నామహారాజుచేత దివ్యాస్త్రనిచయ, మచటఁ దోడ్తోనప్రతిహతమగుటఁ జూచి
తనకు నంతకుచే వరదత్తమైన, తీవ్రశక్తిం బ్రయోగించి తిపురుటయును. 142

మ. శరదర్కద్యుతికర్కశాంశువగు నా శక్తిన్నివారింపఁగా
శరముల్గానశ యేసె దానవునిపై సంధించి బ్రహ్మాస్త్రము
న్నరవైరాకర సైన్యనాథ సుమహాశుద్ధాంత కాంతానుదు
న్నక్రవైధవ్య మహావ్రత ప్రకటదీక్షా సత్క్రియా శాస్త్రమున్. 143

గీ. ఆహవక్షోణియందు బ్రహ్మాస్త్రహతిన్, విస్మయంబుగ సురవైరి భస్మమయ్యెఁ
త్రిపురఘస్మరు నిటలాక్షు తీవ్రహతిన్, భస్మమైఁ ట్టి సంకల్పభవుఁడువోలె. 144

కం. దనుజుఁ బరిమార్చి మందఱి, కని దానవబాధఁదీర్చి కృతకృత్యుండై
మునిజనములు హర్షింపఁగ, జననాయకమౌళి విజయశంఖం బొత్తెన్. 145

కం. ఆవేళ వచ్చి మౌనులు, పావనమంత్రోదకములు పైఁబ్రోక్షింప
న్నృపవరు మేనికి శిశిర సు, ధావర్షంబై రణవ్యథన్ హరియించెన్. 146

వ. ఇట్లు సంజీవనమహితమంత్ర జలంబులచేత బ్రభూతంబైన యాతుధాన శాతశరజా
తవ్యథనపనయింపంజేసి 'మునీంద్రు లతనితో మాభాగధేయంబున నిచ్చటికి విచ్చే
సినకతంబున, యాగంబు సుప్రయోగంబుగాఁ జాగ నీ కాళికాముఖుండు పాక
శాసన పావకపరేతరాజ పలాశిపాశిపవనపౌలస్త్యపన్నగాభరణులకు నజేయుఁడు
వీఁడు భవదీయబాహుదండ కోదండకాండ ప్రచండశిఖిశిఖాముఖంబున భక్షితుం
డయ్యెఁ గావున నేతక్షణంబునఁనుండి రక్షోభయం బెన్నటికిని సునయంబయ్యె
మా జపతపోనిష్ఠానుష్ఠానంబుల షష్ఠాంశంబుఁగొనం గర్తవు కీర్తనీయ చరిత్ర
జగద్ధితకీర్తివై మీ వంశకర్తలగు చంద్రసౌమ్యపురూరవశ్చక్రవర్తులంబోలి యేక
చక్రంబుగాఁజక్రాచలమధ్య మహీచక్రం బవక్రంబగు విక్రమంబున నప్రతిపదం
బగు ప్రతాపంబున ననశ్వరంబగు నైశ్వర్యంబునం బరిపాలింపుమని యాశీర్వ
దించి యనుప ననుపమానభయభక్తితాత్పర్యంబుల మునివర్యులకు నృపవర్యుండు
నమస్కరించి వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాదికృత్యంబులు వెడవెడం దీర్చి
శకుంతలావలోకనంబునకు లోకలోచనుం గనుంగొనునప్పుడు. 147

కం. బింబఫలకాంతిరవిబిం, బంబరుణద్యుతి వహించెఁ బాశధరాశా
స్తంబేరమకంఠచ్యుత, జాంబూనదఘంటవోలెఁ జరమాద్రిపయిన్. 148

మ. మునిదత్తార్ఘ్యపయః ప్రహారకులిశంబుల్దాఁకి మందేహదే
హనికాంతస్రుతరక్తధార చెలువంబై పశ్చిమాశాతటిం
గనుపట్టె న్నసంజచాయరరుచుల్ గ్రాంతించి యచ్చోటికిన్
జను కాకోలకులంబు నాడెసల నోజం జీకటుల్ గ్రమ్మఁగన్. 149

ఉ. జారులు చోరులు న్మృగుల సంతసరుండఁగఁ జక్రవాకము
ల్దారలఁ దాఱ నశ్రుజలధారలు గ్రమ్మఁగ నుమ్మలింప నిం
డార నజాండభాండమున నంతకశాసనకంధరాంతర
స్ఫార విశాలకాలరుచి బంధురబంధు మదాంధకారముల్. 150

కం. పాటిగ మిఱుఁగల్లం జే, ర్పాటేమియు లేక కానఁబడె నీలశిలా
పేటియు నదినింపఁగనిశు, కాటుకయుంబోలైనై జగంబునఁ దమముల్. 151

ఉ. నాలుగుదిక్కులందును ఘనంబుగఁ బర్విన చీఁకటుల్ జగ
ద్గోళము నిండి దృష్టికి నగోచరమై వెసఁ బర్వుచుండఁగా
నీలపటంబుమీఁది విపణిం బచరించిన ముత్తియంబులం
బోలివెలింగె నంతట నభోవలయంబునఁ దారకావళుల్. 152

వ. తదనంతరంబ. 153

మ. కుముదోజ్జీవనమంత్ర మంగజభుజాకోదండ గర్వంబు సం
తమసాసేపకకూటపాకలము జ్యోత్స్నావర్షి వర్షాపయో
దము పాంథవ్రజచిత్తశల్యము నిశాధమ్మిల్ల బంధూక గు
చ్ఛము ప్రాచీనగశృంగవీథిఁ బొడిచెం జంద్రుండు సాంద్రద్యుతిన్. 154

సీ. పాంథలోచనవారిఁ బదనీనమర్చిన సంతప్తపటకు కంతునకును
ప్రాచీదిశాపతి పావడఁ బెంచిన మవ్వంపుఁ జిగురల్లి మన్మథునకు
నాత్మప్రతాపాగ్ని నవతారమొందంగ నంగారఖండ మనంగునకును
గాముదీ జలధివేడ్కలకు నీఁడఁదెచ్చిన పవడంపుఁ గుంభంబు భావజునకు

తే. వనెడు విచికిత్స జనులకు నావహిల్లఁ, జక్రవాకము లెడఁబాయ జారసతులు
డాయ నబ్జవిలాసంబు దాఁపరీఁడు, ప్రాచికోనరించెఁ గుసుమపూబంతి చెలువు. 155

గీ. అంతఁ జాజాడగా రాగకాంతి విడిచి, యల్లనల్లన యుడురాజు తెల్లనయ్యె
రాగి బలుగట్టి సురసప్రయోగమునను, ధాతువాదిచే రజతమై తనరినట్లు. 156

గీ. గళమునకెంత మిన్న నక్షత్రనాథుఁ, డరయ నొకపాటిగాఁడు దోషాకరుండు
ఒడలుగందినయది యంతయోవ, గాక, కవియునోయని బద్మిని కన్నుమొగిచె. 157

క. కాసహారహాసకుముదా, కాశ నదీద్విరదరదనకరకాహిమనీ
కాశయయి యాసలం దవ, కాశము లేకుండ నిండి కౌముది కాసెన్. 158

మ. కలయం జంద్రికసోఁకఁ గర్ణికలు బొంకంబెక్క యంతంతకుం
గలికాగ్రంబులఁ బట్టు వాసి నెరయంగా విచ్చి తోరంపుటు
గ్గులు వీడం బెడవీఁకవీడి వలిలేకు ల్నాళము ల్డాయలో
దళము ల్బింకము చూపఁగాఁ గలువ లందంబొందెఁ గ్రొత్తావులన్. 159

చ. ఎఱుకలు దిద్ది కంధరము లెత్తి మొగిం జరలాట మున్నగా
బఱచుచు శీతవెన్నెలలు పారణసేయుచు మించి చంచుల

న్నలికినఁ జోనపుట్టి కిరణంపుఁగొనల్గాని మోము మోముతో
నిలిపియుఁ జేర్చి ప్రేయసులకిచ్చుచు నాడెడి వింజకోరముల్. 160

క. అసమయంబున వెన్నెల, బాసటయునఁ దోఁచి తోఁచి పార్థివమణిపై
నేసె మనోభవుఁ డెంతయుఁ, గాసిలి యెలదేఁటి యెక్కు కసులశరంబుల్. 161

గీ. మునుల మంత్రబలంబున దనుజభీతి, మార్గణవ్రణములబాధ మానెఁగాని
మానకెంతేనియును మేను మండఁదొడఁగె, సరసలీలఁ జిత్తభవమార్గణవ్రణములు. 162

మ. కుపితానంగశరాగ్ని దాహమున నాక్షోణీవిభుం డెంతయుం
దపియింపన్వెస నుగ్రభానుని మహోగ్రాంశుండంచుం జంద్రికా
తపమున్ముంచినఁ గ్రిందుమీఁ దెఱుఁగడై తాపంబు రెట్టింప నే
యుపచారంబున మానునో యిదియుం జూపించి చిత్తంబునన్. 163

సీ. మోహనాస్పదమైన బాహుశాఖలచేతఁ గమనీయకరపల్లవములచేత
కోమలనఖశిఖాకోరకంబులచేత విపులవక్షఃప్రసూనములచేత
సముపేతవర్తుల స్తనగుచ్ఛములచేత రమణీయదేహసౌరభముచేత
సంచారజస్వేద జలమంజరముచేతఁ జికురాంత మధుకరశ్రేణిచేత

తే. గలితమైన శకుంతలాకల్పలతిక. నీడ నొదుఁగకయున్న నేబాదనాఱుఁ
గుటిలసంకల్పసంభవ క్రూరపుష్ప, చాపశరజాలసంజాత తాపభరము. 164

ఉ. ఎత్తిన మన్మథాగ్ని నెవరేఁచెను తాపభరంబుఁ దీర్పఁగాఁ
గ్రొత్తవిరుల్మృణాళములు గొజ్జఁగినీరుఁ బటీరమో పునే
హత్తి శకుంతలాధరపుటామృతపూరము లూరుపుచ్చకేఁ
గుత్తుకబంటిగాఁ గడఁగి మారొక్కనికూర్కొని త్రావకుండినన్. 165

సీ. నలినాక్షి నను జూచి యలుకలూ పేర్చెనే దిరిపిప్ప నడవనే తేఁటినారిఁ
జంద్రాస్య నన్ను భ్రూసంజ్ఞ మన్నించెనే శిశువుల కొసఁగనే చెఱకువిల్లుఁ
గంబుకంధర నన్నుఁ గడకంటఁ జూచెనే జడ నేయనే పుష్పసాయకంబుఁ
గిసలయాధరి నన్నుఁ గెంగేల నంటెనే జిదుమదే కొనఁగోరఁ జిగురుఁగత్తి

తే. యేలయేఁపుచునున్నాఁడు హృదయభవుడు, నెలఁత యనునేను సమదృష్టినిలిచినపుడు
వేలుపోవును దాన యాకీలెఱుఁగఁడు, తెల్లవాఱంగవలెఁగదా దేవకృపను. 166

వ. అని యనేకప్రకారంబులఁ జింతాసంతప్తుండై శకుంతలామనోహరాకారంబు మనంబునం బెట్టుకొని పరబ్రహ్మంబు నవలోకించు పరమయోగిచందంబున భూకాంతుం డుండె నంత నక్కడ శకుంతలయును నాశ్రమవనాంతంబున. 167

క. అనికిం గరిపురనాథుఁడు, చనినది మొదలుగను జనుము సమకూతినదాఁ
కను నిష్టదేవతాప్రా, ర్థనముం జేయుచును దత్పరత వర్తిలుచున్. 168

గీ. జయముఁ గైకొని తన నిజేశ్వరుఁడు మగిడి, వీడిదలకు నేగనను వార్త వినుచు లలన
వినియెఁ గర్ణద్వయీ కటువిషమబాణ, ఝంకృతిస్ఫార శింజినీటంకృతములు. 169

చ. తలఁగఁగ నిచ్చు బెట్లు వసుధాపతి దారసమైన యట్టిచోఁ
దలరి మదీయశాసనముఁ దప్పుట యెట్లొకొ తాళ్మసంచుఁ దాఁ
జెలఁగి చెలంగి మానసము చిల్లులువోవఁగ నేసెఁ బాలిక
న్వాలవుల రాచజోదు ప్రసవంబులవేఁ సుగోర్విశోలలన్. 170

క. వాలికపూములుఁ గులుకఁ, తా కాలంబునఁ దోఁటియింపగంట్లును శేగం
జాలఁగ నురసినపుంఖులు, కోలలఁగాలకువనుకా శకుంతలకరయ్యెన్. 171

క. గణనకు ఘనమై మరుమా, ర్గణములు చిత్తజుఁడు గురియఁగా నారమణీ
మణిలేచి పర్ణశాలాం, గణమున కేతెంచి నిలిచి కనుఁగొన నెదురన్. 172

సీ. విరహులపైఁ జల్లవిషపుఁజూర్ణము నించి పట్టిన దంతపుంబరిణ యనఁగఁ
దెప్పించి పాంథులఁ దెగటార్ప శశికాంతశిల ఘటించిన వధ్యశిలయ పోలెఁ
గాంతాపరాధులఁ గౌముదిం దొడికింపఁ జెట్టిన పటికంపు బిందెయనఁగ
వెసవిరహులఁ దెగ వ్రేయఁబుల్గడిగించి నిలిపిన గండగొడ్డలి యనంగ

తే. ముదురవెన్నెల గిన్నెలముంచవచ్చు, కరణి నుత్ఫుల్లకాశసీకాశయగుచుఁ
దెల్లవాతి మధ్యందివాదత్యుఁడనఁగఁ, దనుశశిఁజూచెనా శకుంతలభయమున. 173

గీ. శంబరారాతి శరవహ్ని సైఁపలేక, పర్ణశాలాంచలంబుల బయలనిలువ
నెకలు దేహంబునందెల్లఁ జెఱచిపాఱె, నతివపై వడజల్లెఁ జంద్రాతపంబు. 174

క. ఉడురాజదీధితులఁ దివు, గుడుపడి తపియించుచును శకుంతలయుండెం
బుడమిజనంబులు వెన్నెల, వడఁదాఁకను మాట నిక్కువంబై యుండెన్. 175

వ. అయ్యవసరంబున ననసూయా ప్రియంవద లత్తలిరుఁబోఁడి మెత్తమెత్తన యెత్తు
కొనిపోయి క్రొత్తనెత్తమ్మి రేకులం గల్పించిన తల్పంబు సేర్చి శిశిరోపచారంబులు
సేయం దత్సమయంబున. 176

సీ. చనుదోయిఁ బొందిన జలజపత్రంబులు రవరవరజములై రాలిపోయెఁ
గర్ణావతంసంబు కలువలు కన్నీళ్ళనురసి రేకులు పట్టు మురిసిపడియె
నురము గంధంబు చిట్టుడుకువట్టినఁ బొంగి యందందమండ బేఁపులెగసె
హారవల్లికలుఁగా నమరించిన మృణాలకిసలయంబులు పచ్చి గిజ్జడయ్యె

తే. జిగిదలిర్చిన క్రొమ్మావి చిగురుఁబఱుపు, పెట్టు వెట్టినచందాన నట్టకట్టె
నగ్ని కాల్యాహుతులు వోసినట్టిదయ్యె, సకియవిరహానలమునకు శైత్యవిధులు. 177

గీ. కొమ్మ పికహాగ్ని వేదనకోలఁది యెద్ది, పదతలంబుల నిగిడించు ప్రసవరజము
మంగలంబున వేఁచినమాడ్కిఁ దెరలెఁ, జెక్కుసఖులకు నఱచేతఁ బొక్కలెగసె.

క. ఎంతెంత శిశిరకృత్యం, బంతంతయు విరహవహ్ని యధికము గాఁగం
గాంత తనచెలుల చిత్త, క్లాంతియుఁ బడుపాటుఁ జూచి కన్నీరొలుకన్. 179

గీ. మానవతులార యిన్నాళ్ళ చందురుఁడు కాఁడు, యింతనొప్పించినాఁడె నన్నెన్నడైన
నిండు వెన్నెల యను పేరి నేయి జల్లి, చంపుచున్నాఁడు చంద్రుండు చల్లజంపు. 180

సీ. తనరశ్మి నొల్లక తగువారిలో మను తమ్ములఁ జెఱచు పాతకుఁడు వీఁడె
చదువఁగాఁ బోయి యాచార్యుని కులభామ జడుపుచేసిన దోసకారి వీఁడె
హరిణాంక మను పేర నపరసంబగు నల్ల గుట్టు దట్టిన చెడుగొట్టు వీఁడె
పదునైదు దినముల బ్రతుకుకై పరివాని దిననాథు నాసించు తిరిపె వీఁడె
తే. తనదురాకఁ గ్రాఁగి కాతరతనొందు, విరుల బోరియలఁ డాఁగిన విరహిజనుల
చొప్పుఁబడి పట్టుకొని చుఱచుండ్లు చూఁడఁ, గుసుమబాణుని తెచ్చిన కొఱవి వీఁడె. 182

వ. అదియునుంగాక.

సీ. తనకు బాడబమహాదహనసంగతఘోరమకరాకరంబు జన్మస్థలంబు
తనసహోదరులు కాదంబరీనామ హాలా మహాభీల హాలాహలములు
తనశరీరముఁ బ్రోచుకొనుట తీవ్రకఠోర హరిదశ్వకిరణభిక్షాటనమునఁ
దనరుఁ సంతసపాంథజనహర్తృతాపిష్టి యంగహీనుఁడు కూర్మి సంగడీఁడు
తే. బద్మినికిఁ గీడొనర్చెడు పాపజాతి, చక్రవాక వియోగాగ్ని సామిధేని
విరహిజనములపాలింటి వేరువిత్తు, దురితములకాలవాలమౌ దుహినకరుఁడు. 183

వ. అని మరియు నిట్లనియె. 184

సీ. భద్రకాళీభర్త పదతలాహతి బల్లి పరవోలె నెపమారఁ బ్రామఁడయ్యె
దక్షకోపజమైన యక్షయవ్యాధి నిర్జీవిగా నాశిలఁ జేయఁదయ్యె
నమృతమంతయుఁ ద్రావి యంకసారంగంబు బింబమెల్లను నిండ బెరుఁగఁదయ్యె
నాచార్యుఁ డనకభార్యఁ దప్పినప్పుడు పాడుగఱ నీరంకు పాడువడఁదయ్యెఁ
తే. బ్రథమకళ యారగించెను పావకుండు, మీఁగడయుఁ బోలెఁ గడిచేసి మ్రింగఁడయ్యె
నేల యిటు సేయఁ బాంథులపాలవీధి, వనజగర్భుండు వ్రాసిన వ్రాఁతఫలము. 185

వ. అని యుపాలభించి యారంభోరువు కరాంభోరుహంబులు మొగిడ్చి మహాపరాధం

బుఁ జేసితివని యతఁడు మన్మనోనాథు వంశనాథుండు వంద్యుండుగాని నింద్యుఁడు
కాఁడని. 186

శా. స్వామీ చంద్రవంశావతంసుఁడు దుష్యంతుండు భూపాల చూ
డామాణిక్యము నీవుఁ దా మనుమ డౌట స్పష్టవాక్యంబు లే
లా నాతావు నీవు నే మనుమరాలం గాన మేలంబుగా
నాహాటల్వివు తప్పుపట్టకు మది న్మన్నించుగా రామునన్. 187

మ. జననంబొందితి దుగ్ధవారినిధి నా సర్వేశు జూటంబుపైఁ
జనుదెంచి పొద్దుఁ బ్రకాశసేయ నవలంబంబైతి నీ శ్రీమాధవం
బునకుం బాంధజనాపకారియగు నా పూవిల్తునింగూడి వా
గని దుష్కీర్తిఁ దిట్టునం బడకు చంద్రా రోహిణీవల్లభా. 188

వ. నన్ను మన్నించుమని యక్కన్నె వెన్నెల గాచవేలుపుం బ్రశంసించి నృశంసుం
డగు ప్రసవబాణు నుపలక్షించి. 189

సీ. వావిదప్పించితి వనజాసనుని యంతవానికిఁ గూఁతురు వలపుఁగలిపి
దోషంబుఁ బెట్టితి యిందునియంతవానికి గురుకళత్రంబుపై మరులుగొలిపి
బలుగోడఁ జేసితి పాకశాసనునంతవాని నహల్యకై వాసిచెఱచి
నెరసు వట్టితి పరాశరులంతవాని నట్టేటఁ బామరు కన్నెఁ గాటువఱిపి
తే. నీప్రతాపంబు లెన్ని యన్నికఁ దలేవు, లోఁడఁబడితి నాఁటదాన నీతో యమునను
నన్ను మన్నింపు దుష్యంతుఁ జొకుపుటంపు, మయ్య వెఱతును మదన జోహారు నీకు. 190

సీ. పాపకన్నెలు మేఁతపట్టి పో విడుమచో వెసగాడ్పు లెక్కలు విటిగానేని
గలకమామిడిపండ్లఁ గలజీడి మధుకరస్తోత్రంబు నాలుక ప్రొక్కనేని
జంపకప్రసవవాసనసోఁక రొలకోటి కూలి విజ్జనఁ దన్నికొనియె నేని
నిగుడు మేతఁల నొగలెక్కి కోకిలకును వడిలోమ్ము గడిపిలఁబడియె నేని
తే. దీయవిలు తీమగమి దొల్చితినియె నేని, బోదలునావేఁడియార్పులఁ బువ్వుఁదేరు
కమరెనే బట్టబయలగు గర్వరేఖ, విషమసాయక విచ్చేయు విడిదలకును. 191

వ. ఇట్లు బహుప్రకారంబుల మన్మథవికారంబులకుం గలాపంబులుగాఁ బ్రలాపంబులు
నెఱపుచు వాగురాయష్టి మృగయుండునుంబోలె భూపాలుండు తనపాలికివచ్చిన
భావంబు భావించుచు నయ్యాదిగర్వేశ్వరుండు నర్మగర్భంబుగా సఖిజనంబుల
తోఁటనాడిన సల్లాపంబులుండలంచుచు నాసింధురపురవరాధీశుండు గాంధర్వంబునం
దనుంగరగ్రహణంబొనర్చిన విలాసంబు లాసించుచుఁ గారాకుచప్పుడైన నప్పుడ

ప్పుడమి యని రాకఁ గాశంకించి డిగ్గన లేచి విప్ఫుల వలోకించుచుం గానక కళవళిం
చుచుం జింతాపరిక్లాంతిం గనుమూసియు మాయమి నన్ను రేంద్రచంద్రునిం గలం
గలయంగాంచి బయలు గౌఁగిలించుచుఁ గలవరించుచుఁ బలవరించుచుం గుందుచుం
బొరలుచుం జెరలుచు వగరుచుం గసరుచు నొగులుచుం బొగులుచుం గసరుచుం
గొసరుచు వేసరుచు నాసరుచు సమరనుచు నసురనుచు సొల్లంబొల్లంబోయి
మూర్ఛిల్లిన నప్పల్లవాధరిం గనుంగొని. 192

గీ. వరుస ననసూయయును బ్రియంవదయుఁ జేరి, యల్లనల్లన శిశిరకృత్యములు సేయఁ
గ్రమములో దుత వెడ వెడఁ గనులు దెఱచి, సమధికామోద తాళవృంతములు సూచి.

మ. విసరం జూడకుఁ డమ్మ పూపుసురటుల్ విభ్రాంతి మూలంబుగా
నసువుల్ బాపుఁ దదంతరాంతర నితాంతామోద హేలాలతాం
తసమాక్రాంత కృతాంతరూప పవమాన ప్రేంకణ ప్రక్రియా
వసరోదంచిత చారుసౌరభరసవ్యాలోల రోలంబముల్. 194

ఉ. నూదులఁ ద్రిప్పు చందమగుచు న్వెతపెట్టక యుండ నెచ్చెలు
ల్దూఁదులు వెట్టరే చెవులలోపల సంతతపాంథలోక హృ
చ్ఛేదులు మత్తరాజశుకభీషణ భాషలు బాలపల్లవా
స్వాదకషాయకంఠ విలసత్కలకంఠ కటుస్వనంబులున్. 195

గీ. తెల్లవారిన వెరవ నే జేవతలఁ, పల్లభుఁడు నన్ను రక్షింపఁ బచ్చుఁ గాన
భావజునిచేత నీలోనఁ బావకుండ, నరయఁడో యన్న నెచ్చెలు లతివఁ జూచి. 196

మ. వనితా యాతనిఁ బోలలేననెడు నీవంత స్మరుం డంతరిం
చు నిజంబప్పుడు వేల్పులప్పదవికి న్మోదించి పట్టాభిషే
చనముం జేయుదుఁ రక్షి నిన్నిట రతిస్థానంబున న్నిల్పి రూ
పున దుష్యంతనృపాలుఁ డర్హుఁ డగుటం బుష్పాస్త్ర పట్టంబునన్. 197

వ. అని సఖీజనం బుపలాలించు నయ్యవసరంబున. 198

ఉ. తోయజ పుష్పబాంధవుఁడు తూరుపుఁగొండకు రాఁదలంచె భూ
నాయకుఁడు న్శకుంతల మనంబలరం జనుదెంచుఁ దుమ్మెద
ల్మ్రోయకుఁడీ శుకంబులు నెలుంగులు సేయకుఁడీ పికంబులుం
గూయకుఁడీ ప్రమాదమని కూకలు వేసిన భంగిఁ గొక్కొరో
కోయని చిట్టుమోసెఁ దొలుకోడి నికుంజకుటీరవాటికన్. 199

వ. తదనంతరంబ. 200

సీ. కుముదంబు లర్ధముర్ధము మొగంబు మొగిడ్చె నర్ధమర్ధంబుతో నబ్జము విరిసె
స్యందనాంగంబులు వంతసంజరియించె నింతనింతఁ జకోరమీకలరికె
విధుకాంతశిల వెసవెసనీరిగిరి తీసె వెడసూర్యకాంతంబు వెచ్చనయ్యె
నసియించుకించుక దెసలయంచులవెల్చె నించుకించుకదివం బీరికెత్తెఁ
తే. దొలఁగిపోయెను కుముదబంధుద్యుతియును, దోఁపుచున్న సరోజబంధుద్యుతియును
శబలమై శ్వేతరక్తముల్ సంక్రమించె, సకలదిశలను బ్రత్యూషసమయమునను 201
సీ. కాలికోణాయు లాకాశసన్యాసి కంబరకపాలికులకు మర్లుజడలు
చిగురాకు బరకెలు గగనచూతమునకు వలఁతియూడలు వియద్వటమునకును
సటలంతరిక్షకేసరి కంధరమునకు జమలియాఁకలు నభశ్శాఖకునకు
రాగిమీసలంబు లభ్రకిరాతు మొగమునఁ బగడంబు లతలుడుపథపయోధి
తే. కనెడు సందేహచింతనం బావహిల్ల, యావక్రద్రవరేఖల యందమొంది
పట్టుసూత్రవితానంబుఁ బరిభవించి, యాకసముఁ బ్రాఁకెఁ దూర్పునరుణరుచులు.
సీ. ఒక్కింత వెన్నెలయూడ్చితీసినభంగి నుడుధీశుదిశకున్నై యోడిగిల్లెఁ
గమలిమించెడలిన కంచుటద్దమువోలె నస్తాద్రికటఁ జంద్రుఁడ స్తమిల్లె
జలను లూటలుగ్రమ్ము శశికాంత పాషాణనీలంబులీటారి నీరుదివియ
భానున్నతోపాషాణఫలకచయ్యంబులఁ గోకయుగ్మము కంతుగోష్ఠి నెఱప
తే. నబ్జగంధంబు తేఁటుల నాసతింపఁ, దికసుకలుఁగోని నాలుగుదిక్కులకును
విచ్చివిచ్చి చకోరము ల్వెళ్ళఁబాఱ, నల్లనల్లన తూరుపు దెల్లవాఱె. 203
క. అంతట బ్రాతస్సంధ్యా, సంతర్పణఫలముఁగాంచి సంయములకు ది
గ్దంతిగొని యెత్తివైచెనొ, యింతటఁ బడననఁగఁ బ్రాచి నినుఁడుదయించెన్. 204
ఉ. అంకిలిలేక చందిరకులాగ్రణి నేఁడు శకుంతలా మన
శ్శంకయుఁ దయ్యెడుం గలుగు శాత్రవమాకనితోడ నంచు మా
నాంకున శంగరతుకయి యామిని తోఁడొనరించినట్టి యా
మంకెనపూవు కేడె మన మందలయొప్పె మరీచిమాలికిన్. 205

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు దుష్యంతమహీకాంతుండు సంధ్యావందనం బా
చరిచి స్యందనారూఢుండై విడిదల వెడలి యవక్రపదక్రమ మహీసుర సమాహ
పఠ్యమాన వేదనాదంబుల నవిచ్ఛిన్నహూయమాన మహాగ్నిహోత్ర స్వాహాశబ్దం
బుల ముఖరితంబగు మఖవాటంబుఁ జేరవచ్చి నైకటికంబున రథావతరణంబు చేసి
యర్చిష్మత్తుల్యతేజులగు మునీంద్రులకుం గృతనమస్కారుండై. 206

క. ఎన్నఁటికిఁ జుక్కకెనరిచ, టున్నదభోజనులకయ్యె నపగతభయులై
జన్నముఁ గావింపుఁ డని, ఛిన్నముగాఁ జాల సంతసిల్లిరి పతులన్. 207

గీ. అంతనింతను నేనును నరసికొనుచు, సంచరించెదఁ దనిన నాసంయమీంద్రు
లనుమతించిన వీడ్కొని యాశకుంత, లా విహారవనాంతరస్థలముఁ జొచ్చి. 208

మ. కలకంఠధ్వనుల న్మదాలికుల ఝుంకారంబులం గీరభా
షల మందానిలరాకల న్పరిమళశ్లాఘ్యంబులై యొప్పు పు
ష్పలతాకుంజగృహంబుల న్విరహతాపం బద్భుతంబై శకుం
తల మున్నున్న ప్రసూనతల్పమునకుం దాఁ జేరి చింతించుచున్. 209

సీ. చెలువబాష్పముల విచ్చిన కల్వపూబంతు లందంద కన్నుల నద్దుకొనుచు
వనితయొప్పలవాఁడి నత్తుశైలసరోజముకుళంబు లొత్తిలి మూసికొనుచు
నావిధమై చెకదాకి యయలిసిన బిసలతావలిహారములఁ మేన వైచికొనుచు
రమణి డెందంబు వేఁడిమి మాఁడి మసిదైన తృప్పాడి మెయి నిండఁ బూసికొనుచుఁ

తే. బొలఁతి సంతాపభరమునఁ బొరలువెట్ట, నెండిరెుగు ఫల్లెఁబోయినయిగురుఁబాన్ప
మీఁదఁ బొరలుచు విరహాగ్ని నీఁదుకొనుచుఁ, జిత్తజోన్మాదవృత్తి నాక్షీతివసుంధ.

క. ఆచంద్రవదన రాకలు, చూచుచు నిట్టూర్పువుచ్చుచుం బానుపుపై
లేచుచుఁ బవళించుచు మతి, యీచందంబునఁ జరింపనింతటిలోనన్. 211

ఉ. పూని కరంబులం బొదవి బోఁటులు తోడ్కొనితేఱ మన్మథ
గ్లానివహించి చాలఁ గసుగంది శకుంతల ప్రాణనాయక
ధ్యానముతోడఁ గన్నులనె ప్రాణము నిల్పి శరీరమాత్రమై
తానటు కేగుదెంచె వడఁదాకిన చెందొవకాఁడ వైఖరిన్. 212

ఉ. వచ్చి లతాగృహంబు తలవాకిట బోఁటులు చెప్పమాపఁగ
న్వచ్చి మనంబులో వెలుపు నెయ్యముఁ దియ్యము దత్తరింతయు
న్మచ్చికయుం గుతూహలము మక్కువయుం దడఁబాటు నొందఁగా
నచ్చపలాక్షి చూచె లలితానన చంద్రుని మానవేంద్రునిన్. 213

క. భూతలనాయకుఁడును నా, శాతోదరిఁ జూచె సంతసము సంభ్రమము
న్ప్రీతియుఁ దగులును వలపును, గౌతుకమును మానసమునఁ గ్రొత్తరకలయన్. 214

వ. అయ్యవసరంబునఁ గన్యావరుల యన్యోన్యప్రీతియుం బరస్పరవిస్ఫురద్రోమాంచ
సంచయంబును నితరేతరకాతరతాదర్శనంబును మిథశ్శ్లథధీగతాభావంబును భావించి
చూచి యనసూయాప్రియంవదలు శకుంతలాదుష్యంతుల నేకాసనంబున నునిచి

యిట్టియేని మీకు నొక్క ప్రయోజనవ్యాజంబున నే కాంతం బిచ్చి యెడఁగలుగఁజని
రంభ భూకాంతుం గనుఁ బ్రియాముఖంబున దృష్టి నిలిపి కపోలంబుల నఖపాలు
నటింపఁజేయుచు. 216

సీ. రతికిఁ జేరియును జేరమిఁ బాసిపోవఁగా విధి సమర్చిన యూరివేర యొకటి
కదనంబులో గెల్పు కలదో లేదోయను సంశయోద్భవమైన జాగర యొకటి
వేమరు చూచినదాఁక నేమ మెవ్వారలచేతను వినరాని ప్రీతి యొకటి
యనుచితం బని రాత్రి చనుదేక నిల్చిన నామీఁది శోప సంతాప మొకటి
తే. వసువు రాజకాఁడు మన్మథుఁడు వచ్చి, రాత్రివల్లడిగాఁ జేయు రాయిడొకటి
తొలంగనిప్పించెనో యనా యింతి మనుచుఁ, గరయుగంబున బిగియారఁ గౌగలించి.

మ. కొంగరంగాంగను దేర్చి నెన్నొసటఁ జిక్కల్గొన్న నీలాల క
ల్పాసగం దీర్చి ప్రియంబొనర్చి సరవిం బూసజ్జపం దార్చి ము
న్గనుమూస్త్రారిపాతి సంభవంబయిన యాకం దాల్చి పొందార నిం
పెసఁగం గౌఁగిటఁ జేర్చి తేల్చె రమణిన్ హేలాసుఖాంభోనిధిన్. 217

వ. అయ్యవసరంబున. 218

సీ. శ్రవణసౌఖ్యంబుగా సాధుస్వనంబున మోలనాలాపించె నొకరి కేటి
మనసు కింపులు వారఁ మణితస్వనంబునఁ జెంత సల్లన విలసించె శారి
యొలనొక్క పలుకులఁ గులికి గుల్కి నటించెఁ గలికిరా తేనెలు చిలుకఁ జిలుక
యింపు పొంపిరిపోవ నింతవంతను నిల్చి పంచమశ్రుతిఁ బిసాళించెఁ బికము
తే. సమ్మదమ్మగ సురతశ్రమమ్ము దేలు, నంతమాత్రంబె తాలసె మందానిలుండు
తాఁకఁ బరిమళ మొకనాటి సోఁకనేసె, వలపుఁదూపుల మరుఁడు, భూవరుని సతిని.

సీ. అన్యోన్యసంప్రీతి నలవరించు మనంబు వలరాజు కూటటు గలుగదయ్యె
రమణీయనూతన రతిరహస్యములకుఁ గామశాస్త్రంబులు కడమలయ్యె
నుద్వేల మగుచుఁ జెల్లుబ్బెడు రాగవార్ధులు లేకమైనను దొంకవయ్యె
నితరేతరప్రీతి నెడలింపఁ దలఁచిన ధృతికి రాఁదెలిపి పిద్ధింపదయ్యె
తే. మమతలును దత్తరింతలు మక్కువలును, జొక్కులును గౌతుకములును సోలడములు
ప్రియములును గామకతలుఁ బబ్బిబ్బులుగను, సతియుఁ బతియు రతిక్రీడ సలుపునపుడు.

శా. పాలిండ్లన్న వనీలికా కలికలన్ బ్రాలంబముల్చేసి కం
కేళీపుష్మల రత్నహారములతోఁ గీలించి కర్ణంబులం

డాలొప్పారఁగఁ గర్ణకోరకములఁ జాటంకంబు లర్పించుఁ దా
నాలోలాక్షికి నవ్విభుండు నవపుష్పాలంక్రియా కేళికన్. 221

క. రేయి చకోరస్థితిఁ గవ, చాయక జక్కవల భంగి బగలు మిగులనై
పాయక రేయును బవలును, నాయకవనీపతి సుఖించె నతివయుఁ దానున్. 222

క. పొలయలుకలు ప్రియమైనవు, వలయుం బాయునని సూచువ భీతుండై
వలపోకైన కవుంశల, వలగింపఁగ నెఱచు దాను వలఁగఁగ నెఱచున్. 223

వ. ఇవ్విధంబున నవ్వధూరత్నంబుతోడి క్రీడలం దగిలి మునిసమాజసేవావ్యాజంబున నారాజగతిరాజు నిలిచి సారథిని రథంబుఁ గొనిపోవ నియమించి హేమంతకాలంబున యాగశాలలకుం బోవు నొక్కొక్కవేళ మందపవన పరిస్పందనంబునం గందు వం గని పండలయి యుండుందన వన్ను నిందిందిరంబులు క్రందుకొనం జెందిన మకరందంబునం బొందలు సవరగుమునింగనంది చలక్రింద నొక్కొక్కవేళఁ బల్లవంబుల సందులం దెల్లనం దెల్లంగొనిన విరులమొల్లంబుల నల్లంబు నలవరించుచు వల్లకులం బాణివల్లులు వెదచల్లు నుత్పల్లవల్లి కాంచల్లికా గృహంబుల నొక్కొక్కవేళఁ దావులఁ గ్రోవులగు తెమ్మెరతావులకతలం మూవనుల నీవలిం జెంగలించు తరులతావుల కేవలగు క్రొమ్మావుల క్రేవలను నొక్కొక్కవేళ గప్పటప్పటికి నుప్పతిలం జిప్పిలు పుష్పరసంబు చప్పరించుచు నుప్పరంబునం గొప్పరంబులెగయు దెప్పరంబుగ నుప్పరంతోలు, గొను షట్పదంబుల పదంబులం బడి దొప్పదొఱఁగు పుష్పాపీడం గదిసి మొక్కెపడి విప్పుం గల పరోవరంపు టిసుకతిప్పలను వేల్పుటుత్పల గంధి యుం దానును గంధర్వవర్వం బనల్పంబుగా వర్తింప నప్తమాత్రంబులగా నతి గాఢ్ర సప్తతంతువుం బరిపూర్ణంబయ్యె నంత హస్తినాపురంబున. 224

గీ. కాళికాముఖ నామరాక్షసపతికిని, దమపతికి యుద్ధమైనవిధంబుఁ గింవ
దంతి గా విని యంచితోత్సాహమునను, దంతిరథవాజిభటసముత్కరము గెరలి,

రగడ. లలితహృదయము తివిరి లంఘించునరదములుఁ
గులగిరుల నైన దీకొను మదద్విరదములుఁ
వెగలి యురవడి గాలిఁ దెగఁబాఱు వాజులును
సురరాజు సరివచ్చు చుట్టంపు రాజులును
దవిజగురుతోడ సుద్దికివ చ్చమాత్యులును
దవిలి సేవించు తొతలనాఁటి భృత్యులును
జాలు గలుగక నిల్చు సంధిసౌజన్యులును,

వేలుకొంతయును లేని విశ్వాసమాత్యులును
సమరసాహసు లగు సత్ప్రపాత్రులును
జెనుట నెత్తురుగాఁగ సేవించు మిత్రులును
వేఁటాడు పునుకలుగ వేఁపుగల సాదులును
మాటిదప్పక రేయము చొఱంపు జోదులును
కోరి గరువులు పెట్టికొలుచు జగతిపతులుఁ
బోరులకు ముఖరత్రై పొలుచు సేనాపతులుఁ
దొలు పోటు కయ్యమున దొడరు నాసీరులును
బలిమిమై జముసైనఁ బఱచు భటవీరులును
గలహవిక్రమశక్తికలితులగు పాయకులు
వలఘు బలసంపన్నులగు వంకనాయకులు
వసివర్మసంగ్రామసహాయు లగు పారకులు
వసమశాత్రవజయ సమర్థులగు దారకులు
గొండ లగ్గల సరకుగొనని పేరియాలును
దండిననుగ్గడిఁ బకులయిన కోయలును
మతివరా గణముఖ్యులగు మల్లరులనొంతురులు
నెఱబిరుదు శూరులును పెన కెవయు గొంటరులు
వీరాదిగాఁగల్గు వీరపరివారంబు
చాయుచి కొప్పొప్పు సమరశృంగారంబు
వల్లజల్లెపలతో నవగాగడవిభంగి
బల్లిసట్లంగడల ప్రభల బ్రమింగఁగ నింగి
పులికి సింగంబునకుఁ బుట్టువొందినకరణి
బలుపు పేవులు గల్గు భటుల బింకపుసరణి
మొనసి గుబ్బల కేడెముల ఘంటికలు మ్రోయ
మొవలముందటు సబళముల సాదనలు సేయ
వరిగ బిల్లల తాఁకు వళనుఘోషము దొరయ
బిరుపులో నడిదము లిప్పి రొమ్ముడొరు మెరయఁ
గోలతో విల్లుఁ దెగగొని తిత్తపేరెములుఁ
గాలుకోలందియుఁ బఱచు కదనప్రకారములుఁ
బొడ వెగుఱనైన నప్పుడవచ్చు కుంతములుఁ

దడయక కొత్తపుఁ బట్టి తగనిచ్చు పంతములు
వెలయఁ బొమిడికములును వెనుగపమ్మల జోళ్ళు
నెమికోఁ నొకఁడు పదురైతోఁచు పడవాళ్ళు
మొకలు చక్కఁగఁ గేర్చఁ ముఖరులై నడపింప
ఘనవాద్యనాదము ఘనఘంటపూరింప
మెంకుకొని కడిమి భూవిభాజనంబుల మాడ్కి
నిండి సేనాసమితి నేల యీనినమాడ్కి
సహితులకు గుండె లల్లాడంగ నంతంత
మహిత సైన్యము నిల్చె మాలినీనదిప్రాంత. 226

వ. విడిసిన పట్టిరుపడ నమాత్యసేనానాధులు భూనాయకుం డున్న యాగశాలకుం బోయి మునులకు నమస్కారంబులు చేసి సముచితప్రకారంబున జనవరు సమ్ముఖంబై నిలుచుండిరి. 227

క. మునివరులు రాజువదనముఁ, గనుఁగొని సైన్యంబు లెల్లఁ గదనవిధంబు
న్నేవివచ్చినారు తోడుగ, నెనయఁగ నీ సత్యజవము తెలుఁగఁ గసుమీ. 228

గీ. అనిన భూపతి వారితో ననఘచరితులు, ధరణిపతికీర్తినాకు నీఁదలఁచి యమ్మ
తీయశక్తి నాయందు వర్తింపఁజేసి, గెలుచుటలుగాక నరులు దైత్యులకు నెదురె.

క. మీకరుణ పెంపు నాకు న, శోకజయము గలుగు టెల్ల మీ కోకలత్యం
చేకొనతకీకుంబులు. మీకిగుకం బడిన నస్తమించు జగంబుల్. 230

సీ. ప్రసవసాయకునైన నొసలఁ గన్నాపిన నతి శాలఁ గన్నూపినట్టి మహిమ
యవతార మిషమున నవనిపై జనియింప హరి నీఁదఁ గినిసినయట్టి శక్తి
ధాతకు గుడిపూజ ధరణి లేకుండఁగ శాసించినట్టి యాజ్ఞాబలంబుఁ
జండాంశు రథముతో జగతిపైఁ బ్రేళ్ళంగఁ గన్నెఱ్ఱచేసిన గర్వమహిమ

తే. గల మహామహులకు మీకు గణనసేయఁ, గ్రవ్యభుక్కులనంగఁ జల్కాసిపురువు
లేను ధన్యుండ మాన్యుండ నిట్టికీర్తి, క్షితిని నెగడించి గారవించితిరిగాక. 231

వ. అని యత్యంత వినయవచనరచనలం బ్రీతులం జేసిన మునిముఖ్యు లా నృపముఖ్యుని దయాసుధామయంబు లగు విలోచనంబులం గనుంగొని. 232

సీ. నీవువచ్చిన మృగయావిహారం బది సమయంగ రక్షోవ్రజములకయ్యె
సర్వధూగతమైన యడిమీకు నహవాసరంబు నంచితధర్మరక్షణంబు

కామసంహారుఁడైన కాశ్యపమహానసత్త్రమున కాశిరమంత్రంబు వైతి
వరయఁ బరోపకారార్థ మిదం శరీరం బను వినుతవాక్యంబు నిదియె

తే. ధను మాదాక్షిణ్యమును నుపాదానములుగఁ, గనకగర్భుండు నీపుణ్యతనువొనర్చె
నీవ నిజంబోలుదువుగాని నిన్నుఁ బోల, జగతి నన్యులు లేరు దుష్యంతభూప.

సీ. ఆకాశకరులలో నైరావతము వోలె గ్రహములలోఁ దిగ్మకరుఁడు వోలెఁ
దోయాకరములలో దుగ్ధాంబుధి వోలెఁ దరులలోఁ గల్పపాదపము వోలె
విహఁగవర్గములలో వినతాసుతుఁడు వోలె గిరులలో మేరుభూధరము వోలె
విబుధవర్గములలో వృత్రశత్రుఁడు వోలె ఫణులలో శౌరితల్పంబు వోలెఁ

తే. తారకావళిలోఁ దివద్వంశకరుఁడు, చంద్రుఁడును వోలె నధిప్రశస్తిఁ గాంచి
సంశకమునందుని చక్రవర్తిఁ గాంచి, భువనవర్తి యను కీర్తి బొందు మధిప. 234

గీ. యాగసంగతమైన మున్నాక్షి యద్దుపెట్టి, యానిచితిమి నిన్ను నిన్నాళ్ల మనుజనాథ
వేటనచ్చుట గాని యీవిధ మెఱుఁగరు, దనుజయుద్ధంబుఁ గని జను లలఁతివారు

క. ఇచ్చట యాగ్రిమయమును, సచ్చరితుఁడ వీవు గలుగఁ జాగి ఫలించెన్
వచ్చి తడవయ్యెఁ బురికి, న్విచ్చేయుదుగాక జనులనేత్రము లలరన్ 236

వ. అని యాశీర్వదించి మంత్రపూతంబులైన హరిద్రాక్షతంబులు శిరంబునందుఁ జెట్టి యనుపఁ బ్రణామపూర్వకంబుగా వీడ్కొని వెడల కాశ్యపమహాముని కుటుంబంబు నకుం బోవవలయును మీకిచ్చట నుండుటది యని యమాత్యసైన్యపతుల నొక్కెడ నునిచి శకుంతల సముఖంబునకు వచ్చి. 237

సీ. చెప్పంగఁ జూచుఁ జూచి ముఖాంబుజము దెసఁ దప్పక చూచును జెప్పనోరు
పోక నిల్చు నుపాయములు మతించు మతించి చేర్పదేలేక నిట్టూర్పు పుచ్చు
నండరాని జెప్ప నూహించు నూహించి పురమున కనియర్ధమన నిల్చు
వననూయఁ జూచు బ్రియంవదఁ జూచు నా మేన కాత్మజఁ జూచు మీఁదుఁ జూచుఁ

తే. ధరణి దెస మోహలత యాడ్వఁ బురము వెసకుఁ
గార్యలత యీడ్వ రెండు వంకలకుఁ జనుచు
భావ్య మిది యని కార్య మేర్పఱుపలేక
నుల్ల మయ్యాలలూఁగ భూవల్లభునకు. 238

క. ఈలీల మనసు డోలాం, దోళనమై చెప్ప నాల్కతుద గదలింపం
జాలక తలిరుటాకున, వాలికనఖమున లిఖించి వనితకుఁ జూపెన్. 239

ఉ. అలిసిఁ జూచి చెచ్చెలుల యక్రమమెంచ బహిర్గమించి మూర్ఛతో
వ్రాలెను దంతి త్రెంచి ధరపైచిన తామరతూడుకైవడిన్
హాలహలా మణీయని ప్రియంవద దా ననసూయ బెగ్గిలం
గాలువలై నృపాలకుని కన్నుల నశ్రుజలంబు లొల్కఁగన్. 240

వ. ఏతత్ప్రకారంబునఁ గొంతవడి నిలిచి రంత నితాంతధైర్యశాలి యగు ననసూయ ప్రియంవదలం దెలిపి రాజుల సస్తరించి శకుంతల నల్లనల్లఁ దేర్చి యయ్యిద్దఱు వదన వదనంబుఁ గెంగేల నెత్తి సుధామధురవచనంబుల నిట్లనియె. 241

మ. పురికింబోయెద నన్న మాత్రమున నంభోజాస్య యిట్లేల కే
ధరణీనాథులు భూమిపాలనముచేతఁ గ్రన్నన క్రీడాపర
స్పరికింగొనియున్నఁ బూజ్యులగు నాశ్రీకోసలాన్యుఁడే
యరయంగా మెడఁబెట్టుకొంచుఁ దిరుగన్ పాలంబులే భామినుల్. 242

గీ. పోవుచున్నాఁడు నిన్నుఁగొనిపోవుచున్నఁ, డంతవట్టున నిజముగా సరసిజాననము
రమ్మనినఁ బోవుచున్నాఁడు రాకుచునిన, వచ్చుదినములు గణకులఁ దెమ్ముకొనుచు 244

వ. అని రాజుం జూచి.

చ. నగరము లజ్జగించి విపినంబుల రాజులు రాజనీతి నుం
దగవులు గాదు పోవుటలు ధర్మము నాపనియట్ల యుండనీ
తగులము పెంపు సయ్యనకుఁ దాల్మియు నెయ్యము నీవెఱుంగు దీ
మగువను నిక్క యొయ్యనఁ గ్రమంబునఁ గ్రమ్మఱఁ జూడవా నతీ కృపన్. 245

సీ. అనిన భూపాలుఁ డిట్లను సఖీమణులార నను బాసి నిమిషమైనను భరింప
నోపదు నేను నయ్యింతిఁ బాసి ముహూర్తమును నిల్వనోప నీ మృగాక్షి యుంగు
గాంధర్వవిధిఁ గరగ్రహమాటమును సమస్తమును ముని విజ్ఞానమునను దెలియు
మునుఁడు కాశ్యపుఁ డంపఁగాఁ గొనిపోవుట తగుఁగాని కాకున్నఁ దప్పువచ్చు

తే. నేను బోయిన యేనాళ్ళకిల తాంగి, వెనుకఁ బుత్తెంచి మీరెల్ల ననపరాగ
వైభవంబునఁ గొనిపోవవలయుఁ గాని, తెలుపరయినఁ గొడు నెక్కులకిద్దిచోటఁ 246

వ. కావునం బుట్టినింటినుండి యత్తవారింటికిఁ గన్నియలు వచ్చుచందంబున మునీంద్రుం డనుప వైభవంబునం గొనిపోయెదం గాన నంతకు నొక్కక్షణంబు లేకుండిన నా జ్ఞాచక్రంబు దొరకల్లువడు నిదశీల గావట్టి ముద్రాంగుళీయకంబు మీకు గ్రుమాథరి ధరియించుంగాకయని తన వ్రేలియుంగరంబు నొసంగి కురంగనయన యంగుళిం బెట్టి తొట్టకేలకు ననసూయాప్రియంవదలఁ బ్రియంబు చేసి యనిపించుకొని.

గీ. చిత్తమచ్చట మునికన్యచేతి కిచ్చి, దేహమాత్రంబు రాజ్యప్రతిష్ఠకొరకు
నాశ్రమస్థలి వాసి సైన్యాన్వితముగ, నమృతకరవంశకరుఁ డేగె హస్తిపురికి. 248

శా. హేమాద్రి ప్రతిదాన శౌండ ధిషణా హేలాసురజ్యేష్ఠ ది
క్సీమాక్రాంతనకేళి జాంఘికగుణా శ్రీలోలపద్మాలయా
రామామందిర నాగయప్రభుకుమారా శీతశైలాబ్ధివే
లాసధ్యక్షితిపాలమంత్రి మకుటాలంకార హీరాంకురా. 249

క. కంబుజలజాత జలధర, శంబ ధనుఃకలశ చక్రచాపాంకితహ
స్తాంబుజయుగ సల్లలితా, జంబూద్వీపావనీపసచివోత్తంసా.

స్రగ్విణి. భామినీ మన్మథా భాగ్యసంపన్నధీ, యామినీనాథరేఖావతంసాంఘ్రిపూ
జామలస్వాంత విద్వజ్జనాంతా సదా, స్వామికార్యక్రియాచారు నీతిక్రియా.

గద్య. ఇది శ్రీ భారతీతీర్థ గురుచరణ కరుణాలబ్ధ సిద్ధ సారస్వత
పవిత్ర గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర
పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శృంగార
శాకుంతలము నందు తృతీయాశ్వాసము.



శ్రీరస్తు

# శృంగార శాకుంతలము

## చతుర్థాశ్వాసము



హస్త ముకురలీలా
మోహనముఖపంకరుహ సముల్లసిత సుప
ర్వాహార మధురమృదుల
వ్యాహారఫణీంద్ర వెన్నయప్రభువంద్యా. 1

గీ. ఇవ్విధంబున దుష్యంతుఁ డిభపురమున, గరిగియుండఁ దదీయ వృత్తాంతమెల్ల
జ్ఞానదృష్టి విలోకించి సంతసిల్లి, కణ్వముని వల్లభుండు శంకరుఁ గుఱించి. 2

సీ. పాలితాఖిలహరిత్పాలకాది సుపర్వమండలుం డురగేంద్రకుండలుండు
సురదైత్యమకుట భాసురరత్నఘటిత సింహాసనుండు సరోజాసనుండు
కలికాలకల్మష కల్మాషభవబంధమోచనుండు కృపానులోచనుండు
కరివహుంకార ఘూంకార నిర్గతప్రాణ సువర్తి దేవతా చక్రవర్తి

తే. యంబికాభర్త యఖిలలోకైకకర్త, శంకరుండను భక్తలోకవశంకరుండు
అచిరకాలంబునంద ప్రత్యక్షమయ్యె నస్మదీయ మనోరథం బందియిచ్చె. 3

సీ. గిరిజావిభుండు ముంగిటి పెన్నిధానంబు కృత్తివాసుండు తంగేటిజున్ను
గోరాజగమనుండు గుజ్జుమామిడిపండు కుసుమాస్త్రహరుఁడు ముంగొంగుపసిఁడి
శీతాంశుధరుఁ డఱచేతి మాణిక్యంబు కద్రూజకటకుండు గాదెకొలుచు
కరటిదానవవైరి పెరటికల్పద్రుమం బసమనేత్రుఁడు సిద్ధరసము చెలచు

తే. విమలభుఁడు గాడిఁ గట్టిన వేల్పుటావు, హాటకాచలధన్వి సిద్ధాంజనంబు
పురహరుఁడు పెట్టెలోనున్న పరుసవేది, ప్రమథభర్త చింతామణి భక్తులకును. 4

గీ. అహహ యభ్యాసవేళ బాల్యంబునందు, వ్రాసిచదివిన యీయక్షరములచేత
వశ్యముగఁ జేయవచ్చు భావజవిరోధి, నేల యెఱుఁగరో యీమర్మ మితరజనులు.

క. త్రినయను జూడఁగవచ్చును, ప్రణవంబునఁ గూర్చికట్టి పంచాక్షరిచే
నణిమాది గుణస్థితిఁ బ్రణవ, కణములుగా నొసంగు మంత్రగతి మెట్టిన నా. 6

శా. ఆజ్ఞాసిద్ధికరంబు ముక్తిదము చిత్తానంద సంధాయి యై
యజ్ఞానాంకురసిద్ధబీజము ప్రభావప్రౌఢసంసిద్ధి యై
విజ్ఞానావిభవప్రదాయకము ముక్తి కారణం బూర్జిత
ప్రజ్ఞామూలము భక్తలోకమునకుం బంచాక్షరం బిమ్మహిన్. 7

గీ. అనుచుఁ బంచాక్షరంబు నాయ్యనఁ జపించుచు, గొనుచు నసురరాజశేఖరు గుడికి నేగి
యప్పరమూర్తికి భక్తిసాష్టాంగ మెరఁగి, కేలుగేలుదమ్ము కోడలఁ గీలుకొలిపి. 8

మ. హర సర్వేశ్వర శర్వ శూలధర నీహారాద్రికన్యామనో
హర మృత్యుంజయ కృత్తివాస యురగేంద్రా కల్పకందర్ప సం
హర కాకోలకళంకకంఠ భవ కల్యాణాంకకోదండ యీ
హరయంబారఘటించు పోయెడ మహీనా స్థానముం జేరఁగన్.

గీ. ఎఱిఁగి నిన్ను నుతించు వాగీశ్వరాదు, లైన దేవతలకునైన నలవిగాదు
ఎఱుఁగఁ జనికి వారునూ నేను నొక్క, సరియ కావున నభవ నీకరుణయారవు. 10

వ. అని యతియును సద్దేవునకు నమస్కరించి యాశ్రమంబునకు వచ్చి శకుంతలయిచ్చిన
యర్ఘ్యపాద్యంబు లంగీకరించి తత్ప్రదానంబునం జొడ్డ్కనిలిపి. 11

సీ. స్వాగతంబే నీకు సకియులకు వనసూర్యాప్రియంవదల కనామయంబె
వత్స నీమతి ధర్మవర్తినియై యున్నె యతిథిసపర్యాసమాభిరతిని
స్నానార్థినియమిత జలజాకరంబున బాలిక జలము రేపాటిగలవు
గ్రీష్మకాలంబిది యూవృక్షలవడదాకి పసిమి దప్పవుగదా పాదపములు

తే. రమణి సుఖమున్నదా మహాశ్రమమృగంబు, చెలులు వర్తింతురా నిన్నుఁ గలసి మెలసి
వత్సలతఁ గేసి గడుగారవమునఁ బెనుచు, నీగనజ్యోత్స్న యున్నదే నీలవేణి. 12

వ. అని యంతరాంతరంబుల యోగక్షేమంబు లడిగి కాలత్రయజ్ఞానశీలుండు సకలం
బును నెఱింగియు నెఱుంగనివాఁడ పోలె నమ్మెఱుంగుఁబోఁడి తెఱంగు తన్ముఖం
బున వినఁ నున్ముఖుండై యిట్లనియె. 13

ఉ. ఎన్నఁడులేని క్రొత్తసిరి నీ నెమ్ము నీవదనాంబుజంబు. మై
చెన్నును మాత్ర రేఖ విలసిల్లెను భావము లెన్ని యన్నియు
న్మన్నిటి భంగిఁ గాక కడు మోహనలీలలఁ గ్రాలుచున్న నీ
యున్న నిజంబు డాఁపుకొని యుంచిన నాపయి నానవెట్టెదన్. 14

గీ. అనిన గజగజవడఁకుచు నశ్రువారి, కన్నుఁగవరాల గద్గదకంఠయగుచుఁ
గొంతయును మాటువెట్టక కోమలాంగి, మునికిని విన్నపమొనరించె మునికిమునికి.

చ. విని యొలనవ్వుతోడ నరవింద నిభానన నిన్ను నింతగాఁ
జెనచిన నన్నొకింత విరిపింపక చేసితినీవు నర్హమాం

తుని ఘటియింపఁ జేయుటకు ధూర్జటిఁ గొల్వఁగ సోమతీర్థమేఁ
జననియెడ న్మనఃప్రియుఁడు చయ్యనఁ గల్గిన సంభ్రమంబునన్. 16

గీ. వనిత యనసూయయును బ్రియంవదయు నీవుఁ దనుని ఘటియించి పెట్టినవారు నీవు
వారు సుఖముండుఁ డొక్కఁడో వాఁడనయిన, యేను దీర్ఘ బులేగద నెంటికైన. 17

వ. ఇంక మా భోగంబు వాసి రాజపత్నివైతివి రాజ్యానుభవసుఖంబుల ననుమ్మ మఱి
వకట నీవరుఁ కిం జెప్పి యాశ్రమం బప్పటప్పటికి రాగద్వేషంబు లరయించుకొను
చుండుమనుచు యనుమ్మ యని యక్కొల్లనుము శిరం బూరంబునం జేర్చుకొని యానంద
యానందజలంబుల జలకంబు వార్చి భయంబుఁ దేర్చి యిష్టసల్లాపంబులు సేయుచున్న
సమయంబున. 18

మ. దళితక్రోధు లకించను ల్సములు మేధావు ల్సదా బ్రహ్మచా
రులు నీరాగులు నిత్యనిర్మలులు సర్మోహు ల్నిరీహు ల్నిరా
కులచిత్తు ల్నిగమాంతవేత్తలు విరక్తుల్భక్తి సంప్రేమము
ల్వేలయ న్వచ్చిరి కణ్వమౌనికడకు న్వృద్ధానుపూర్వంబుగన్. 19

గీ. వచ్చిన మునీంద్రులను గౌరవంబుచేసి, పెద్దపిన్నంతరవుల సంప్రీతి నునిచి
కుశలములు వేఱువేఱఁ దెల్పుకొనుచునడుగ, సరవిఁ జెప్పుచు వారు ప్రసంగగతిని.

క. అతిరాగ్రము సేయుటయుం గ్రతువిఘ్నకరుండు శాపికాముఖరక్షః
పతి వచ్చుటయును విభుఁ, పతిచేఁ జచ్చుటయు విని తపస్వులలోడన్. 21

క. సోమకులశేఖరుం డా, భూమీశుఁడు పేర్కొ యాగముంగాచి జయ
శ్రీరుచిమఁ బెంపుగం దయా, సోమకళాధరుఁడు నాకు సుముఖతనొందన్. 22

ఉ. పూర్వనృపాలకోత్తములఁ బోలెను హస్తిపురీవరుండు దా
గుర్వనురాగసంపద శకుంతలయుం దొడగ న్ఘటించి గాం
ధర్వవిధి న్వివాహమయి ధన్యతనొంది మదీయ యమ్మ దా
శీర్వచనాభివృద్ధి ఫలసిద్ధిఁ బ్రసిద్ధిగ నేగినాఁ డొగిన్. 23

క. విశ్వామిత్రతపూజను, విశ్వేశ్వరుఁడైన బ్రాణవిభుఁడు ఘటిల్లె
న్నాశ్వయుఁడు సోమతీర్థము, పేర్కొనుఁడిట నాప్రయాస మీడేతించెన్. 24

గీ. కాలకంఠసమానుఁడు గాధిసూనుఁ, డతనితనయకుఁ దగినచోటయ్యె వరుని
యన్వయము సుద్దిదెలిసిన యదియదైన, వినఁడు మునువిన్నవారును వినని వారు 25

సీ. జననసంస్థాన మెవ్వనికి మందాకినీనాథుఁడా అవసీంధునాయకుండు
నిజసహోదరు లెవ్వనికి దివ్యమణికల్పక శ్రీమదద్రేను కౌస్తుభములు
కావణంబెవ్వని కళలసంపన్నత యోషధివైభవాభ్యున్నతికివిఁ
దానకంబెవ్వని శానతామరపాదపంబైన యుభళుఁ పద్మసీమ

నవ్విభునకు నహుషుండు పుట్టె నా సుచరిత్రునకు యయాతినృపతుండు గలిగె
నా యశోధనునకు నక్షోధుండు పుత్రుండై ధాత్రీమండలం బేకచ్ఛత్రంబుగా నేలె
నా మూర్ధాభిషిక్తునకు దేవాపి జననంబొందె నయ్యుర్వీశునకు ఋక్షకుండు సాధుజన
రక్షకుండు సుతుండై. 35

శా. ఏలెన్భూభువనంబు సర్వమును దానేకాతపత్రంబుగాఁ
దోలెన్ వైరుల నెన్నదన్ని హిమవద్దుర్గాటవీవాటికిం
బోలెం బూరుఁ బురూరవున్న హుషుని న్భూరిప్రతాపంబునం
జాలెం దిక్కరిదంతపఙ్క్తులయశోజాలంబుఁ గీలింపఁగన్. 36

చ. అతనికిఁ బుణ్యవంతుఁడు దయానిధి విక్రమచక్రపాణి దా
మతిధరుఁ డుద్భవం బయి సమగ్రవిభూతి సరస్వతీతటాం
చితధరణీప్రదేశమునఁ జేసెను ద్వాదశవార్షికంబుగా
వ్రతముధరించి భూభువనవర్ణితవైభవసత్రయాగముల్. 37

ఉ. ఆహిమధామవంశజుని యందనురక్తి వహించి తా జగ
న్మోహిని యైన చారుతరమూర్తి వహించి సరస్వతీ మహా
వాహిని తానయిచ్చమెయివచ్చి జనంబుల చోద్యమందఁగా
గేహినియై సుఖించుచు నికేతమున న్వసియించెఁ బ్రేమతోన్. 38

వ. ఆమతిధరునకు నసదృశయశశ్వేదృశుండు సంభవించె నయ్యుంభినీవల్లభునకు సమగ్ర
యశోవిశాలుండు నీలుం డుదయించి: 39

ఉ. ఏలెను ధారుణీవలయ మెల్లను వైరము లేకయుండఁగాఁ
గ్రాలిన యన్యభూభుజులవంచి వశంబుగఁజేసి జన్నము
ల్వాలఁ నొనర్చె భూసురులు సంతసమందఁగ గీర్తనీయుఁడై
నీలుఁడు నిత్యకీర్తి గగణీకమణీయుఁడు మాన్యుఁ డెంతయున్. 40

ఉ. సంతతపుణ్యుఁ డానృపతిసత్తముఁ డుత్తరుపుత్రుఁ గాంచె దు
ష్యంతుని నిత్యనిర్మలయశఃపలితావధి భూధరాపర
ధ్వాంతుని వైరిభూవరకృతాంతు నితాంతకృపాసమంచిత
స్వాంతుని రూపనిర్జితజయంతుని సత్ప్రియభావనక్రియా
శాంతుని భూతిసద్గుణనిశాంతుని భూతలసద్వసంతునిన్. 4

వ. ఏతాదృశవంశకులాభిజాత్యంబుల శకుంతలకు ననుకూలదాంపత్యంబు దైవఘటనం
ఘటిల్లె నిది మీ యందఱకు మనోహరంబ కదా యని వాగలు కీర్తించి మీ పరి
గ్రహోన్నుగ్రహంబులు గలచోటికి దైవంబు సానుకూల్యత వహించుట యేమిచోద్యం

దుష్యంతమహీకాంతుండు శకుంతలా నామమాత్రంబును మఱచి రాజ్యానుసంధా
నంబు సేయుచుండ క్రమక్రమంబున. 51

క. ఇంతి యుదరంబునను దు, ష్యంతుని వీర్యంబు నిలిచి చాలఁగ నిరాగ
ర్భాగతబలీనాగ్ని క్రియ, న్నంతర్గతమై వెలింగె నభినవభంగిన్. 52

చ. నెలమసలెం దనూలతిక నిద్దము దోఁచెఁ గపోలపాళిక
ల్దెలతెల నయ్యె వెన్నడిమి లేములువాసె వళిత్రయంబును
గ్గులు విరిసె న్జవుల్చెడియెఁ గూఁకు నిద్దమునయ్యెఁ జట్టును
ల్పలుమఱుఁబుట్టె నొక్కకటిపై నుదయంబును బొందెఁ గోరికల్. 53

చ. కిటకిటనయ్యె వెన్నడుము కేసరిమధ్యకు నాఁడునాఁటికిం
బుటపుటనయ్యె నాస కనుబొల్పు వహించెఁ దనూలతాద్యుతు
ల్నిటనిటనయ్యెఁ బోలము జనించె విశాలవిలోచనంబులు
న్పటుపటునయ్యెఁ జొంపు గలవాతెఱ కెంపులు బూఁటపూఁటకున్. 54

మ. నవనాభీసరసిం బుగంధగన్పుసన్నాళంబుతో పీనమై
నవబంగారపుఁ దమ్మిమొగ్గ లొదవంగ న్పాని యగ్రంబులన్
దవిలె న్మత్తిలిపట్పదంబుల నదంబయ్యెఁ జూలంద వా
ధవశాబ్జాక్షికి నాఁడుఁ జన్నులును మీఁదం జూచుకద్వంద్వముల్. 55

సీ. ఉరుకీర్తి యగుమూర్తి యుదరంబులోఁ జాలు నిలిచి యున్నాఁడు మేనవేఁడు వాని
భువనభారవహుండు పుత్త్రుండు కడుపులో వృద్ధిఁ బొందుటఁ గడు బ్రేఁగునయ్యె
నవ్వాంగుఁ డగుపట్టి యంతర్గతుండౌటఁ జవులెల్ల నాగరకాచకములయ్యె
గమలాయతాక్షుండు గర్భస్థితుండౌటఁ జెలిమించువాలుఁగన్నులు జనించె

తే. ధరణి యెల్లను భరియించు తనయుఁడౌట, మోదము వెసదా నృదాస్వాదమునను
నవకమై యుదరంబు సనాభియగుచు, నభ్యుదయ మొందుచును వచ్చె నబ్జముఖికి

ఉ. శాశ్వతకీర్తుం దిశలు సారణ సేయఁదలంచు సర్వభూ
మీశ్వరభామినీజనము నెల్లఁ బరాగ్రాంగనిచ్చ గెలుచు నీ
విశ్వము సలుకొదివు ద్రేఁకటికోరుకులకు నాఁగ
రైశ్వరుఁ గుక్షిలోన ధరియించిన యట్టి మహానుభావతన్. 57

శా. మానం గర్భమునం ధరించి సుతతేజోరాజనం బెట్టిదో
ధ్యానం బెప్పుడు నాథుపై నిలుపు నాతన్వంగి నేఁబేల నే
తానై వచ్చినదాఁక నేమిటికిఁ జింతాదైన్యమంచున్ మదిం
బూనెం గర్వము తన్ను నేఁచు మదనుండుం బూవిల్లు మున్ద్రింపఁగన్ 58

కల్యాణంబు స్ఫురితంబుఁ జెందె ననివే స్థానాన్తరమాయల్మనో
శాల్యంబు బింకయును లేక కోవిదజను ప్రత్యక్షం బింకం బావనన్. 67

గీ. కొఱఁత లేకుండ విద్యలు నెఱవెఱిఁగి, పుత్రభాగ్యంబు గావని సర్వమైన
భాగ్యమును సత్యమును రాజసంబును, పెంపు సదను బాహుబలంబునుసదటుమిగుల

సీ. ముంజేల గరకాండములు చుట్టుకొని పవిత్రగడరాజంబుల దిగిచి తెచ్చి
కొనవెంద్రుకలు పట్టుకొని సంచరించిన సూనారనంబుల బట్టి తెచ్చి
వాలాగ్రముల మున్ముపైచి లాఁగిలను శార్దూలపోతకముల దోలి తెచ్చి
దొడ్డికట్టుగ నాఁగి తొలఁగి పోవఁగనీక యాచ్ఛభల్లములఁ బెల్లార్చి తెచ్చి

తే. కర్ణమూలంబు లురిమి లేఁగలను బోలె, సేసలంబుల నొండొండ యూన్చి తెచ్చి
దామెనలు గట్టి యాశ్రమస్థలమునందు, శైశవక్రీడ నాడు దుష్యంత సూతి 69

వ. ఇట్లు వన్యసాధారణంబు బహుసత్త్వంబుల నుగ్రసత్త్వంబుల నెదురులేక యేకచ్ఛత్రంబుగ బాలించుచు నా రాజసూనునకు గానవాసులు సర్వదమనుండను నామంబు వెట్టి ప్రేమంబు సేయుచుండ నొక్కనాఁడు కాశ్యపమునీంద్రుండు కుమారకల్యాణ దగు కుమారు నూరుపీఠంబున నునుపుకొని యుపలాలించుచున్న శకుంతలం గనుంగొని సంతోషించి తపస్వినుండై మధురగంభీరస్వనంబున నిట్లనియె. 7

క. తొలుపుట్టువు నీనోముల, ఫల మెట్టిదొ యనోజ్ఞపతిఁ బడసి సుతుం
గులదీపకుని గంటివి, లలితాంగీ చక్రవర్తి లక్షణయుక్తున్. 71

గీ. పెద్దకాలంబు చనియె నీప్రియుండు వాసి, తెలివరేలొకో పిలువఁబుత్తేర తడసె
వెఱచెనో మన్మథప్రీతి విఘ్నమొదవఁగ, మఱచెనో రాజ్యసుఖకేళి మగ్నమతిని

ఉ. నేరము లెన్నఁగోరిన గణించుట నేరము లట్లు వారిపై
నేరములైన యల్లురను నేరము లెన్నరు కర్తవారిపై
వారల నెల్ల నేరములు వంకలు దీర్పనె యుక్తమెల్లెడం
గౌరవహీను లిజ్జగతి గన్నియ నిచ్చినవారు కోమలీ. 73

గీ. రాజులట మీఁద వారలే మోజఁజపిన, భద్రగజములు నడచిన పదములవియ
లక్ష్యమై యుండునట్లు సాధ్వి నవు, నీవు ధవుని బెడబాసి యుండుట కిది తలఁపకుండుము

సీ. జీవితేశ్వరు బాసి చిరకాలవసతిగా బుట్టినింటనె యునికి బుద్ధిగాదు
పొరుగిండ్ల నిరుగిండ్ల ప్రొద్దువోకలకైన బలుమాటల నడుగుట పాడిగాదు
దాసీజనులతోడ దఱచుగాఁ గూడి ప్రస్తరమాటలాడుట తగవుగాదు
తనకంత యాప్తులైనను వృద్ధపురుషసంసర్గంబు సేయుట బాడిగాదు

సీ. వనితకు నెమ్మైనను జీవితేశుండు భావుకు ముంగొంగుపసిండిభర్త
సుదతికి నలిశేని చుట్టంబు పెనిమిటి తరుణికిఁ బ్రాణమిత్రంబు ధవుఁడు
వనజలోచనకుఁ బెట్టనికోటదయితుండు నాతికి నఖిలార్థదాత ప్రియుఁడు
కాంతకు మానరక్షకుఁ డింటియాతండు నలికి నారడిలేని హితుఁడు వరుఁడు

తే. కంబుకంఠికి శృంగారవిభవ, వల్లికకు నాలవాలంబు వల్లభుఁడు
పల్లవోష్ఠికి సౌభాగ్యభాగ్యలక్ష్మి, గణన యొనరింపనేల దేవతయ మగఁడు. 82

వ. అని ప్రసంగవశంబునం గొన్ని కులకన్యకాధర్మంబు లెఱింగించి యనసూయా
ప్రియంవదలు మున్నుగాఁ గొందఱు వృద్ధతపస్వినీజనంబులును జతురమతులగు సిద్ధుల
శిష్యులం దోడువెట్టి శకుంతలం దుష్యంతుపాలి కనుప నవకట్టి. 83

ఉ. పొమ్మనఁ జూచుఁ జూచి పదిఁబుట్టిన ప్రేమను పేర్మిబాష్పముల్
గ్రమ్మఁగ గ్రమ్మఱం బెనమొగంబయి కన్నుల నీరు గ్రుక్కుచుం
గ్రమ్మఱఁ దాళకుంతల మొగంబగు నశ్రులు నించుఁ గొంతసే
పమ్మని జాఱఁబోఁది ధృతియంతయు నిల్వక విచ్చిపాఱఁగన్. 84

ఉ. ఎంచమునీంద్రుఁడు విజితేంద్రియుఁడైన తపస్వి కూర్మిగా
పెంచి శకుంతలం బెనిచి విస్మృతినొందిన మోహపాశముల్
ద్రెంచుకొనంగలేక తియతీపులఁ జిత్తముఁ గాసిపెట్టె శి
లించిన నెవ్వఁడింక వదలింపఁగ నోపెడు పాశబంధముల్. 85

సీ. ప్రకటధారాశాకటోరంబైన కష్టాల క్రొవ్వాఁడి కొడవంటఁ గోయరాదు
కూలాయసోద్దామకుద్దాలములఁ ద్రవ్వి ప్రేళ్లతోఁ బెకలించి వేయరాదు
సమిదాజ్యముల నగ్ని సమకొల్ప దారుణశిఖలఁ గాలిచి నీఱు సేయరాదు
ఘనముష్టిఁ గలిశించి కపటపద్ధతిఁ బెట్టి తెగఁ జేతితోడఁ దీయరాదు

తే. హృదయ మను పాదులోపల నుదయమంది, తల్లిదండ్రులమీఁద సోదరులమీఁద
దనయ బంధుకళత్రమిత్రములమీఁద, మొలవఁ బ్రాకిన మోహలతను 8

వ. ఇట్లు బంధురంబగు మోహలతాబంధంబున నమ్మౌనసింధురంబు కట్టువడి ప్రకృతి
జనంబునకై వడి శకుంతలాభిముఖుండై

సీ. అత్తమామలకు నీయపనేని వెట్టుచుఁ గనుసన్నఁ జేయుమీ పను లెఱింగి
ప్రాణమిత్రములుగా భావించి యెప్పుడు సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్తయొక్కొకవేళ బహుమాన మొనరింపఁ గదియనీకుమీ గర్వరేఖ
పతి చిత్తమెఱిఁగి తత్పరిజనంబులమీఁదఁ జేయుమా మిగుల దాక్షిణ్యగరిమ

తే. కలఁక నొందకుమీ ధవుఁ డలిగినపుడు, పలుకులను జేరనీకుమా పరుసదనము
వీనివెలిగాఁగఁ దిరుగు సేవేఁడిదైనఁ, గులమునకు నాధియగుఁజుమీ కూఁతుగుత్తు

ఉ. నాపయిఁగూర్మి దగ్గుసుజనంబులపైనిడి మానినవ్యకా
స్థాపితవృత్తి బంధువనితాతతి యందు ఘటించి యిష్టస
ల్లాపములందు నిచ్చటఁ దలంపకనిచ్చలుఁ బ్రాణనాథసే
వాపరతంత్రవై యిటుల వన్నియఁ దెచ్చెదొ నాకుఁ బుత్త్రికా 89

ఉ. ఎన్నఁడు నాసుదినమ్మగు నేనిటుఁ బుత్త్రిక పూఁటపూఁట యా
సన్న సహోదరంబునను సంస్మరణం బొనరింప గంటిత
స్విన్న మరంద సిక్తసరసీజముఁ జూచి మదంతికంబునం
గన్నుల నీటితోడఁ గుశలం బడుగున్న భవన్ముఖాబ్జముం గా. 90

ఉ. కొంతసుఖంబునుంగలదు కోమలి నాకిటఁ బర్ణశాలికా
క్రాంతమునందు నీవు పెంపఁ బరువొందిన మాలతీలతా
క్రాంతమనోజ్ఞమైన సహకారముఁ గన్గొనుచుండ నెల్ల దు
ష్యంతుఁడు మాశకుంతలయు సంగడి నుండుటగాఁ దలంపఁగన్. 91

వ. అం ప్రేమాతిశయంబున లతాతరువితానం బవలోకించి. 92

సీ. అల పెంపుఁగొను తావకాలవాలములకు నెమ్మితో నీవొందఁ నీరువోసి
క్రమవృద్ధిఁ బొందు మార్గంబు లారసి వచ్చి పూఁటపూఁటకుఁ జాల బ్రోదిసేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకుఁ జిగురాకుఁ గోసగోఁ జిదుమవెంచి
పసపాటి నల్లన ప్రసవోద్గమంబైన సఖులు దానును మహోత్సవమొనర్చ
తే. తల్లివై పెంచి మిమ్ము నీకెలి గబోఁడి, యత్తవారింటి కరిగెడు నాలతాంగి
క్షితిరుహములార పుష్పితలతికలార, యనుమతింతురు గాక కల్యాణయాత్ర. 93

గీ. తోడునీడయుఁ బోలె నీతోయజాక్షి, పెరిగెనిన్నాళ్లు మీలోనఁ బెద్దయయ్యెఁ
బురుషునింటికి ననుపక పుట్టినింట, నునుచుకొనరాదు గావున ననుపవలయు. 94

వ. ఎట్టకేలకు ధైర్యంబుఁ గట్టుకొని శకుంతలం దోడ్తెచ్చి యగ్నిహోత్రంబునకు దం
డంబు పెట్టించి మునులకును నమస్కారంబుఁ జేయించి పుణ్యతపస్వినీజనంబులకు
మ్రొక్కించి తపస్విస్త్రీలాశీర్వాదంబులతోడఁ దానును దీవించి యనుపుటయుఁ దండ్రి
పాదంబులకుఁ బ్రణామంబు గావించి. 95

సీ. జనకుఁడుండెడు నవస్థానవేదికఁ జూచుచూచి క్రమ్మఱఁబోయి చూడవచ్చు
స్నానార్థి యుచిత జలజాకరముఁ జూచుఁ జూచి క్రమ్మఱఁబోయి చూడవచ్చు
నిజహస్తపోషిత కుజవల్లికలఁ జూచుఁ జూచి క్రమ్మఱఁబోయి చూడవచ్చు
గుంజకోటర కుటీరక్రీడవీథులఁ జూచుఁ జూచి క్రమ్మఱఁబోయి చూడవచ్చు
తే. దండ్రి, బాయంగ లేక సంతాపజలము, నత్తవారింటికేగెడు హర్షజలము
గోయనైక్యంబు వాలిండ్లుగొనలుదనుప, నెడపఁ దడపను బయ్యెదఁ దుడిచికొనుచు. 96

సీ. కచము నాలుకనూఁకఁ బదములు క్రమ్మతి తండ్రిపాదంబు లౌదలఁగూటించుఁ
గొంతిదవ్వేఁగ సెగుమఱచ్చి కణ్వుని కడుపులోఁ దలమోపి కౌఁగిలించు
నడుగుఁ గొండొకపెంటఁ దిరిగి మాసులకు మాయ్యాసుఁడే యని యప్పగించు
గమనించుఁ జెకవల్లి కాఁకృపుటంజాచి సేఁబోడుఁ దంచుఁ గన్నీరునించు

తే. జననుఁడు పలాయనము సేయు సంయమీంద్ర, భావులదలింప ననమాయ పట్టితిగువ
నిగిడి మునిగిడె నొకఁ దిరిగి మసిఁబసిడి, చూచుకొంచు శకుంతలాసూనగంధి. 97

క. మునిభాషలు ననునంకలఁ, ఇమకేలఁగ నిర్మలాత్మ పంగతియగున
య్యునిమిషనది రత్నాకర, మునకే గడు దిరిగి గదలిపోవుము నెసురకా. 98

సీ. కీరకోకిలశారికాంగపసుఖ్యాత బహిరంగణాగారశుభాసురంబు
దళదబ్జకైరవోత్పలమున కోపాంగనీరాగాధపరిఖాసమావృతంబు
స్ఫాటిక మణిశిలా ప్రత్యగ్రరచనాతివిస్తృత ప్రాకారవేష్టితంబు
శుభ్రరోచిరదభ్రవిభ్రమభ్రంకష బహువిధప్రాకారబంధురంబు

ఆ. గాంచిరంత మానినీకాంతాళకుంతల, లబ్ధి మేఖలాసమంచితాంఘ్రి
నూపురంబు నతిమనోజ్ఞకల్పిత రత్నగోపురంబు హాస్తినాపురంబు. 99

వ. కాంచి యనేకవారణతురగరథభటసేనాధిపచ్ఛత్రచామరాన్విత సత్ప్రకీసమంచిత వైభవంబులకు నాశ్చర్యాద్భుతప్రమదరసమగ్నహృదయులగుచు నల్లనల్లన యరిగి యప్పట్టణంబు ప్రవేశంబు చేసి రాజమందిరద్వారంబున నిల్చి తమరాక ఫణిహారుల చేతం బుత్తెంచుటయును వారునుం జని యా భూమిజయుం గాంచి కణ్వాశ్రమం బుననుండి యిద్దఱు శిష్యులు గౌతమీతపస్వినీజనంబు నుం దేవరకుం బొడసూప ననివచ్చి వాకిటనున్నవారని విన్నవించిన నన్నరనాథుండు మునినాథుఁ డిట్లు పుత్తెంచుటకు నెయ్యది కతంబో యని విస్మయాక్రాంతంబులు మనంబునం బెనం గొన సభాస్థలంబున స్త్రీజనులం బొడసూపంచుకొనుట యనర్హంబని యందఱ వీడుకొలిపి నగరిలోనికిం జని యంతఃపురాంతికంబున సెకాంత సౌధంబున నాసీనుండై మాన్యులగు వృద్ధకాంతలం బనిచి వారలరప్పించుకొని యుచితసత్కారంబులోన శృంగారముత్తై పురోభాగంబునం గాశ్యపశిష్యులు వారివెనుక సంయమిరాజకాంతలు వారిమధ్యంబునం గుమారరయుక్తరయై శకుంతల యునిలిచియుండి యయ్యెడ నాసంయమి శిష్యులు దుష్యంతు నాశీర్వదించి. 100

క. జననాథ మద్గురుండగుఁ మునినాథుఁడు మీసమీపమున కనిపెడుచో
దనమాటలుగా నీతో, ననుమననవి చిత్తగింపు మవధానమునీశా. 101

మ. లలితాఖేటరతన్మదాశ్రమము లీలం జొచ్చి యచ్చో శకుం
తల గాంధర్వమున న్వివాహమయి కందర్పాజ్ఞలోన న్మనో
త్కలికన్గొన్ని తిథుల్చరించి యటమీఁద న్రాజ్యరక్షా కుతూ
హలివై క్రమ్మఱఁ జిత్తగింపవ తదీయుంబైన వృత్తాంతముల్. 102

గీ. ఏమెఱుంగనిపనియని హృదయవీథి, మఱచెనో కాక మఱచెనో వెనుకఁ జింత
మఱపులేదైన బహుకార్యమగ్నమతులు, ధారుణీనాయకులుగదా దానికేమి. 103

క. మాసరసీరుహనేత్రక, నీసంగతిఁ బుత్రకుండు జనించెను నరక
త్రాసకరుండై వరక, త్రాసకరుండగుటఁ జక్రధరుఁడును బోలెన్. 104

సీ. కులము మేదినిమీఁద ఖిలముగాకుండంగ నభివృద్ధికారణం బాత్మజుండు
సౌఖ్యదంబైన సంసారద్రుమంబుల కాలవాల స్కంధ మర్భకుండు
జంపతులకు హర్షజలరాశి యుబ్బింపఁ బూర్ణేందుబింబంబు పుత్రకుండు
గృహమేధి ధర్మలక్ష్మికి వీఁపుమోపంగ వెనుపైన యాధార భిత్తిసుతుఁడు
తే. తనయుఁ డాలోకపథమున కనుపువాఁడు, మందిరాంతరదీపంబు నందనుండు
సూనుఁ డిలు వీటిఁబోకుండ సామ్యకర్త, యపరవయసున నాలంబయష్టి కొడుకు.

ఉ. కేవలపుత్రుఁ గాఁగఁ బరికింపఁగఁ జాలినవాఁడు గాఁడు దా
నీవసరాశివేష్టిత మహీతలచక్రము చక్రవర్తిల
క్ష్మీవిభవంబు నొంది పరిశీలనఁ జాలవసేయు సర్వధా
త్రీవరమౌళి రత్నఘనదీప్తి ధగద్ధగితాంఘ్రిపీఠుఁడై. 106

క. ఏణాంకవంశచూడా, మాణిక్యంబయిన నీకుమారుని సకల
క్షోణికి యువరాజ్యరమా, పాణిగ్రహణంబు బొనర్పు పరమప్రీతిన్. 107

వ. అని జననీసమీపమున నున్న భరతుం గొనివచ్చి సమ్ముఖంబు చేయించి యనసూయా
ప్రియంవదలచేత శకుంతల నంతికంబునకు రప్పించి. 108

క. జననాథ యిదె శకుంతల, యనసూయాదులకు నణుమాత్రంబై
నను వట్రుపడదు శీలం, బున నిర్వ్యాడ కింతి సనిచి పుత్తెంచుటయున్. 109

ఉ. సద్గుణశాలివైన నిను సంస్తుతిచేసి కుమారిఁ జూచుచున్
హృద్గతమైన మోహభర మేమని చెప్ప నృపాలచంద్ర యు
ద్యద్గళదశ్రువు ల్వరదలై వదనాబ్జము డిగ్గి పాఱఁగా
గద్గదకంఠనాళుఁడయి కణ్వుఁడు మౌనియుం బ్రియోక్తులన్. 110

క. జనయిత్రి కనియె నింతియ, జనసంఛాదిగ నితాంత సమ్మదమతివై
కున్నువాసరము శకుంతలఁ, బెనిచితినే ముక్తిబాలఁ బెనిచినభంగిన్. 111

సీ. మహనీయసంయమంబ మహాధనంబుగా మతియించి వర్తించు మమ్ము దలఁచి
యొసఁగ శాపానుగ్రహ సమర్థులైన బ్రహ్మయత తేజు గాధేయుఁ దలఁచి
గణవకొక్కిన దేవగణికాతతికి రత్నముకురమై వెలుఁగు మేనకఁ దలంచి
యాఖేటంతి వచ్చి యాశ్రమస్థలిఁ జదఁటాఁటు చేసిన చెల్లుఁ బడి దలంచి
తే. మిక్కిలిగ మన్నవయుఁ జేసి మెలఁపకలదు, తక్కువయుఁ జేయకలవసంతఃపురంబు
సతులలోపల సరయు కాసరవితోడ, నీశకుంతల భూకాంత యేలుమనియు. 112
గీ. అనిన సమ్మాటలకు నసహ్యంబునొంది, యొఱఁగుపైనున్న వాఁడు జెట్టులికి లేచి
కన్నులు మూసికొని శిరఃకంపమొదవఁ, దోలఁత హాకహాకహాయయందుఁ బలికపలికి.
క. మునికన్యకయఁట నేనఁట వనమున గాంధర్వమున వివాహంబఁట సూ
నునిగనెనఁట మఱచితినఁట, వినఁగూడును యిట్టిభంగి విపరీతోక్తుల్. 114
ఉ. కాయజవైరి సన్నిభుఁడు కాశ్యపుఁడాతని పుత్రినిచ్చ నెం
చేయుట యెట్లు కార్యసఫలసిద్ధి పొందుట యెట్లు ధిక్కృతుం
జేయుఁడె చంద్రమఃకులము చిన్నగు నన్నను వింతయుంత య
న్యాయపుమాట తీఁటనొనినం గొలువిం దలగోఁకికొందురే. 115
గీ. చదువనే మున్న ధర్మశాస్త్రంబు లఁట్రి. కామినీరతి కలుషంబుగా నెఱుఁగనె
యన్యపతిమాత్రమే కాశ్యపాత్మజాత, యరయ సంగాతకల్పితమైన ప్రతిమ. 116
సీ. గజరాజగామిని కంఠసూత్రంబులు కాలసూత్రంబులుగాఁ దలఁపక
పద్మపత్రేక్షణ బాహుపాశంబులు కాలపాశంబులుగాఁ దలఁపక
కోమలి పీనవక్షోజచక్రంబులు కాలచక్రంబులుగాఁ దలఁపక
యిందురాజవదన వృషూపదండంబులు కాలదండంబులుగాఁ దలఁపక
తే. కాలసూత్రంబు లెబ్భంగిఁ గడచునరుఁడు, కాలపాశంబు లేభంగిఁ గడచునరుఁడు
కాలచక్రంబు లేభంగిఁ గడచునరుఁడు, కాలదండంబు లెబ్భంగిఁ గడచునరుఁడు. 117
వ. నాహృదయంబు పరవధూసుఖంబునకు విముఖంబుగాని సుముఖంబుగాదు. మీర
లెచ్చటనుండి వచ్చేసితిరో యచ్చటికి జరుగుండు మీకునిదె సేవాంజలి యనిన
వారలువిని రహస్యప్రయోజనం బెఱుంగమింజేసి యొండొరుల మొగంబులు చూచి
కొనుచుండ ననసూయాప్రియంవదలు డగ్గఱి ధీరగంభీరస్వరంబున నిట్లనిరి. 118
శా. ఆహా లెస్సవిచారమే మొదల నీవాఖేటకేళి స్పృహా
త్సాహం బొప్పఁగవచ్చి యాశ్రమము నిచ్చం జొచ్చి యచ్చోట స
స్నేహప్రీతి శకుంతలం గలఁచి గాంధర్వక్రియాలక్ష్మి ను
త్సాహంబైన ప్రకార మంతయును నాత్మ న్విస్మరింబొందనే. 119

శా. వస్తుప్రాకారమతి న్నన్ప్రియములం గామధ్వాంతకాలు లక్ష్మీపా
విస్తీర్ణ నిత్యపమస్వభావు లిల శేషు ల్విశ్వాసహీనుల్ చల
చ్చిత్తు ల్దూరపగాఢకాంక్షులు బహుస్త్రీలోలురుల్ ప్రేరకా
యత్తు ల్రాజులనంగ వింటి వది సత్యం బయ్యె నీచేష్టనన్. 120

సీ. వెలఁగలనైనఁ బెన్నెటి వేణి వోఁపఁ దలఁకఁ జేరఁ నీవు తైలధార
బుతువుతఁగ్గైనచో జేహశుద్ధికనైన మైనాడనొల్లదు మజ్జనంబు
మాసికొనఁగాని మున్నగనైనఁగట్టు దుద్వాసించి శేలోకవల్కలంబు
ప్రాణరక్షార్థంబు పర్ణాంబుపుంజగాని మూతిముట్టదు కందమూలఫలము
తే. లెన్నిదివసంబులో నీవు తన్నుఁ బాసి, వాఁటనుండియు నీశకుంతల నృపాల
నేఁటివాఁకను నవసె నిన్నుఁ దలఁపుఁ, దీవ్రతరమైన విరహావేశ్రమలఁబు. 121

క. పరమపతివ్రతయగు నీ, తరుణీమణిఁ బాయనెట్టి ధైర్యము గలిగెఁ
న్వపుఁ దన యంతవచ్చిన, నరవర యెఱుఁగనని యెట్లు నాలుకయాడెన్. 122

గీ. గుణవతియుఁ బతివ్రతయును గులవతియును, నైనభామను విడుచునన్యాయకారి
కిహపరంబులు లేవనుచు సమిద్ధ, ధర్మశాస్త్రంబు లెఱుఁగవా ధరణినాథ. 123

ఉ. అద్దములోని నీడవలె నాకృతియందొక లేశమాత్రముం
బెద్దనుగాక నీకుఁ బ్రతిబింబము పోలె వెలుంగుచున్న నీ
పెద్దకుమారు భూవర యభిన్నమతి న్మొగమెత్తి చూడుమా
ముద్దియ నీపయిం గలుగు మోహము భక్తియుఁ గానవచ్చెడున్. 124

వ. అనిన నవ్వచనంబులకు రాజు కటకటంబడి మీర లాఁడువారలు మీతోడ నిట్టట్టు
నుటయుక్తంబుగాదు ఆశ్రమంబునకు నేఁడు పోవుట యొల్లి యెల్లుండివచ్చి కణ్వ
మహామునీంద్రుం గని తదాదిష్టమార్గంబున నడచెదం గాని పోఁడని దిగ్గనలేచి పెద్ద
మొగసాలకు వచ్చి సభామధ్యంబున నుండఁ గౌశ్యపశిష్యమానిమానవత్యనసూయా
ప్రియంవదలు శకుంతలాసమేతుల వెన్నడి తోడ్కొని తోడనవచ్చి యుచితస్థలంబున
నిల్పి రందు ననసూయా ప్రియంవదలు కోపపిహితేక్షణలై యంతరిక్షంబునకు
హస్తంబు లెత్తి మొత్తి సకలజనంబులు విన నిట్లనిరి. 125

సీ. దేవతలార యోదిక్పతులార నక్షత్రంబులార యోగ్రహములార
చంద్రార్కులార యోసప్తాంబునిధులార నదులార యోగోత్రనగములార
పరమపూరుషులార పంచభూతములార వృక్షంబులార యోపక్షులార
దిశలార యోనిశానిశలార పార్వతీశ్వరులార యోరమాచక్రులార
తే. జనునివృత్తంబు మీరెఱుంగనిది గలుగ, దీ శకుంతల మేలుఁగీడేర్పరించి
................ప్రకటముగఁ జేయుదురుగాక ప్రజలెఱుంగ. 126

మ. అనుమానాలోచన తత్పరాత్మజనము లత్యాశ్చర్యముం బొందఁ దో
జననాథోత్తమ యీశకుంతల మహాసత్యవ్రతాన్వీత త
త్తనయుండు స్వచవీయ వీర్యజుఁడు సత్యంబౌను తీ స్వర్గప
ననుమానింపకుమంచు మ్రోసె వడి నయ్యాకాశవాణీధ్వనుల్. 127

ఉ. ఆపలుకు ల్వెసన్వినుచు సాగ్రహవృత్తి శకుంతలాంగుళి
స్థాపితమైన యుంగరముఁ జయ్యనఁ జూడిచి మీఁదనైచె నా
పాపపురాజ యొట్లిదియు బాలిక ప్రేలికివచ్చెఁ జెప్పుమా
యీప్రజలెంతొ బనిచి రేగిన మూఁకతినన్న నచ్యుతర్. 128

సీ. విస్మయాక్రాంతులై వినువారు కొందఱు జగతీశు నెడఁ జాల జాలినడిరి
మహనీయమతి సధర్మంబు చేసితివి నీవని రమాత్యులు గూన్యులైనవారు
నృపతి నేమియు నననేర కూరక వృద్ధులును బంధువులుఁ దెప్పలాస్యకొనిరి
యాఱడి నోములయ్యెనుగదా యనకఁచు వెస శకుంతల వెక్కివెక్కి యేడ్చె

తే. నంగుళీయకభానూదయంబుచేత, నగ్రిసంభవశాపజంబైన నృపతి
మేనకానుతమీఁద నజ్ఞానమెడవఁ, గ్రమ్మకొనియున్న విస్మృతీకతమునిరి.

వ. అయ్యవసరంబున. 130

సీ. విశ్రామగతి వేఁటవెడలిన చందంబు మునిజనాశ్రమము చొచ్చినకౌతుకంబుఁ
దటినిషేచనవేళఁ దాఁజేరినవిధంబుఁ గణ్వాంతనఁ జూచుగనినర్తి
యన్యోన్యసంప్రీతి గలరిన లాలిత్యమును నిరహాగ్ని వేఁగినవిధంబు
గాంధర్వవిధిఁ గరగ్రహణమందిన జాడ యచ్చోటు సంగమంబైన భంగి

తే. గమనవేళ వియోగప్రకార మింత, నట్టి భావంబులు గను మోహమ్ము కొనుచుఁ
గూడియే తెంచిమనసుతోఁ గుప్పగొనిన, వాహ్యాధరమోహవశమూర్ఛ ప్రముగ్ధవిభుఁడు.

గీ. అల్లనల్లన తెలిసి ధైర్యంబుఁ దూఁది, చక్కఁగూర్చుండి తలయెత్తి చి ముకుమీఁద
వ్రేలుఘటియించి మిగులఁ గ్రొవ్వేఁడి మొనవ, దట్టముగ దీర్ఘనిశ్వాసధారనలెసె

సీ. అత్యంతకుపితాత్మలై తన దిక్కుఁ జూచు ప్రియంవదను నవసూయఁ జూచి
కన్నీరుమున్నీరు కాలువలై వెల్లిగొనఁజేయు మేనకాతనయఁ జూచి
యవయవశ్రీఁదన యచ్చొత్తినట్లున్న కులదీపకుఁడైన కొడుకుఁ జూచి
నామాంకరప్రమాణదింబునఁ బేరగిరవున్న ముద్రయుంగరముఁ జూచి

తే. ద్రష్టలెన్నఁడు మంత్రివర్గంబుఁ జూచి, ధర్మముడిగితి పనెను మిత్రములఁ జూచి
పలుదెఱంగుల నాడెడు ప్రజలఁ జూచి, తనమనజ్ఞా ప్రకారంబుఁ దలఁచి చూచి. 133

శా. ఆచంద్రాన్వయసంభవుండు మృగయావ్యాపారమున్ బుద్ధినా
రాచప్రేరితుఁడై శకుంతలను ధర్మస్వాంతము ల్సాక్షిగా

కావానిష్ఠకరంబు లిచ్చుటయు సర్వంబు స్వధర్మంబుగాఁ
దూచా తప్పకయుండఁ జెప్పె నిజబంధుల్మెచ్చ నాప్తుల్ప్రియన్. 134

గీ. కొడుకు నాయంతవాఁడయ్యెఁ గడునెదిగెను. దేహమాత్రంబె దిక్కు నాధేయతనయ
తలఁపుకేకింత కాలంబు నిదయుఁ బెట్టు, తెలియకిచ్చిన సత్యంబు ననుచుఁ బెట్టు. 135

సీ. గణనాధికముగ యాగములు గావించినఁ బాయునే యా మహాపాతకంబు
చతురబ్ధిమధ్య భూస్థలి దానమిచ్చినఁ గడచునే యిమ్మహాకల్మషంబు
సప్తముక్తిప్రదేశములు దర్శించినఁ దొలఁగునే యమ్మహాదుష్కృతంబు
కన్మహాకేశ్వరాగ్రహం బెక్కి పడినను గడయునే యిమ్మహాకిల్బిషంబు

తే. ధర్మపథవర్తులిట దనుఁ దలఁచినపుడు, కర్ణములు మూసికొని దూరములని చనరె
పలుకులేల యాసత్యవాదులకునెల్ల, మర్త్యనై నేను యాగ్రగణ్యుఁడనైతి. 136

వ. అనుచు నిందానురూపంబు లగు ప్రలాపంబులం జనుచున్న యవసరంబున. 137

సీ. కర్పూరకనకపరాగవిపాండురకను కాంతి యశోకనాయకచంద్రికలు గాయ
వికటాక్షమాల వల్లికలాదయు పెద్దమకుటంబు శిరమునందు చిరుగనీక
హరిణాజిరోత్తరీయచ్ఛాయ బ్రహ్మతేజః కృశానునిహారచాయ నెరయఁ
గుటిలహావిర్మషి కజ్జలలామంబు నొసలిపైఁ జిట్టి నూగువార

తే. కనకగానసమ్మజుఁ డవలికాక్షు, శంకరుం డచతుర్భుజ చక్రపాణి
యఖిలలోకైక సంపూజ్యుఁ డరుగుదెంచె, నారదుఁడు కాంతిజితశరన్నీరదుఁడు

క. చనుదెంచిన మునిపతికిం, జనపతి యెదురేగి వినయసంభ్రమముల న
ర్చనలొనఁగ సముచితాసన, మున యం దుపవిష్టుఁడై ప్రమోదముతోడన్. 139

వ. రాజు వదనంబునం జూడ్కి నిలిపి యుచిత యేల పంక్తిహానసుందరై యున్న
వాఁడవు నీ స్వాంతాం బత్యంత నిర్మలంబు నీపై నొక దోషంబుఁ గలుగనేర్చునే
ఆశ్రమంబునుండి నీవు పురంబునకు నరుగుదెంచునెడ భవదీయ విరహాక్రాంత
యైన శకుంతల దూర్వాసమునీంద్రుండు వచ్చిన నుచితసత్కారంబులు సేయ
నెఱుంగకున్న నలిగి యిచ్చిన శాపతిమిరంబు విచ్ఛిన్నంబగా నీదయ్యి ముద్రికా
దర్శనంబున శాపావధియుం బ్రసాదించెనని తద్వృత్తాంతం బాద్యంతంబునుం దెలి
యంజెప్పి, చిత్తంబు నుత్తలంబుడిచి కుమారునిం జూచి యీ శకుంతలుండు సకల
మహీచక్రంబును జక్రవర్తియై పాలించు భవద్వంశంబు నితని పేర భరతవంశంబనం
బ్రసిద్ధిం గాంచు నితని యువరాజుం జేసి శకుంతలయు నీవు ననేకకాలంబు దాం
పత్యసౌఖ్యం బనుభవింపు మనినం దదనుశాసనంబున. 140

సీ. మునిభామినులతోడ వనమాతృకలతోఁ బ్రియంవదతో శకుంతలయు వనజవదన
నంతఃపురంబున కరిపిన బలిపూజ్కఁ బరిచారికలు భయభక్తులలర
జడల యల్లికలూడ్చి సంపెంగనూనియ శిరసంటి సీకాయ జిడ్డు విడిచి
గంగాంబువుల జలకంబార్చి తడియొత్తి నవనీయ చీనాంబరములు గట్టి
తే. చంద్రకుకళు చికురవాపి క్రొవ్విరులు చుట్టిమి, పలుచగా మేనఁ జందనపంకమలఁది
యవయవంబుల కన్నాంబుతైవనంగ లలితమణిభూషణముల నలంకరించి. 141

చ. ఇటుఁ బ్రభావిలాస మొర విచ్చినదో యన మేనఁ బొల్చు నా
తరుణి భూషణద్యుతివితానము క్రమ్మఁగఁ గ్రొమ్మెఱుంగు చా
ల్పున నడ నేర్చు చిత్తరువు పోలిక బుత్తడిబొమ్మ భాతి హా
హావగతితోడ మంగళప్రహాంబునకుం గొనివచ్చి యచ్చటన్. 142

గీ. హేమపీఠంబుమీఁద నయ్యింతి నునిచి, రాజునకు విన్నవింప నారదపురస్స
రంబుగా వచ్చి శుభముహూర్తంబునందు, ననితకల్యాణవాద్యఘోషములు చెలఁగ.

క. నరపతి ప్రమోదరస స, ద్భరితుండై తనదు నగ్రమహిషిం గాను
స్థిరమతితోడ శకుంతలఁ, బరువడి ప్రజలెల్ల మెచ్చఁ బట్టముగట్టెన్. 144

గీ. ఇంతిఁ బట్టముగట్టి యనంతరంబ, తనదు దుహంబు పెట్టిన తనయుఁ గ్రుచ్చి
బిగియఁ గౌఁగిటఁ జేర్చి సంప్రేమఁ జేసె, మానితానందజలముల మజ్జనంబు. 145

సీ. సచ్చందనముకంటెఁ జందనంబునఁ గలపంబుచేసిన కప్పురంబుకంటెఁ
బుప్పొడికంటెఁ బుప్పొడిలోనఁ బొరలించి వెలచిన చెంగల్వ విరులకంటె
హిమజలంబులకంటె హిమజలంబుల నాన వైచిన బిసపల్లవములకంటె
నిండువెన్నెలకంటె నిండువెన్నెలచేతఁ బదనైన చంద్రబింబంబుకంటె
తే. నెరయఁ జూర్చినవీని యన్నింటికంటె, నినుమడించు ముదమ్మడియు నైన మనుజవిభుని
యుల్లమెల్లను మిగులఁ గఁజల్లఁ జేసె, నందనాలింగనమున నెన్నొందు సుఖము. 146

వ. ఇట్టిలుఁగునఁ బుత్రాలింగన సంగసౌఖ్యంబున నానృపాలపుంగవుండు కొంతతడవు తన్మయత్వంబు నొంది యనంతరంబ శతానంద నందనానుమతంబున నందనుని యువరాజపట్టంబుగట్ట సమకట్టి యమాత్యులం బిలిపించి సముచితాసనంబుల నునిచి తత్సానసంబులం బ్రసన్నావలోకనంబులు నిలిపి మధుర గంభీర ధీరస్వరంబున నిట్లనియె. 147

ఉ. ఏరితి నేను భూభువనమెల్లను వైరములేక యుండఁగా
వ్రాలిన భూమిపాలకుల వంచి కరంబులు గొంటి జన్నము

ల్పాల నొసర్చితిఁ బ్రజలు సంతసమందఁగ బంధుకోటిచే
మేలనిపించుకొంటిఁ దగుమీఘననీతిబలంబు పెంపునన్. 148

గీ. నావ మీనీతిపదవు సుశ్రీకి నెలవు, మంత్రిలేకున్న రాజ్యంబు మనుజపతికిఁ
బెక్కుపదియొంత గలిగిన బీరకాఁడు, లేని పేగొడ చక్రంబులేని రథము. 149

క. కావున మీఘనబుద్ధి శ్రీవిభవం బూఁతగాఁగ నేమాహీపుల
గ్రావశిరోభేదితం బగు, భావలయము భరము నేను బూనితిఁ బేర్మిన్. 150

గీ. పెద్దవాఁడనైతిఁ బృథివీభారంబికఁ, బూనఁదగను గాదు పుత్రుఁ డెల్ల
భరముఁ బూనఁగాఁ దపస్వినై సుఖలీల, వనమునందునుండ వయసు గాని. 151

క. లక్షణయుతుఁగా భరతుని, వీక్షింపఁ దస్మాఁడమ్యోనేఁ గావింపం
దీక్షితి యువరాజ్యగమా, ధ్యక్షుండై రక్షసేయ నభిషేకంబున్. 152

క. నావుడు వారలు విభుతో, భూవర భవదీయవాక్యములు మాకానం
దావహములు నీతనయుం, డీవిశ్వము నేలఁజాలు సిద్ధవిధూళిన్. 153

సీ. ఆయతలోచనుం డాజానుబాహుం డుగశరీరుడు కవాటవక్షస్స్థలుండు
కోమలజఠరుండు గూఢజత్రుండు విశాలఫాలుఁడు వృషస్కంధధరుఁడు
కఠినహస్తతలుండు కమఠోపమానాంఘ్రి యుగ్భిరామశరుఁడు మహోన్నతుండు
చండాంశుతేజుండు సంపూర్ణపూర్ణిమా శశదిందుబింబ భాసురముఖుండు

తే. నీతిమంతుండు గాంభీర్యనిధి వివేక, మహితమూర్తి యలోకసామాన్యబలుఁడు
నీతనూజుండు పెంపున నిన్నుబోలుఁ, గట్టుపట్టంబు యువరాజుగాఁగ నధిప. 154

వ. అని విన్నవించు మంత్రుల వాక్యంబులకు సంతసిల్లి పురోహిత హితభృత్య బంధుమిత్రాది మాన్యజనంబుల రావించి సంభావించి తానుగావించు ప్రయోజనం బెఱింగించి మంత్రుల సమ్మతంబునఁ బ్రజల యనుమతంబునఁ గార్తాంతికోపదిష్టం బగు శుభముహూర్తంబునఁ గార్తస్వరభద్రపీఠంబున గుమారు నలంకరించి యునిచి.

చ. అనఘులు భూరుణీసురు లభ్యుదయమంత్రము లుచ్చరింప నో
భనకరవాద్య ఘోషములు బంధురభంగిఁ జెలంగ సర్వభూ
జనములు సన్నుతింప విలసన్మతి బంధులు సంతసింప శ్రే
కని విభవంబు పెంపెసఁగఁ గట్టె సుతు న్యువరాజ పట్టమున్. 156

మ. తనయుం బట్టము గట్టి యెందము ప్రమోదం బందఁ బంకేజ భూ
తనయుం గన్గొని కేలుమోడ్చి మునివేదండా భవచ్ఛాసనం
బున నాకుంతలు యౌవరాజ్యపదవిం బొల్పారఁగా నిల్పితిం
జనతాపాలన హేతునీతి నుపదేశం బిమ్ము నీవిమ్ములన్. 157

క. అని నిజనందను సజనం, దను చరణంబులకు వందనము సేయింపన్
మునిపతి సంతుష్టాంతరుఁడై, జనపతి నాశీర్వదించి శాకుంతలునిన్. 158

వ. గాఢాలింగనంబు చేసి సమీపంబున నునిచికొని తదీయ చరణ తదీయ వదనార
విందంబులం జూడ్కి నిలిపి యిట్లనియె. 159

సీ. మణుల గద్దియమెట్టు మండలేశులు గొల్చుచుండఁ బెంపునఁ గొలువుండునపుడు
సౌధాగ్రవీథులఁ జంద్రశాలలయందు చెలువలతో వినోదించునపుడు
గీతవాద్యకళా వినోదన సుఖగోష్ఠి నిచ్చమైఁ దగఁ బ్రొద్దుపుచ్చునపుడు
రాజపూజ్యులైన రాజభోగంబులు కొలుకు గాకుండ భోగించునపుడు
తే. వసుమతీరక్షయందు మానసము నిల్పి, లలితసప్తార్ణవీమేఖలాధరిత్రి
నెకపురిఁ బోలెఁ బాలించె నింతకాల, మనఘు మీతండ్రి వినుము దుష్యంతవిభుఁడు.

క. మీతండ్రియట్లు నిర్మల నీతిపథంబున జరించి నిజభూప్రజకుం
బ్రీతియొనర్చుచుఁ బొందుము, ప్రాతఃపాండురపయోజభాసురకీర్తిన్. 161

గీ. నీతిపథమున మతి నెంతనీక పూర్వ, రాజచర్యకు నతరత్వాత ఘటించి
వసుధఁ బాలింపు తగులకు వ్యసనములకు, వ్యసనికగు చందములు వినువయ్య వత్స.

సీ. మొదలనర్థవ్యయంబునకు సుత్తిగ పెట్టుబెట్టి జీవనముపైఁ బ్రీతివిడుచు
విడిచి యసన్మార్గవృత్తికిఁ జేచాఁచుఁ జాఁచి యాచారంబు చౌకసేయు
చేసి దుర్జనులగోష్ఠికి మానసముఁ జూర్చుఁ జూర్చి ప్రాభవలక్ష్మిఁ దోలఁగఁ ద్రోలుఁ
ద్రోలి భూగ్రస్థితి మేలుగాఁదలపోయుఁ బోసి యన్యాయంబు పాత్రుసుడుచుఁ
తే. గుడిచి బంధులకడయగుఁ గులము వాయు, జైసెపోకాచ్చుకొనుఁ బాపపంకనిపాతి
గూలుఁ గాల్జాటి నారకకూపమునను, సంతతశ్రీగతుండు దుష్యంతతనయ. 163

సీ. ఆహారవేళ శయ్యాగతి నంతఃపురాంగనాకేళి సౌఖ్యములు దొఱఁగు
గెలుపోటములు రెంటివలన నుత్సాహదైన్యములఁ జిత్తము ప్రీతినొందదెపుడుఁ
దమియు మత్సరము డెందమునఁ నంతకుఁ బొడమి కానఁడు ప్రొద్దుపాడుపుఁ గ్రుంకు
నెకసాయమైపందెమెక్కించి యోడెనే గలధనంబెల్లను బోలిసపోవుఁ
తే. గెలని నోడించువిధముఁ దా గెలుచువిధముఁ
దలఁచుకొనుచును రాజ్యతంత్రంబుచాఁగు
రీతిఁ గోల్పడి యంచితఖ్యాతిఁ బాయు
నెడపనొప్పదు జూదంబు నృపకుమార. 164

సీ. పోశంబు పశువులఁ బొరఁమ ఖేదంబున దగగొట్టి వడదాఁకి తనువునలఁగు
జన్నోదకంబు లాయాయి వేళలలేక యొకరోగమెద్దియే నుద్భవించు

వలనిాటి క్రూరసత్త్వము లాగ్రహంబునఁ బయివచ్చెనేని నొప్పమి ఘటిల్లఁ
దటివేచి పొదలలోఁ దఱుఁగాఁటున శత్రువరుఁ గాఁచినఁ బ్రాణహానిపుట్టు

తే. నన్యాయాగతధర్మంబు లాచరింపఁ, గాలవేళలు తప్పఁటఁ గలుమ మందు
వందు నష్టశబోఁదు రాజ్యాభివృద్ధి, వలనుగానిది వేఁట భూవగతనూజ. 165

సీ. త్రావియానాఁడు మత్తాగొనిపారలాడు నెఱుఁగఁ డుల్లములోన నెదరిదన్నుఁ
బనిలేకచూపుఁ గోపప్రసాదంబులు భావింపనేరఁడు వావివరుస
విప్రలాపములాడు విమవనివేలంబు నూటనొక్కటిశేదు మాటనిజము
గుప్తిసేయఁగనోపఁ డాప్తగహస్యంబు తైన కౌములు దెలియంగలేఁడు

తే లజ్జవొలియించుఁ దాలిమి యఁజ్జగించు, నిందకొడిఁగట్టు శీలంబు చిందఁజేయు
బ్రహ్మహత్యాది ములునూపు పాపవితతి, పానగోష్ఠివిధంబు భూపాలపుత్ర. 166

సీ. తల్లిదండ్రులకు డెందము విరక్తిభజించు నన్నదమ్ములకు పేరాసపడును
గులకళత్రము పుట్టినిలు సేరనూహించుఁ బ్రాణమిత్రుండును బగతుఁడగును
బావలు మఱఁదులేస్పద మోముఁజూడరు దాసదాసీజనుల్ వేసరుదురు
తలఁగిపోవుదురు తాతలనాఁటి హితులు జుట్టాలు మేల్గనుమాటయు నడుగరు

తే. పాలనము సేయు చేపట్టి ప్రజలఁ బాపు, సకలజనులకు నట్టింటి శత్రుఁ జేయు
నయము కెడయాళ యెల్లవెంటలను జెఱచు, మాటపరుసదనంబు కుమారచంద్ర.

సీ. అపరాధమునకు సర్వ్వముగాళ వెగ్గలంబగు శిక్షఁ బ్రజచాల వెగడుగుడుచు
బెగడొంది మనసునఁ జేఁడెత్తి నిలువక వేటొందు కడఁగాపు విచ్చిపోవు
వినయ హీనతఁగాపు విచ్చిపోనిచ్చిన నచిరంబ పాగడయగు ధరిత్రి
ధరణిపాడయైన సరిగోరు మొలవలుగాఁ దనకు ఘటిల్లు నాదాయనష్టి

తే. ధాన్యధనములయందు నాదాయనష్టి, యైన నిర్ధనుఁడగు ధనహీనుఁడైనఁ
దొడిగి పట్టుదరిద్రంబు దొలఁగులక్ష్మి, యుగ్రదండంబునను నృపాలాగ్రనాతి.

సీ. ధీజనస్తుతముగా దేహసౌఖ్యమున నంకిలిలేక యుండ భోగించుచోటు
బడి,దప్పి నిరయరూపములఁ జూడక యుండఁ దిగిచి ధర్మంబుసిద్ధించుచోటు
వృద్ధభాజులు గారవించు లోకత్రయీవర్తిని యగు కీర్తి వచ్చుచోట
నవిశంకతోడ మూఁడవయుపాయంబున వైరిదుర్గంబులు చేయుచోట

తే. బుధుల హితులను బంధులఁ బ్రోచుచోటు, నెంతచేసిన నది ఫలియించుఁగాని
వల దపర్థకములు సొమ్ము వమ్ముసేఁత, మతిఁ దలంప రాజాన్వయక్షితిపహంస.

చ. కెలఁతయు జూదమున్ బగటినిద్రయు వేఁటయుఁ బానము న్సదా
పలువని నిర్గమంబుఁ బరివారము వాద్యము నాటపాటలు
న్నిలవగు కామజంబులివి యిందఱిసక్తుఁడు గాక మైవడిన్
వలయు నొనర్ప నెందు దళవర్గము నృపవంశభూషణా 170

క. అంగములు పతికి విను స, ప్తాంగములును వానిఁ దగు సమంచితగతి సా
రంగాంక వంశతిలక ప్రా, సంగును రక్షించుటొనఁగ జనసాధుపక్షా. 171

సీ. శక్తిత్రయంబునఁ జతురుఁడై చతురుపాయంబులకును సమయంబెఱింగి
పంచేంద్రియముల నిర్జించి ప్రాయత్తుఁడై షడ్గుణీకరిసుఁ బ్రశస్తిఁ గాంచి
వ్యసనంబులేడును వర్జించి రాజదోషములు పద్నాల్గుఁ జిత్తమునఁ దెలిసి
సాక్షిమాత్రంబుగా సచివుఁ బ్రతిష్ఠించి యాత్మయత్నము లేకపుంతయైన

తే. నింగితాకారచేష్టల నెఱుఁగనీక, పరుల నెవ్వరి విశ్వసింపక సునమున
సంతతంబు శరీరగరక్షణంబు, లేకుఱక యుండవలయు మహీవిభుండు. 172

సీ. పతిహితుండతిధర్మపరుఁడు నీతిధురీణుఁ డింగితజ్ఞుండు జితేంద్రియుండు
మంత్రరక్షకుఁ డన్యమర్మభేది ప్రజానురాగి కృతజ్ఞోత నీరాగిభోగి
సముచితయత్నతరస్వియుత్సాహవిముఖుండు శాంతుఁ డతిప్రౌఢ సత్యవాది
పరధన పరదార పరపరివాదవర్జితుఁడు ప్రఖ్యాతుండు శ్రీకరుండు

తే. బ్రాహ్మణుఁడు మంత్రిగాఁ దగుఁ బరిగణింప, గుణములిట్టివిగా సమకూరెనేని
క్షత్రియుని శూద్రునిం దప్ప సచివపదవి, వైశ్యునిలుపంగఁ దగవు భూవల్లభునకు.

సీ. ధారిమి భృత్యుఁ డెక్కుడు లావు వలచేయు మతిరంజకుఁడు పీఠమర్దకుండు
కట్టిన యలుగు సంగరసహాయుఁడు మాని మఱుఁగు పెట్టినకోట మంత్రహితుఁడు
చనవరి దొర ప్రతిజ్ఞాపాలకుఁడు బహిఃప్రాణంబు పట్టపు భద్రగజము
ముంగొంగు పసిఁడి సప్తాంగరక్షకుఁడు చేదోడు నెచ్చెలి కాఁడు తోడునీడ

తే. యనఁగ నిన్నిగుణంబుల నావహిల్లి, పాలు నీరును బోలి యేర్పఱుపరాని
సముచితస్నేహమున నెడసందు లేని, మిత్రవర్గంబు వసుధాకళత్రునకును. 174

సీ. తన యేలు వసుమతీజనుల పీడింపక యేఁకి మొదలిచ్చి కోరుపాలు
సవరగాఁ గొంచు దండువులు దర్శనములు కొలాసగొన కూళ్ళు గుత్తకీక
కమ్మతంబులు వెట్టి గనులు ద్రవ్వించి బేహారఘటించి యన్యాయధనము
కోరనీక షష్టాంశ మతిగొంచు నీతిబాధలు ఘటింపక యుండ ధనముగూర్చి

తే. దానిఁ జతురంశములుచేసి దానధర్మ, ములకు నొకపాలు గైకొని మూఁడుపాళ్ల
నెచ్చుమానక రానీక యచ్చువొడిచి, దాపవలయు విభుండు భండారమునను.

సీ. ఏటికాల్వలు పరిపాటిగాఁ దీర్పించి చెఱువుల నీరండు నొలపుదెలిసి
దేవమాతృకలు నదీమాతృకలునైన గ్రామసీమ క్షేత్రగతులు దెలిసి
నీరు నేలలు వానకారులు పరికించి పరిపాలంబుల పంట వలఁతు లరసి
కోరాయములు వచ్చుకోలఁది విచారించి పదియాళ్లకొకరిఁ దీర్పతిగఁ జేసి
తే. చనవువారలు పనివారు శాత్రవులును, జోరులును జేయుబాధలు జేరకుండఁ
బ్రజలఁ బాలించుకొనుచుఁ దత్పరత సాను, రాగుఁడై ప్రోవవలయు రాష్ట్రంబు రాజు.

సీ. అఖండిత యాశఁ నీరగునట్లు త్రవ్వించి ప్రాక్తడంబులతోడఁ గోటఁ దీర్చి
యట్టప్లకల్పించి యుద్వారి విరివిగా పలనొప్పఁ బెట్టించి కనకధార
కవనులు పరిపాటిగా వినిర్మింపించి లోసనూతులు బావులును నగాధ
జలములు గాఁ జాలఁ గలిగించి గసఁగ్గములు వేల సంపూర్ణములుఁ జేసి
తే. చుట్టు నాగడచుట్టును సూదిమోప నెడముకల్గకయుండఁ జేరడవి పెంచి
నగసమీపంబుగల పట్టణంబు రాజ, ధానిగా నుండుటురువగు ధరణిపతికి. 177

సీ. తత్తిపోడ జీతంబు కొఱఁత గాకుండ రొక్కంబు భండారుధనంబయిచ్చి
బంటుఁ దొలంగించి ప్రతియు పెట్టకయుండ గమలెక్క తప్పవగాకయుండఁ
గడఁగి వేశ్యాగామి గాకుండఁ బరికించి ప్రతిభానువారంబు భటులతోడు
జూచుచుఁ దనవన్నె జోకరైయుండినవాని మన్నించుచు లేనివాని
తే. నాజ్ఞసేయుచు జీవిక కష్టపడక, యుండఁ బరికించికొనుచు నాయోధనమున
నైనుపదిసేయ నుత్సాహియైన యాస్త, బలము నేలఁగవలయు భూపాలకుండు.

కం. అని యిది మొదలుగ మతియును, జనపతులకు వలయు నీతి సమధికబుద్ధిన్
జనపాలవందనునకును, మునిపాలుఁడు చెప్పె యుల్లమున ముదమొదవన్. 179

వ. ఆశీర్వదించి దుష్యంతు నభినందించి కణ్వమునీంద్రుండు పుత్తెంచిన శకుంతలం దోడ్కొనివచ్చిన మునులను మునిపత్నులను జననాయక ప్రియంవదలను బ్రియపూర్వకంబుగ సముచితప్రకారంబుల ననిపించి దుష్యంతుని వదనంబువం జూడ్కి నిలిపి నరేంద్రచంద్ర యింద్రునకు జయంతునిం బోలె నితాంతప్రీతి నీకు శాకుంతలుండు సంపాదింప శంపాంబుధరంబులం బోలె శకుంతలయును నీవును నితాంతసౌఖ్యవంతుండవై రాజ్యసుఖం బనుభవింపుమని దీవించి యాశ్రమంబునకుం బోయెద ననిన భూమింజయుండు శంపాసనతనూజునకు నంజలిచేసి మఱి భణితి నిట్లనియె.

సీ. ఇందువంశజులలో నేఁగృతార్థుఁడనైతి నాజన్మ మధికధన్యత వహించె
రాజలోకములు చేరవుకన్న నిందుండి మంగళంబులకు సద్మంబనైతి

నంతరాయములు తొలఁగెంద రాజ్యరమాభివృద్ధికి సంశయంబు వానెఁ
బుణ్యంబులెల్ల నిప్పుడ చాలఫలియించె సంహాస్యముచ్చయం. బణఁగిపోఁడు

తే. వెన్నెకయు నెక్క మద్వంశ మితరవసుధ, తీశ్వరులలోన నాసరి యిండ్లలోన
సంయమీశ్వరతిలక యిచ్చటికి మీరు, చిరకృపాసతితోడ విచ్చేయుటయును.

వ. అని బహుప్రణామంబులాచరించి విరించినందనుననిచి కుమారుండు యువరాజపట్ట భద్రుండై సకలమహీచక్రంబు నవక్రపరాక్రమంబున ననన్యసామాన్య సౌజన్యంబునఁ బాలనంబునం బ్రజలును లాలనంబున బంధులోకంబును బరమానందంబు నొందఁ జరింప శకుంతలయుం దుష్యంతుఁడును పెద్దకాలంబు పూజ్యంబగు రాజ్య సౌఖ్యంబు ననుభవించుచుండె. 182

శా. కంఠాటోపమ ధైర్య విభ్రమవతీకందర్ప దర్పద్విప
తత్కంఠాలామృతధామ ధీమహిత వారాశ్యన్వయగ్రామణీ
మంటీపూర్వసరోజ పూజన మహీమందార లోకత్రయీ
కంఠాపోహితకీర్తి మౌక్తిక సుధామాధుర్య వాగ్వైభవా. 183

క. హారిదంతదంతిదంత, స్థిరకీర్తి విహార సకల ధీజనవినుతా
గురుధిషణ ధర్మమోదక, శరనిధిగాంభీర్య బంధుసముచితరక్షా. 184

మాలిని. సతతసుకృతభాజా సంతతశ్రీబిడౌజా, క్షితిజనసురభూజా చింతితత్యాగభోజా
ప్రతినవరవితేజాభవ్యభాషాపరాజా, హతవిమత సమాజాయన్నమాంబాతనూజా.

గద్యము. ఇది శ్రీ భారతీతీర్థ గురుచరణ కరుణాలబ్ధ సిద్ధ సారస్వత
పవిత్ర గాదయామాత్యపుత్ర యారాధితామరవీరభద్ర
పిల్లలమఱ్ఱి పినవీరభద్ర ప్రణీతంబైన శృంగార
శాకుంతలము నందు సర్వంబును
చతుర్థాశ్వాసము
సమాప్తము.



శ్రీ మేకీప్రెస్, రాయవరము 1930